# యువ

## దీపావళి ప్రత్యేక సంచిక

*ఈ సంచికలో...*

శ్రీమతి భానుమతీ రామకృష్ణ వాసిరెడ్డి సీతాదేవి,
ఇల్లిందల సరస్వతీదేవి, మాదిరెడ్డి సులోచన, డా॥ సి. ఆనందారామం,
కావిలిపాటి విజయలక్ష్మి, పవని నిర్మల ప్రభావతి, పోల్కంపల్లి శాంతాదేవి
తెనాలి సుశీలాదేవి, హితశ్రీ, శ్రీధర, సి. యస్. రావు, ద్విభాష్యం రాజేశ్వర
రావు, వి. రాజారామమోహనరావు, కెంపోరావ్, మధురాంతకం రాజారాం,
ఇసుకపల్లి లక్ష్మీనరసింహ శాస్త్రి, యామిని, శ్రీరాజ్,
జీడిగుంట రామచంద్రమూర్తి మొదలైనవారి కథలు;

డా॥ జయదేవ్ బాబు, బాబూ, ఇతర ప్రముఖ చిత్రకారుల బొమ్మల కథలు, కార్టూనులు కాక ఒక పూర్తి నవల వుంటాయి.

వడ్డాది పాపయ్యగారి ముఖచిత్రం, లోపలి వర్ణచిత్రాలు.

**మీ కాపీని నేడే మీ ఏజంటువద్ద రిజర్వు చేసుకోండి.**

వెల : ఎనిమిది రూపాయలు

ఆంధ్రప్రదేశ్ అంతటా

విజయవంతంగా ప్రదర్శింపబడుతోన్న





# యువ

సచిత్ర మాసపత్రిక

సంస్థాపకులు : చక్రపాణి

సంపుటి 40 నవంబరు 1979 సంచిక 5


మన దేశంలో, ముఖ్యంగా మన రాష్ట్రంలో, పంచదార పరిశ్రమ చాలా చిక్కులో పడింది. ప్రస్తుత ప్రభుత్వ విధానంలో వెంటనే మార్పువచ్చి, పంచదార ధరను కొంత పెంచకపోయినట్లయితే, చాలా పంచదార ఫాక్టరీలు విపరీతమైన నష్టాలపాలు కావడమే కాకుండా, ఇక ముందు నడవలేని పరిస్థితి కూడా ఏర్పడవచ్చును.

పంచదార భూమినుంచి త్రవ్విన ఏవో ముడివస్తువులతో తయారయ్యే పదార్థంకాదు. పంచదార తయారుకావాలంటే మూడు వర్గాల సహకారం కావాలి. రైతులు చెరకు నాటి, జాగ్రత్తగా కాపుకు వచ్చేటట్టు చూసుకోవాలి. ఫాక్టరీలలో పనిచేసేవారందరూ, చెరకును పంచదారగా మార్చాలి. ఫాక్టరీ పని చెయ్యడానికి వాటాదార్లు పెట్టుబడి పెట్టాలి.

చెరకు ఉత్పత్తిదారులకు సరియైన కిట్టుబాటు లేకపోతే చెరకు పంటను వెయ్యరు. ఈనాడు నాటిన చెరకు ఫలసాయానికి రావాలంటే, రెండు సంవత్సరాలు పడుతుంది. ఆ రెండేళ్ళలోనూ చెరకుతోటలమీద పెట్టిన పెట్టుబడికీ, ఆ తోటలు సరిగా ఎదగడానికి చేసే కృషికి అయ్యే ఖర్చుకీ తగిన గిట్టుబాటు లేకపోతే, రైతులు చెరకు తోటలను వెయ్యరు.

చెరకుకు తగిన ధర ఇచ్చేవారు ఎవరు? ఫాక్టరీ నిర్వాహకులు. చెరకు నుంచి సరియైన దిగుబడి వచ్చి, పంచదారకు సరియైన ధర పలికితేనే, చెరకు ఉత్పత్తిదారులకు సరియైన ధరను ఫాక్టరీ నిర్వాహకులు ఇవ్వగలరు.

ఒక చక్కెర ఫాక్టరీని నిర్మించడానికి అధమం నాలుగైదు కోట్ల రూపాయలు అవుతుంది. అంత డబ్బు ఏ ఒక్క వ్యక్తీ పెట్టలేడు. చాలామంది, అంటే కొన్ని వేలమంది, వాటాదార్లు కలిసి పెట్టుబడి పెడతారు. ఏ బ్యాంకిలోనో వేసుకుంటే వచ్చే మాత్రమైనా డివిడెండు రాకపోతే వాటాదార్లు పెట్టుబడి పెట్టరు.

ఇక ఫాక్టరీ పనివారి జీతాలు. ఈ జీతాలను ప్రభుత్వం నియమించిన వేతన నిర్ణాయక సంఘం నిర్ణయించిన ప్రకారం ఫాక్టరీ ఇచ్చి తీరాలి.

గత ఏడెనిమిదేళ్ళగా, మన దేశంలో వస్తువుల ధరలు పెరిగిన రీతి చూస్తే, ఒక్క పంచదార ధర మాత్రమే దాదాపు ఏమీ పెరగకుండా నిలిచిపోయింది. వేరుశనగ నూనె, చింతపండుల ధర పెరిగిన మాత్రం కూడా పంచదార ధర పెరగలేదు.

నిత్యావసర వస్తువుల ధరలు ఎక్కువ పెరగడం మంచిదికాదు. సామాన్య కుటుంబీకులకు అది చాలా దుర్భరమైన పరిస్థితి. అయితే, అన్ని వస్తువుల ధరలూ విపరీతంగా పెరుగుతూ వుంటే, పంచదార ధర మాత్రం ప్రభుత్వ నిర్ణయ ప్రకారం పెరగకుండా వుండడంవల్ల ఒక ముఖ్యమైన పరిశ్రమ మళ్ళీ కోలుకోలేనంతగా దెబ్బతింటున్నదే అనే విషయాన్నే ముఖ్యంగా చెప్పదలచుకున్నాము

పంచదార ధరలను ఏ రీతిగా నిర్ణయించాలి అనే విషయంలో సూచనలు చెయ్యడానికి నాలుగేళ్ళనాడు ఒక కమిటీని ప్రభుత్వం నియమించింది. ఆ కమిటీ, అన్ని విషయాలనూ పరిశీలించి, తన అభిప్రాయాలనూ, సూచనలనూ ప్రభుత్వానికి సమర్పించింది. కాని ఆ సూచనలను ప్రభుత్వం అమలులో పెట్టలేదు.

ఆంధ్రప్రదేశ్‌లోని ముఖ్య పరిశ్రమలలో ఒకటైనదీ, కొన్ని లక్షలమంది వాటాదార్లు కోట్ల రూపాయలు పెట్టుబడి పెట్టినదీ, కొన్ని వేలమంది ఉద్యోగాలకు ఆధారభూతమైనదీ అయిన, యీ పంచదార పరిశ్రమ విషయమై రాష్ట్ర ప్రభుత్వం ఎక్కువ శ్రద్ధ వహించి, పంచదార ధరను కొంత ఎక్కువగా

నిర్ణయించేటట్లు కేంద్ర ప్రభుత్వానికి నచ్చచెప్పకపోతే, పంచదార ఫాక్టరీలు చాలా నష్టపడతాయి. చెరకు ఉత్పత్తిదారులకు తగిన రీతిగా ధరను ఇవ్వజాలవు చెరకు పంట తగ్గుతుంది. అప్పుడు పంచదార కొరత విపరీతంగా ఏర్పడుతుంది కోట్ల రూపాయలను వెచ్చించి దిగుమతి చేసుకోవలసి వుంటుంది.

కాబట్టి పంచదార ఫాక్టరీలు పంచదారను అమ్మవలసిన ధరను వెంటనే కొంత ఎక్కువ చెయ్యాలి. అలా చేస్తేనే యీ పరిశ్రమ నిలబడుతుంది.

---

## నవంబరు నెల యువ భావపరిచయ పోటీ

### రూ. 25-00 బహుమతి పొందిన వ్యాఖ్య

*భూతకాలమె మేలు భవిష్యత్తు మాడ*
*చెప్పకనే చెపుతోంది బూతద్దపునీడ*

కె. లక్ష్మీరమణ, నర్సింగపురము

---

# నవంబరు నెల క్విజ్

## సమాధానాలు

1 — డి  2 — సి  3 — డి

4 — డి  5 — సి

6. కొలంబస్ వెస్టిండియా దీవులు కనుగొనుట 7. రెండు సంవత్సరాలలోపు
8. నార్తుపోల్ 9 ఎఫిల్ అలగ్జాండర్ గుస్టావ్ 10. రాన్ డల్ఫ్ బూట్

నవంబరు నెల క్విజ్‌కు సరైన సమాధానము ఒకరే పంపినారు.

కె. కృష్ణమూర్తి, శ్రీకాళహస్తి వారికి రూ. 116-00 లు పంపడమైనది.

# చిత్రవార్తలు



ఆంధ్రప్రదేశ్ క్రొక్విల్ క్లబ్, విశాఖ విభాగం ప్రారంభం. 15 ఆగస్టు 1979న సమావేశమైన కార్టూనిస్టులు శ్రీయుతులు 'అమ్మాజీ' 'విజయ', శ్రీ అప్పరి నరసింహం, శ్రీ మధ్యాహ్నపు లీలానంద్, సుధాకర్, ఓంకార్ తదితర సభ్యులు

---

28-8-79న గవర్నర్ శ్రీ కె.సి అబ్రహాం, జవహర్‌లాల్ నెహ్రూ టెక్నాలాజికల్ యూనివర్సిటి 4వ స్నాతకోత్సవంలో ప్రతిభావంతులయిన విద్యార్థులకు బహుమతులు ప్రదానం చేశారు.





26-8-79న కార్మికమంత్రి శ్రీ జి. వెంకటస్వామికి 'శ్రామిక బంధు' బిరుదు ప్రధానం జరిగింది. ఈ సందర్భంగా ఏర్పాటైన సభలో గృహనిర్మాణ మంత్రి కె. రంగారావు, ముఖ్యఅతిధి శ్రీ టి. సుబ్బరామిరెడ్డి, ఎక్సైజ్ మంత్రి పి. గంగారెడ్డి.



1-9-79న హైదరాబాద్ బేగంపేట విమానాశ్రయంలో రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డి ఆగమనం. కేంద్రపరిశ్రమల శాఖామంత్రి శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి, ముఖ్యమంత్రి డా॥ చెన్నారెడ్డి ప్రభృతులు.



సెప్టెంబరు 7 నుండి 9 వరకు అనావృష్టి ప్రాంతాలయిన కర్నూలు, కడప, అనంతపూర్,
చిత్తూర్, మహబూబ్‌నగర్, నల్గొండ జిల్లాలలో పర్యటించారు ప్రొద్దుటూర్‌లో
బహిరంగసభలో ప్రసంగిస్తున్న ముఖ్యమంత్రి డా॥ చెన్నారెడ్డి.



ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ, తెలుగు సాంస్కృతిక సమితి, మద్రాసు
విభాగంవారు ప్రదర్శించిన 'దొంగాటకం' నాటకంలో డా॥ చంద్రశేఖరం,
కుమారి మీనాకుమారి. ముఖ్య అతిథులుగా శ్రీ గుమ్మడి, గొల్లపూడి విచ్చేశారు.

# జింక్ లోపమా?
# పుష్కలమైన పంట దిగుబడికి





# అన్నపూర్ణ
## జింక్ సల్ఫేట్ సంపూర్ణ సహకారం అందజేస్తుంది

పంట పెరుగుదలకు కావలసిన పోషక పదార్థాలలో జింక్ అతి ముఖ్యమైనది. భూసారంలో తగినంత జింక్ లేనట్లయితే పంట పెరుగుదల దెబ్బతింటుంది.

మీ పైర్లు జింక్ లోపంతో అధిక దిగుబడిని యివ్వటం లేదా? మీరు విచారపడనవసరంలేదు-అన్నపూర్ణ జింక్ సల్ఫేటును సిఫార్సు చేయబడిన మోతాదులో ఉపయోగించి మీ భూసారాన్ని వృద్ధిచేయండి. మీ పైర్లు ఆరోగ్యవంతంగా పెరగడాన్ని మీరు త్వరలోనే గమనిస్తారు. అధిక దిగుబడిని నిశ్చితంగా సాధిస్తారు.

**అన్నపూర్ణ జింక్ సల్ఫేటు**

- 22 నుంచి 24 శాతం వరకు మెటాలిక్ జింక్ కలిగి యున్నది
- హెక్టేరుకు 50 కి. గ్రా. చొప్పున మూడు కాలాల్లో ఒక సారి దుక్కిలో, సాధారణ మోతాదుగా ఉపయోగించవచ్చును
- జింక్ లోపం ఉన్న చవుడు భూములలోనయితే హెక్టారుకు 100 కి. గ్రా. వరకు సాధారణ మోతాదుగా వాడవచ్చును.
- జింక్ లోపం పైరుమీద కనబడితే జింక్ సల్ఫేటును మూడుసార్లు పిచికారి చేయవచ్చును
- జింక్ సల్ఫేటు మరియు సూపర్ ఫాస్ఫేటు వేరువేరుగా 48 గంటల తేడాతో ఉపయోగించాలి
- మీ సౌకర్యంకోసం 50 కిలోల పాలిథీన్ సంచులలో లభిస్తుంది

రైతుల పాలిటి
కామధేనువు - **అన్నపూర్ణ**

ఉత్పత్తిదార్లు
**పారమౌంట్ ఆగ్రో కెమికల్స్ ప్రైవేట్ లిమిటెడ్**
90 డి రోడ్ నం 14 ఐ.డి.ఎ. జీడిమెట్ల
హైదరాబాదు - 500 854
(ఎ.పి. స్టేట్ ఆగ్రో ఇండస్ట్రీస్ కార్పొరేషన్ లిమిటెడ్ వారితో ఉమ్మడి యాజమాన్యంగల సంస్థ)

"సాంప్రదాయ సిద్ధమయిన
భారతీయ ఔషధాలకి
ప్రత్యేకమయిన శక్తివుంది.

ఉదాహరణకి,
అమృతాంజన్."




ప్రకృతిలో లభించే అత్యంత శక్తివంతమయిన పది మూల ఔషధాలతో అమృతాంజన్ తయారు చేయబడుతోంది. అంటే అమృతాంజన్ చాలా శక్తివంతమయినది.

అందుచేత అమృతాంజన్ తలనొప్పులకు, జలుబులకు, వంటినొప్పులకు, బెణుకులకు శీఘ్రంగానూ, నిశ్చయంగానూ ఉపశమనం కలిగిస్తుంది. అంతేకాదు అమృతాంజన్ సురక్షితమయిన బాధా నివారిణి.

అమృతాంజన్: 80 సంవత్సరాలకు
పైబడిన నమ్మకమైన దివ్య ఔషధము



**అమృతాంజన్**
**తలనొప్పులకు. జలుబులకు.**
**వంటినొప్పులకు. బెణుకులకు**

AM-2148

ఎం. కృష్ణ



# చంద్రుని చూచిన కలువలు

రాము బి.ఎ. అయిన తర్వాత, తనకు సరిపడే ఒక చిన్న ఉద్యోగం చూసుకొని జీవితాన్ని హాయిగా గడిపేద్దామని కలలు కన్నాడు. కాని అతని బి.ఎ. పూర్తి కాలేదు. అతను కలలుకన్న జీవితం నిజం కాలేదు.

రాము తండ్రి శివరావు, ఒక యింజినీరింగు కంపెనీలో గుమాస్తా. తండ్రి

బలవంతంవల్ల రాము, ఒక మందుల షాపులో "సేల్స్‌మాన్"గా చేరాడు. [illegible] యజమాని విసుగుదలకి, కొంతమంది స్నేహితుల చులకన చూపులకి నిలువలేకపోయాడు. ఇంట్లో తండ్రి తిట్లే [illegible] యతనికి. ఇక షాప్‌లో "సేల్స్‌మాన్‌గా" పనిచేయ్యకూడ దనుకున్నాడు.

ప్రస్తుతానికి కతనికి పనిలేదు. మంచం మీద పడుకొని అర్థంలేని పుస్తకాలు తిరగేస్తూ, అట్లాంటి ఆలోచనలలోకి దిగజారిపోసాగాడు.

కొంతకాలం, వీధి చివరి డాబాయింటి అమ్మాయి రాముపైపు ఆసక్తిగా చూసేది. అది గమనించిన రాము తబ్బిబ్బయి పోయి, ఆమెని ప్రేమించేసాడు.

ఇప్పుడు ఆ అమ్మాయి, రాముని కన్నెత్తి చూడదు. రంగు రంగుల చొక్కాలతో, పెద్ద పెద్ద బెల్‌బాటమ్ పాంట్లతో, చక్కగా 'స్టెప్' కటింగు చేయించుకున్న జుట్టుతో, ఆకర్షణీయంగా కనపడే ఎదురింటబ్బాయిని చూసి చిరునవ్వులు చిందిస్తుంది.

ఇది గమనించిన రాముకు ఆమెపై విపరీతమైన కోపం వచ్చింది. కక్ష తీర్చుకోవాలనిపించింది. ఆ విషయం తీవ్రంగా ఆలోచించాడు.

'ఇది తన అసమర్థత!'

'అవును! తండ్రి, తల్లి, మందుల షాపు యజమాని అందరూ యిలాగే అన్నారు. ఇప్పుడు తనే తిట్టుకుంటు న్నాడు. హూ!'

'ఇలా తిట్లు పడుతూనే వుండాలా?' ప్రశ్నించుకున్నాడు.

'దీనినుండి తప్పించుకోవాలంటే తనేదో వో గొప్ప పని చెయ్యాలి'.

'ఏం చెయ్యాలి?'

మానసికంగా దిగజారిపోయిన రాముకి చుట్టూ అంధకారం తప్ప అవకాశం కనిపించలేదు. 'తను అసమర్థుడు.' ఆ ఆలోచనకే పూర్తిగా లొంగిపోయాడు.

వెతకగా, వెతకగా, ఈ బాధలనుండి తప్పించుకోడానికి ఒకటే మార్గం కనిపించిందతనికి.

'మృత్యువు!'

'అవును, తను చచ్చిపోవాలి. చచ్చిపోతే హాయిగా ఏ బాధలూ వుండవు. చచ్చిపోవాలి! చచ్చిపోవాలి!! తను చచ్చిపోవాలి!!!'

'ఆత్మహత్య మహా పాపమంటారు!'

'పాపం! హు!! ఎంతమంది ఆత్మహత్యలు చేసుకోవటంలేదు!' సమాధానం చెప్పుకున్నాడు.

'ఎలా చచ్చిపోవాలి?'

'ఊరి చివరి చెరువులో దూకితే....!

హో! వద్దు, తనకి యీత రాదు. నీళ్ళల్లో మునిగిపోతూ....వూపిరాడక గిల గిలా కొట్టుకుంటూ....' అటుపైన ఆలోచించ లేకపోయాడు.

తిరిగి ప్రారంభం.

'రైలు క్రింద తలపెట్టేస్తే....అబ్బ ....మొండెం, తల వేరైపోయి, తల ఎక్కడో దొర్లుతుంటే...' తలని తల గదలో పొర్చేసుకున్నాడు.

'తను యింత ఘోరంగా చచ్చిపో కూడదు. త్వరగా, తనకు తేలిగ్గా వుండే చావు చావాలి.'

'ఉరిపోసుకుంటే ... ' ఆలోచించి, ఆలోచించి ఒక నిర్ణయాని కొచ్చాడు.

ఆ రాత్రి మామూలుగా భోజనంచేసి పడుకున్నాడు. ఆలోచిస్తున్నాడు. నిద్ర పట్టడంలేదు. గంటలు గడిచిపోతు న్నాయి. ఇంట్లో అందరూ పడుకున్నారు. చిమ్నీలేని దీపం వెలుగులో అతను మంచంమీద నుండి లేచాడు. నెమ్మదిగా తన పుస్తకాలబల్ల దగ్గరికి వెళ్ళాడు. అతని చేతులు వణికిపోతున్నాయి. ఒళ్ళంతా చెమటపడుతూంది. కళ్ళు మండు తున్నాయి. శరీరం తేలిపోతున్నట్లుగా వుంది. ఒక కాగితాన్ని చింపి బాల్ పాయింట్ పెన్నుతో వ్రాయడం ప్రారం భించాడు.

"అందరికీ,

నేను ఆత్మహత్య చేసుకుంటున్నాను. నా చావుకి ఎవరూ బాధ్యులు కారు. నేను అసమర్థుణ్ణి. అందుకే చచ్చిపోతున్నాను. నా గురించి ఎవ్వరూ ఏడవద్దు

ఇట్లు

రామారావు."

అతని ముఖం బిగుసుకుపోయి వుంది. శరీరంలోని నరాలన్నీ ఉబ్బి బిగువుగా ఉన్నాయి. ఇంకా ఎంతో వ్రాయాలని వున్నా, వ్రాయలేక వణుకు తున్న చేతులతో సంతకం చేసి, అందరికి కనబడేటట్లు బల్లమీద వుంచాడు. చప్పుడు చెయ్యకుండా సందు తలుపు తీసుకుని బయటినుండి ఒక తాడు తీసు కొని వచ్చాడు. వంటింట్లో చీకటిగా వుంది. జాగ్రత్తగా తడుముకుంటూ మూడు పీటల్ని ఒకదానిపైన ఒకటి పెట్టాడు. అతని గొంతులో తడారి పోయింది. దాహంగా వుంది. బిందెలో మంచినీళ్ళు గొంతులో పోసుకున్నాడు. పక్క గదిలో వున్న అక్కల్నీ, చెల్లినీ చూడాలనిపించింది. నిర్మలంగా నిద్ర పోతున్న వారి ముఖాలని చూసాడు.

'ఇక యీ జన్మలో తను వాళ్ళని చూడలేడు!

వంటింట్లోకి వెళ్ళాడు. పీటలమీద నిలబడి తాడు వాసానికి కట్టాడు. ఒక చేత్తో తాడుని పట్టుకొని పైకి చూస్తూ ఆలోచిస్తున్నాడు.

'తెల్లవారేసరికి తను యీ తాడుకి వ్రేలాడుతుంటాడు. కళ్ళు రెండూ పైకొచ్చి, నాలుక బయటికి వ్రేలాడుతూ, పాదాలు రెండూ క్రిందికి వాలిపోయి వ్రేలాడుతు టాడు. ప్రొద్దుటే అందరి కన్నా ముందుగా లేచి దేవుడికి దణ్ణం పెట్టుకుని, యింటిపన్లు ప్రారంభించే చిన్నారి చెల్లి, దూలానికి వ్రేలాడుతున్న

తనని చూసి....అందరూ లేస్తారు.... నాన్న....!'

ఒక్కసారిగా అతనిలోవున్న బిగువు సడలిపోయింది. గొంతులోంచి వెక్కిళ్ళతో ఏడుపు పొంగుకొచ్చింది. ఉన్నట్లుండి ఎక్కడలేని నీర్సమొచ్చేసింది గబగబా తాడు విప్పేసాడు. పీటలు ఒకపక్క సర్దేసి, కిటికీలోంచి తాడు బయటికి గిరవాటు వేసాడు. పుస్తకాలబల్ల దగ్గరకొచ్చి ఉత్తరాన్ని తీసి చింపెయ్యబోయాడు. మర్నాడు బయటికెళ్ళినప్పుడు ఎక్కడైనా చింపి పారెయ్యవచ్చనుకొని, గోడకి తగిలించి వున్న వెలిసిపోయిన కాఫీపొడుంరంగు చొక్కా జేబులోంచి ఒక పాకెట్ డైరీ. తీసాడు. అది 1957వ సంవత్సరపు డైరీ. అట్టలేక నలిగిపోయుంది. ఆ డైరీ రాముకి మందులషాపులో వుండగా దొరికింది. అందులో అక్కడక్కడ ఏదో యింగ్లీషులో వ్రాసి వుంది. రాము మిగిలిన పేజీలలో తన 'యింపార్టెంట్ విషయాలు' వ్రాసుకుంటూంటాడు. ఉత్తరాన్ని మడతపెట్టి అందులో వుంచి, పెద్దదిగా వున్న చొక్కా జేబులో ఆ చిన్న డైరీని పెట్టాడు నీర్సంగా వెళ్ళి మంచం మీద వాలిపోయాడు.

'ఆత్మహత్య పిరికివాళ్ళ లక్షణమంటారు!'

'కాదు! ఆత్మహత్య చేసుకోగలిగిన వాడు చాలా ధైర్యస్థుడు. ఆత్మహత్య మహా పాపమనే వాళ్ళే పిరికివాళ్ళు. తను కూడా పిరికివాడే!'

తెల్లగా తెల్లవారింది. రాము ఆలస్యంగా నిద్ర లేచాడు. రోజంతా బద్ధకంగా గడిచిందతనికి. సాయంత్రం తల్లి కూరలు తెమ్మంది. సంచీ, డబ్బులు తీసుకొని,

"అమ్మా! వెళ్ళొస్తా!"

గేర్‌కేస్ లేకుండా, దూరం నుండి కూడా తుప్పు పట్టినట్లు కనబడే తండ్రి 'మేడిన్ యింగ్లాండ్' సైకిలు మీద బయలుదేరి వెళ్ళాడు. కూరలు కొన్నాడు. ఇంటిముఖం పట్టాడు.

సూర్యుడు పూర్తిగా అస్తమించాడు. చీకటి ముసురుకుంటూంది. సైకిలుకి లైట్ లేదు. రోడ్డు ప్రక్కన ఉన్న ట్యూబులైట్లు కొన్ని వెలుగుతున్నాయి. రోడ్డుమీద జనం పల్చగా ఉన్నారు. బస్సులు, లారీలు అప్పుడప్పుడు వేగంగా దూసుకుపోతున్నాయి. రాము వాల్ పోస్టర్లు చూస్తూ నెమ్మదిగా సైకిల్ తొక్కుతున్నాడు. వెలిసిపోయిన కాఫీ పొడుం రంగు చొక్కా దానికున్న పెద్ద జేబులో చిన్నడైరీ, అందులో ఉత్తరం, మరికొంత చిల్లర.

రోడ్డు మలుపులోకి వచ్చాడు మలుపు అవతలి ప్రక్కనుండి అతి వేగంగా వస్తున్న ఎర్రటి బస్సు అతనికి కనబడింది. అంతలో బస్సులైట్ల కాంతి కళ్ళల్లో బడి ఏమీ కనబడలేదు. చప్పున

హాండిల్‌బార్ ఎడమవైపు తిప్పాడు. కూరలసంచి బరువువల్ల హాండిల్ పూర్తిగా తిరిగిపోయి సైకిల్ కింద పడి పోయింది. రాము ముందుకు పడి పోయాడు. సైకిల్‌చైనులో అతని కుడి కాలి ఫాంటు యిరుక్కుపోయింది. ఎడమకాలు సైకిలుకింద పడివుంది. అతి వేగంగా మలుపు తిరిగిన ఎర్రబస్సు కుడివైపు ముందరి చక్రం రాము నడుము మీదకి ఎక్కిపోయింది. క్రిందనున్న గ్రిప్‌లేని సైకిల్ హాండిల్‌బార్ అతని డొక్కలోకి గిగిపోయింది రాము కాళ్ళు భూమిని గట్టిగా అదుముకున్నాయి. పిడికిళ్ళు బిగుసుకుపోయాయి. మొండెం నెమ్మదిగా పైకి లేచింది. పళ్ళు బిగ పట్టేసి ఉన్నాయి. కళ్ళు బయటికి పొడుచుకొని ఎర్రగా వున్నాయి. నల్ల గ్రుడ్లు పైకి పోయాయి. ముఖం ఎర్రగా రక్తంలా వుంది. బస్సుచక్రం ముందుకి దొర్లి పోయింది. రక్తం? ఎర్రటిరక్తం!! రాము జీవంలేని శరీరం నెమ్మదిగా భూమ్మీద వాలిపోయింది ఎర్రబస్సు ఆగిపోయింది.

రోడ్డుమీద జనం గుమిగూడారు. బస్సులో జనం, డ్రైవరు, కండక్టర్, అందరూ అదుర్దాగా బయటికి దుమికారు. జనంలో గుసగుసలు, అరుపులు. డ్రైవర్ ముఖం తెల్లగా పాలిపోయింది. సంచిలోని కూరగాయలు రోడ్డుమీదదొర్లుతున్నాయి. 1957 డైరీ బస్సుముందర చక్రానికి గజందూరంలో పడివుంది. ఒక ముష్టి కుర్రాడు పరుగెత్తుకు వెళ్ళి ఒక దోస కాయని, డైరీని తీసుకొని గుంపులో నుండి బయటికి పోబోయాడు. జనంలో పెద్దగోల బయలుదేరింది. ఒక పెద్ద మనిషి ఆ కుర్రాడి దగ్గర డైరీ లాక్కొని ట్యూబులైటు క్రిందకి పరుగెత్తాడు. వెనకాతల చిన్నగుంపు. కండక్టర్ బ్యాగ్ జాగ్రత్తగా పట్టుకుని దగ్గరికి వెళ్ళి, పెద్దమనిషి దగ్గరి డైరీలోని తెల్లకాగితం మీద నీలిరంగు అక్షరాలున్న ఉత్తరం తీసాడు.

పౌర్ణమి చంద్రుడు ఉదయించాడు!

చంద్రుని చూచిన కలువలు వికసించాయి!!!






కృష్ణమోహన్ శ్రీమతి సత్యప్రియ ఊరెళ్ళింది. ఇవ్వాళ్టికి రెండు రోజు లయింది. ఆమె తిరిగి రావటానికి ఇంకా అయిదు రోజులు గడువుంది. వెళ్ళేటప్పుడు మరీ మరీ చెప్పివెళ్ళింది సత్యప్రియ. "మీ కసలే నోట్లో నాలుక లేదు గదాని పక్కపోర్షను లోని నీరజతో.... మావారిని గురించి కాస్త పట్టించుకుంటూ ఉండమని పదే పదే చెప్పాను. ఆమె సరే నంది – 'వారి సంగతి నేను చూసుకుంటాగానీ.. మీరు క్షేమంగా వెళ్ళి లాభంగా తిరిగి రండి–అక్కయ్యగారూ' అంది ఎంతో ఆప్యాయంగా. ఏమన్నా కావాలంటే ఆమె నడగండి–సందేహించ

కుండా. మీ డిగ్నిటీకి ఏం భంగం రాదు. హోటల్లో చెత్త తినకుండా - గాస్స్టవ్ మీద వంట - కాఫీ టిఫిను - చేసుకోండి. నేను లేను గదాని మీ యిష్టమొచ్చినట్టుగా సినిమాలు చూసినా... స్నేహితులతో చెక్కర్లు కొట్టినా, నే నూరుకోను! ఆఫీసయిపోగానే .... బుద్ధిమంతుడిలా ఇంటికొచ్చేసెయ్యండి! మీకు కాలక్షేపానికి .... 'చింటూ' ఉండనే వున్నాడు. నేను రాగానే మీ మీద సి. ఐ. డి. రిపోర్టు నీరజ నడుగుతాను. తెలిసిందా!" అని.

అందం.... లావణ్యం.... మూర్తీభవించిన సత్యప్రియ ఓననలా డామినేట్ చెయ్యటమంటే కృష్ణమోహన్‌కి చాలా ఇష్టం అందుకని గుడ్‌బాయ్‌లా తల ఊపాడు. ఆమె అందుకు తియ్యని ము....లు మూడు బహుమానంగా ఇచ్చి-

"తప్పనిసరయి వెడుతున్నాను .... లేకపోతే నాకుమాత్రం ఇష్టమా? చెప్పండి? రాగానే శ్రీవారి విరహాన్ని చక్రవడ్డీతో సహా తీరుస్తాగా?" అని అభయమిచ్చి వెళ్ళిపోయింది.

ఊరికే ఇంట్లో కూర్చోవటం బోరుగానే వున్నా.... ప్రియ భార్యామణికిచ్చిన మాటకోసం ఎక్కడికీ కదల లేదు కృష్ణమోహన్.

పత్రికలు.... రేడియో.... టైం కిల్లింగ్‌కు బాగానే ఉపయోగపడ్తున్నా.... ఆ వెలితిని ఎక్కువభాగం తీర్చేది 'చింటూ!'

'చింటూ' అసలు ముద్దు పేరు 'చంటి!' నీరజకా పేరు మోటుగా అనిపించి 'చింటూ' అని మార్చింది హిందీ సినిమాలు ఎక్కువగా చూసే అలవాటుండటంవల్ల. నీరజ భర్త రఘు దానికేమీ అభ్యంతరం తెలుపలేదు. రఘు ఏదో పెద్ద కంపెనీలో సేల్స్ రిప్రజెంటేటివ్‌గా పని చేస్తున్నాడు. జీతం బాగానే వస్తుందిగానీ ఇంటి దగ్గర ఉండటం తక్కువ. నెలలో కనీసం పదిహేను ఇరవై రోజులయినా క్యాంపు లుంటుంటాయి.

క్యాంపు లేనప్పుడు మాత్రం భార్యనీ... చింటూనీ ఒక్క నిముషం కూడా వదిలి ఉండడు. వాడిద్దరంటే అంత మక్కువ అతనికి.

కృష్ణమోహన్, రఘుండి ఓహో అంటే ఓహో అనుకునే స్నేహమేగానీ ... సత్యప్రియ....నీరజలు మాత్రం ప్రాణస్నేహితురాళ్ళయిపోయారు. ఆమె మాటే ఈమె మాట! ఈమె మాటే ఆమె మాట! అందుకనే కృష్ణమోహన్‌ని కాస్త కనిపెట్టి ఉండమని సత్యప్రియ చెప్పగానే చటుక్కున ఒప్పుకుంది నీరజ. ఆ సమయంలో.... ఆమె ముఖంలో లీలగా కనిపించిన వెలుగుని సత్యప్రియ అంతగా గమనించలేదు.

మాట నిలబెట్టుకుంది నీరజ! రఘు

కాంపులో ఉన్నాడేమో.... ఆమెకు శ్రమ కూడా ఎక్కువగా మిగిలింది. అందువల్ల కృష్ణమోహన్‌కి ఏమన్నా కావాలేమో ననుకుని చీటికి మాటికి కనుక్కుంటం మొదలుపెట్టింది .... మొదటి రోజున కాఫీ.... టిఫిన్.... తీసుకొచ్చి ఇచ్చింది. కృష్ణమోహన్ వద్దంటున్నా వినకుండా.... బలవంతంగా అక్కడ పెట్టి వెళ్ళిపోయింది. తీసుకోక తప్పలేదు. పైగా చింటూతో రికమెండ్ చేయించింది! వచ్చీరాని మాటలతో 'కిట్నా'గారూ అంటాడు అతన్ని చింటూ. "కిట్నాగారూ! కిట్నాగారు! మా అమ్మ పెట్టింది తీసుకోమంటోంది.... లేకపోతే.... మిమ్మల్ని తిడుతుంది!" అన్నాడు. ఆ ముద్దు మాటలకి ముగ్ధుడై పోయి కొంచెం ఉప్మా అతనికి పెట్టి తను మిగతాది తినేసి కాఫీ తాగేశాడు.

నిన్న, ఇవ్వాళ అన్నం ఒక్కటి తప్ప ఏమీ వండుకోనివ్వలేదు నీరజ. కూరలు.... సాంబారు.... అన్నీ తను చేసినవే తెచ్చి యిచ్చింది. కొన్నిటిని చింటూతో పంపింది.

"మీరిలా మొహమాట పెట్టేస్తే ఎలా?" అన్నాడు కృష్ణమోహన్ – బిడియంగా ఆమెకేసి చూస్తూ. ఇవ్వాళ్టికీ నిన్నటికీ ఆమెలో మార్పు గమనించాడు కృష్ణమోహన్. అలంకరణ పాలు కాస్త ఎక్కువగా కనిపించింది. "ఆడవాళ్ళు అలంకారప్రియులు," అని సరిపెట్టుకున్నాడు.

ఈ సాయంత్రం అంతా చింటూతో కబుర్లతో హాయిగా గడిచిపోయింది. ఇంతకు ముందే తన దగ్గర నుంచి వెళ్ళాడు చింటూ.

వాచీ చూసుకున్నాడు కృష్ణమోహన్. రాత్రి తొమ్మిది గంటలయింది. తలుపు చప్పుడయితే.... ఇంత రాత్రి పూట తనని డిస్టర్బ్ చేసే స్నేహితులెవరబ్బా! అని విసుక్కుంటూ వెళ్ళి తలుపు తీశాడు

అంతే! నిలువెల్లా ఆశ్చర్యపోయాడు.

ఎదురుగా నీరజ!

అందాల అప్సరసలా....

సోయగాల సొగసులు విరజిమ్ముతోంది!

వింతకాంతు లీనుతున్న ఆమె అందం మత్తెక్కిస్తుంటే.... ఆమె అలంకరణ కైపెక్కిస్తోంది.

"ఏం కావాలి?" తడబడుతూ అడిగాడు.

"చింటూ...." అంది పంటితో పెదవి నొక్కిపట్టి – సమ్మోహనంగా చూస్తూ.

"చింటూ మీ దగ్గరికే వచ్చాడుగా, గంట క్రితం."

"ఆ మాట కాదని నేనంటం లేదుగా?" కిసుక్కున నవ్వింది. ఆ నవ్వులో వెక్కిరింపు కూడా వుంది.

"మరి?"



"చింటూ జేబులో బంగారు లాకెట్ ఉండాలి. ఇందాక వెతికితే కనిపించ లేదు. ఇక్కడేమన్నా పడేసుకున్నాడేమో నని...." కళ్ళు అందంగా తిప్పింది.

"ఏమిటేమిటి? ఇప్పుడు వెదుకుతా నంటుందా ఏమిటి? కొంపదీసి...." కృష్ణమోహన్‌లో ఏదో తెలియని పిరికి తనం ఆవేశించింది.

"ఏమిటండీ! నన్నిక్కడ ఇలాగే నిలబెట్టేశారు. కాస్త వెతుక్కోనివ్వండి! మా చింటూ లాకెట్ కాకుండా మీ సొమ్మేమయినా ఎత్తుకుపోతానని భయంగా వుందా?" మళ్ళీ నవ్వింది గలగలా.

అనుకున్నదంతా అయింది అను కున్న కృష్ణమోహన్ సభ్యతగా ఉండ దనుకుని కొంచెం తొలిగి దారి ఇచ్చాడు— బెరుకు బెరుకుగానే.

అలవోకగా తగిలినట్లు కృష్ణ మోహన్‌ని రాసుకుంటూ వెళ్ళింది నీరజ. ఒళ్ళు జల్లు మందతనికి. తను పొరపాటు పడుతున్నాడేమో అనుకుని సర్దుకున్నాడు. కాసేపు అటూ ఇటూ చూసింది నీరజ. చూసినంతసేపూ ఏవో ప్రశ్నలు వేస్తూనే వుంది. తప్పనిసరి సమాధానాలు చెపుతున్నాడు కృష్ణ మోహన్.

"ఈ మంచంకింద పడిందేమో? మీరు కూడా కాస్త సాయంచేయండి!" అంది తను దానికింద దూరి.

అలాగే నిల్చున్నాడు కృష్ణమోహన్.

"మరదలికి సాయంచేస్తే తప్పులేదు లెండి!" అంది చూపులతో కవ్విస్తూ.

"అబ్బే! అదేం లేదు" అంటూ తనూ దూరాడు. కృష్ణమోహన్ – బాగుండదనుకుని.

సాధ్యమైనన్నిసార్లు తన శరీరాన్ని కృష్ణమోహన్‌కి తగిలించింది నీరజ.

ఆ సుకుమార స్పర్శకి... కృష్ణమోహన్‌లో ఏవో చిలిపి కోరికలు తలెత్తుతున్నాయి.

నిగ్రహించుకోవటం కష్టంగా వుంది. ఉన్నట్టుండి అంది నీరజ. "ఇదుగో లాకెట్" ఆనందంగా అరిచింది.

"ఎక్కడుంది?" కృష్ణమోహన్ ఆశ్చర్యపోయాడు.

"ఇదుగో! ఈ కోడుకింద ఉంది"

"గుడ్! చింటూకి పెట్టండి" తన అనుమానాన్ని పైకి వెలిబుచ్చకుండా అనేశాడు.

"మీరోసారి మా యింట్లోకి వచ్చి మీరే చెయ్యండి ఆ పని" ఆహ్వానించింది.

"సరే పదండి" కృష్ణమోహన్ బుర్ర పదునెక్కింది.

"థాంక్యూ!" ఆమె వేగంగా తమ పోర్షనులోకి వెళ్ళింది.

కృష్ణమోహన్ కూడా సంతోషంగా తలుపు దగ్గరికి వెళ్ళాడు. అతనిలో ఆలోచనా తరంగాలు ఉవ్వెత్తున లేచి పడుతున్నాయి.

అవతల... తన పోర్షనులో నీరజ అభిసారికలా ఎదురు చూస్తోంది. ఆనందోద్రేకాలతో ఆమె మనసు పరవశించిపోతోంది. కానీ ఆమె ఆశ నిరాశ మాత్రమే అయింది.

కృష్ణమోహన్ తలుపులు మూసి లోపల గడియ పెట్టిన చప్పుడు ఆమెకు పిడుగుపాటులా వినిపించింది.

దిండులో తలదూర్చి వెక్కి వెక్కి ఏడ్చింది. 'ఇంత అందం! ఈ లేత వయసు!అతన్నాకర్షించలేకపోయినయా' అని.

మరుసటిరోజు చింటూ తన గదిలోకి వచ్చినపుడు కృష్ణమోహన్ అతన్ని దగ్గరకి తీయలేదు. అతని ముద్దులొలికే కబుర్లకు మురిసిపోలేదు! పైగా ... చింటూని విసుక్కున్నాడు. కసురుకున్నాడు. నీరజ తెచ్చిన కాఫీ, టిఫిన్.... కూరలు నారలు ఏమీ ముట్టనయినా ముట్టలేదు. వాటిని నీరజ పెరటి గుమ్మం దగ్గర పెట్టేశాడు తన నిరసన తెలియపరుస్తూ. రెండు మూడు రోజులు గడిచేసరికి కృష్ణమోహన్ చిరాకు - విసుగు చాలా ఎక్కువయిపోయాయి. ఒకసారి చింటూ మీద చెయ్యి చేసుకున్నాడు కూడా. నీరజ అగ్నిహోత్రమే అయిపోయింది కృష్ణమోహన్ని చడా మడా తిట్టింది. అయినా చెక్కు చెదరలేదు కృష్ణమోహన్. చిద్విలాసంగా చిరునవ్వు నవ్వేశాడు.

తను గోల్కొండ ఎక్స్‌ప్రెస్‌లో వస్తున్నట్లు టెలిగ్రాం ఇచ్చింది సత్యప్రియ.

శ్రీమతిని రిసీవ్ చేసుకోటానికి వెళ్ళబోతూ ఒకసారి పెరటిలోకి వెళ్ళి

"చింటూ" అంటూ ఆప్యాయంగా పిలిచాడు కృష్ణమోహన్.

"చింటూ లేదు.... బంటూ లేదు. వెళ్ళండి!" అంది నీరజ కళ్ళల్లో నిప్పులు కురిపిస్తూ.

చిన్నగా నవ్వాడు కృష్ణమోహన్. ఆ నవ్వులో ఎన్నో అర్థంకాని భావాలు!

"సిగ్గులేకపోతేసరి!పరాయి ఆడదాన్ని చూసి అలా నవ్వటానికి" ఈసడించింది నీరజ.

"శ్రీమతి నీరజగారూ! నన్ను తిట్టండి! మీ నోరు నొప్పిపుట్టేంత వరకూ తిట్టండి! నేనేమీ అనను. అనుకోను. కానీ దయచేసి ఈ చీటీ చదివి చింపివేయండి! అదొక్కటే నా కోరిక! జేబులోంచి చిన్న కాగితం ముక్క తీసి నీరజ చేతిలో పెట్టి గిరుక్కున తిరిగి వెళ్ళిపోయాడు - కృష్ణమోహన్. అందులో ఇలా వుంది.

'ఈ వారం రోజులు.... అంటే .. సత్యప్రియ లేని... ఈ వారం రోజులు మీవారు ఊళ్ళోలేని మీ పాలిట శాపం కాకూడదు. నా పాలిట పీడకల కాకూడదు. దాంపత్యం మధురాతి మధురమైన వరం. మీకు....నేను.... చాటు మాటు ప్రేయసీ.... ప్రియులం కాకూడదు. అదే నా ఆకాంక్ష. అందుకే మీమీద.... చింటూ మీద నిరసన కురిపించింది. సత్యప్రియ రాగానే అంతా మామూలుగానే ఉండాలి! అందుకు మీరు దయతో సహకరించాలి.'

అది చదివిన నీరజ తల తిరిగిపోయింది. తన మీద తనకే ఎంతో అసహ్యం వేసింది. మెతకమనిషి అనుకున్న — కృష్ణమోహన్.... ఎంతో ఉన్నతుడుగా అనిపించాడామెకి. ఎంతో సంస్కారవంతుడిలా కనిపించాడు.

తన తొందరపాటుకి.... అతని ఆవేశం కూడా తోడయివుంటే.... తన గతి ఏమయి వుండేది? కృష్ణమోహన్‌కి మనసులోనే నీరాజనా లర్పించుకుంది నీరజ. మరుక్షణంలో ఆ చీటీ ... ముక్కలు .... ముక్కలుగా మారి గాలిలోకి ఎగిరింది.





# చిమ్నీ

## జి. నరసింహమూర్తి

జేరేసి ఉన్న తలుపులు భళ్ళున తెరుచుకున్నాయి హోరుగాలికి. అప్పుడే వెలిగించిన లైటు ఆరిపోయింది.

ఆరిపోకేమౌతుంది?

చిమ్నీ లేని లైటు!

ఆ హరికెన్ చిమ్నీ కొనాలని యెప్పట్నుంచో అనుకుంటుంది మార్తమ్మ. కాని కుదర్లేదు.

"పిల్లా! వెళ్ళి తలుపు యేసిరావే." అని కూతురికి చెప్పి మళ్ళీ అగ్గిపుల్ల గీయడానికి సిద్ధమయింది.

ఏడేళ్ళ కూతురు ఆ మాట వినిపించు కోకుండా అక్కడే కూర్చునుంది.

"నిన్నే - వెళ్ళి తలుపేసి రమ్మంటం లేదూ!" అంది కాస్త గద్దింపుగా.

"నాకు భయం" అంటూ కూతురు కూర్చున్నకాడే ముడుచుకుపోయింది.

ఇక తనకు తప్పదు. తలుపులు మూసివద్దామని లేవబోయింది మార్తమ్మ.

అప్పటికే ద్వారబంధాన్ని పట్టుకుని రంగనాయకులు నిలబడి ఉండటం చూసి మార్తమ్మ ఉలిక్కిపడింది. గడపమీద ఎలుగుబంటు కూర్చున్నట్టు కంగారు పడింది. అయినా తన భయాన్ని బయటకు కనబడనీయకుండా—

"చీకటి మాటేళ యిలా వొచ్చావే?" అడిగింది.

"వర్షం వొచ్చేలా ఉంటే...." నసుగుతున్నాడు.

గుప్పున కాపుసారా వాసనకొట్టింది.

"ఇంకా వర్షం మొదలవ్వలేదుగా - వెళ్ళిపోకూడదూ."

గుడ్లగూబలా చూస్తూ "ఇక్కడుంటే యేమన్నా కొంపలంటుకుంటాయా?" నత్తి నత్తిగా పట్టి పట్టి అంటున్నాడు.

"కాకపోతే యేంటి? - మొగాడులేని యిల్లు కదా, యిలా నువ్వు యిక్కడికి రావడం చూస్తే అంతా యేమను కుంటారు?"

"అందుకనేగా వొస్తి" అంటూ లోన కొచ్చేశాడు.

మార్తమ్మకి వొళ్ళు మండింది. అవతలకి గెంటి తలుపులు మూసుకోవా లనుకుంది. కాని అది సమయం కాదు. తాగినోడు ఏ దురాగతంచేసినా చేస్తాడు. తాగుడు అటువంటిది. ఎలాగైనా రంగ నాయకుల్ని అక్కన్నుంచి బయటకు పంపించేయాలని చూస్తుంది మార్తమ్మ.

అక్కడున్న అగ్గిపెట్టె తీసుకొని ఎలాగైతే ఓ అగ్గిపుల్ల గీసి బీడీ వెలిగించాడు. తన స్వంత యిల్లులాగే ప్రవర్తించడం వరకూ వస్తూంది వ్యవహారం చూస్తూంటే –

సందెచీకట్లు అంతకంతకూ ఎక్కువై పోతున్నాయి. ఇళ్ళంతా చీకటి అలుము కుంటుంది.

మార్తమ్మ ముల్లుమీద నిలబడినట్టు బాధపడుతుంది.

"హోరుగాలేగాని వర్షం యిప్పు డెక్కడొస్తాది - వెళ్ళిరా అన్నయ్యా" అంది, రంగనాయకుల్ని ఇక మంచిగా ఎలాగో వదిలించుకోవాలని.

అన్నయ్య అనటంతో రంగనాయకులకి నెత్తిమీద బాదినట్టయింది అంత మత్తులోనూ.

'దీని సిగదరగా....' అంటూ లోలోన ఏవేవో తిట్టుకున్నాడు.

వర్షం వస్తే అక్కడే మఠమెయ్యా లనుకుంటున్న రంగనాయకులు చచ్చి పోయాడు మారుమాటాడలేదు.

మా ర్తమ్మ చీకట్లో అలా మగవాన్ని పెట్టుకుని కూర్చుంటే బాగుండదని అగ్గి పుల్ల గీసి లైటు వెలిగించింది కాని అది మళ్ళీ ఆరిపోయింది.

తలుపులు బార్లా తీసిఉన్నాయి. మూయమనలేదు. పరాయి మనిషిని యింట్లో పెట్టుకుని తలుపులెలా మూస్తాది! రంగనాయకులు మీద కెక్కడ వస్తాడోనన్న భయం!

చేట అడ్డంపెట్టి ఎలాగైతే మళ్లీ లైటు వెలిగించింది. కాని మళ్ళీ అదే అయ్యింది.

అంతా ఓరకంట గమనిస్తూన్న రంగనాయకులు,

"చిమ్నీ లేకపోతే ఆరిపోకేంచేస్తాది" అన్నాడు.

అవును. అందులోనూ అర్థం ఉంది. లైట్లో నూనె ఉంది. వత్తి ఉంది. కాని చిమ్నీ లేకపోతే ఏదోగాలి ఆర్పివేస్తూనే వుంటుంది

అలాగే ఆలోచించింది కాస్సేపు. అయితే ఏంచెయ్యాలి తనది చిమ్నీలేని బతుకు, కొప్పులేని కొంప. అందరి కళ్ళూ తనమీదే ఉంటాయి. మొగదిక్కు లేని బతుకు కనక అంతా తననే వెంటా డుతూ వస్తున్నారు. కొందరు కొత్త అర్థాలొచ్చేలా మాట్లాడతారు. మరి కొందరు లొంగదీసుకోవాలని చూస్తుం టారు. కొందరు అదీ ఇదీ ఆశ పెడతానికి ప్రయత్నిస్తూంటారు. అడ్డమైనవాడూ అంత అసహ్యంగా అలా మాట్లాడు తుంటే ఎవరూ అదేమని అనరు.

ఎందుకని? మొగుడు వదిలేసిన మనిషి కనుక.

మొగుడు!

ఎంత దుర్మార్గుడు. అతని బుద్ధి మొదట్లో తనకేం తెలుసు? మొదటి పెళ్ళాంతో సంబంధాలు లేవని తనని పెళ్లాడి యిద్దరు పిల్లలు కలిగిన తర్వాత మళ్ళీ మొదటిదాన్నే తెచ్చుకుని తనని యింట్లోంచి తోలేశాడు. ఇదేం న్యాయం అన్న మనిషి ఒకడూ కనిపించలేదు. 'అవసరం తీరిపోవడంతో విసిరి పారేయ వలసి వచ్చిందా?' అన్న పెద్దమనిషి లేకపోయాడు. ఆడది నేసరికి న్యాయాని క్కూడా కళ్ళు మూసుకుపోతాయి కాబోలు మరి!

అప్పట్నుంచీ యిద్దరి ఆడపిల్లల్నీ పెంచుకుంటూ అక్కడక్కడా పని పాటలు చేసుకుంటూ బతుకుతూ వస్తుంది

పెద్దపిల్లని ఆ మిషనరీలో చేర్పిం చింది కనుక తనమీద కొంత భారం తగ్గిందిగాని లేకపోతే ఎవరు తనకు దిక్కు!

ఇంట్లోకి రయ్యిన గాలి మధ్య మధ్య దూసుకొస్తూనే ఉంది. కూతుర్ని ఒళ్లో

పడుకోబెట్టుకుని అలాగే అక్కడే కూర్చుండిపోయింది మార్తమ్మ పర ధ్యానంగా -

రంగనాయకులుకి ఆడవాసన గిలే కొలదీ బుర్ర తిరిగతిరిగినట్టుంది. మార్తమ్మని చీకట్లో గుచ్చి గుచ్చి చూస్తున్నాడు ఒడేసి నమిలేయాలన్నట్టు. కాని మార్తమ్మ వాళ్లో పిల్ల బొమ్మ జెండులా కనిపిస్తోంది తన కోరికల కడుపులోకి కత్తులు దిగబడ్డాయి. ఏదో మార్గం వెదకాలనుకున్నాడు.

"యేంటే అలా ఆలోసిత్తావు?"

"అబ్బే యేంలేదు అన్నయ్యా - యింటి దగ్గర వాడినా పిల్లలూ బాగున్నారా?"

రంగనాయకులి ముఖంమీద సలసల కాగే నూనె పోసినట్టయింది

అతని ప్లాను పేరు.

మార్తమ్మకి ఆ సమయంలో రంగనాయకుల్ని వదిలించుకోడానికి అంత కంటే వేరే మార్గం కనిపించడంలేదు.

తాను ఎందర్ని తన తోబుట్టువులా చూడడంలేదు? వాళ్ళు మాత్రం పాడు మాటల్తో తనని గాయపరుస్తున్నారు. యెందర్ని యెదిరించగలదు - వాళ్ళ యేడుపేదో వాళ్ళే యేడుస్తార్లేనని తల కుంచుకుపోతూంది. కాని ఒక్క రోజా రెండురోజులా? నాలుగు సంవత్సరాల నుంచి లోకం తనని పొడుచుకుతింటోంది. తననెలాగైనా భంగపరచాలని ప్రయత్నం చేస్తోంది.

"అమ్మా, ఆకలేస్తుందే" అంటూ పిల్ల యేడుపు ప్రారంభించింది ఏవేవో దొంగ ప్లానుల్లో మునిగిపోయిన రంగనాయకులకి ఆ యేడుపు చాలా చీదరింపుగా తయారయ్యింది ఏవేవో కమ్మగా మాట్లాడాలని గుండెలు ఊగిసలాడుతున్నాయి కాని పిల్ల ఆకలి యేడుపు తన ఆశల్ని కుమ్మిపొడుస్తున్నట్టే ఉంది. ఆ పిల్లకాయ గొంతుమీద కాలేసి నొక్కిపట్టి, చంపి రెక్క పుచ్చుకుని అవతల కెక్కడికో గిరాటెయ్యాలనిపించింది. ఉడికిపోయాడు.

"అన్నయ్యా! పిల్లకి కాసిని గంజి నీళ్ళు కాసి పోసుకుంటాను"

"అయితే నువ్వింకా కూడు తిన్లేదన్నమాట."

మార్తమ్మ మాట్లాడలేదు.

రంగనాయకులు కాస్సేపు అటూ యిటూ తచ్చాడాడు.

ఆకాశంమీద మెరుపు తర్వాత ఉరుము.

రంగనాయకులికి అయోమయంగా ఉంది. ఏమీ తోచక థుపుక్కున ఊసి సణుక్కుంటూ వెళ్ళిపోయాడు.

గబుక్కున వెళ్ళి తలుపు మూసుకోలేదు. అక్కడే నిర్జీవంగా కూర్చుండి పోయింది మార్తమ్మ.

త్రోవేపోయేవాడు పోక తనమీద యెంత అధికారం చూపించాలనుకుంటు న్నాడు. ఇది ఒక్క రంగనాయకులే కాదు. ఊళ్ళో చాలామంది ఆ యింట్లో తమకేదో అధికారం ఉన్నట్టు వచ్చేస్తారు. అదేమంటే అక్రమానికి తలపడతారు. తనో ఆకు. తనది దిక్కులేని బతుకు. తలుపులేని యిల్లు! తన పక్కనే చిమ్నీలేని హరికెన్ దిగాలుపడి ఉంది.

తనకూ ఆ హరికెన్‌కూ తేడాలేదు.

మార్తమ్మ ఓ నిట్టూర్పు విడిచింది. తన బతుకలా బండలపాలయిందని విచారిస్తూ వెళ్ళి తలుపు మూసింది. మళ్ళీ హరికెన్ వెలిగించింది. ఎక్కణ్ణుంచో వస్తున్న గాలికి అది రెపరెపలాడుతూనే ఉంది. దానిని ఆరిపోకుండా రక్షించు కోవడం మార్తమ్మకు చికాగ్గానే ఉంది యిపుడు. విసుగెత్తిపోయింది.

ఛీ- ఇక ఊరుకుంటే అంతే - దాని కెలాగైనా చిమ్నీ వేయాలి. అపుడెంతో ప్రకాశంగా వెలుగుతాది. గర్వంగా అన్నిటికీ నిలబడి ఉంటుంది.

గూటికి చేరలేని ఓ కాకి ఆ చీకటివేళ ఒక్కర్తే రోదిస్తూ వెళ్ళిపోతోంది.

'నాది కూడా ఏకాకి బతుకు. దిక్కు మాలిన బతుకు' అనుకుంది మార్తమ్మ.

చీకటి బతుకును ఎంతకాలం పిండినా వెలుగు చుక్కలు రాల్తాయా!

కన్నీళ్ళొచ్చాయి. చాలాకాలం తర్వాత గుండెలు దుఃఖంతో పొంగాయి. అంత దుఃఖంలోనూ కాసిని గంజి పొంగించి కూతురు కట్టించింది.

తాను కాసుకున్న గంజి తాగినా తాగకపోయినా అడిగే దిక్కులేదు. ఎప్పటికి ఏ గాలికి కొట్టుకుపోవాలో తెలియడంలేదు.

అవతలెక్కడో అదే పనిగా కుక్క మొరుగుతోంది.

మొండిగా బ్రతుకొస్తున్న మార్తమ్మ గుండెల్లో భయంలాటిదేదో గుచ్చుకుంది ఆవేళ. బతుకంటే అంత భయంగా ఉంటుందనీ, అంత భయపడాల్సి వస్తుం దనీ యెన్నడూ అనుకోలేదు.

జీవితంలో నిజమైన అందాలేమిటో తెలిసొచ్చేసరికే యిద్దరి పిల్లల్ని కనేసింది. అంతటితో అన్నిటికీ దూరమై అలా బతుకుతుంది. వయస్సులో ఉంది. మనసు కానిపని చేసినా యే మాయ వలలో పడినా తనబతుకే కాదు. తన ఇద్దరి కూతుర్ల గతి రేపేంగాను? - వాళ్ళను యీ మనుష లెలా చూస్తారు? తన తప్పువల్ల వాళ్ళ బతుకు బజారున పడితే యింకేముంది? అటువంటి నరకంలోకి బంగారంలాటి బిడ్డల్ని తోసేస్తే యిక మనిషి జన్మ పెట్టుకు పుడుత అనవసరం కాదా?-

ఇవే ఆలోచనలు మార్తమ్మని వెంటాడుతున్నాయి

కూతురు పక్కనే పడుకొని నిద్రపోతూంది.

తన అందం యెలాటిదో తనకు తెలియదుగాని తన కూతురిని చూస్తుంటే అంత అందమైన కూన తన కడుపునెలా కలిగిందా అనిపిస్తుంది. మిషనరీలో చదువుకుంటున్న పెద్దపిల్ల కూడా అంద మైనదే!

వీళ్ళు లోకంలోకి ఎదిగొస్తున్నారు.

తానేమో ఏ దిక్కూ లేని ఆడది.

పెరుగుతున్న వీళ్ళని ఈలోకం ఎలా కబళించాలా, ఎప్పుడు కబళించాలా అని చూస్తూంటోంది.

అప్పటివరకూ యెందుకు? యిలాగే ఒకర్తే ఆ గుడిసెలో యెన్ని రోజులు తనను తను రక్షించుకోగలదు?

దుర్మార్గులు రాక్షసుల్లా చుట్టూ మాటేసిఉన్నారు. ఏ క్షణం ఎటువంటిదో!

నలుగురు మృగాలు చుట్టిముడితే వాళ్ల దంతాల మధ్య చిక్కడి పోవాల్సిందే!

బయట హోరుగాలి చూరులంట లోన కొస్తూంది. చిమ్నీలేని దీపం రెప రెప లాడుతోంది మరి దీపం యే భయమూ లేకుండా వెలగాలంటే దానికో చిమ్నీ కావాలి. మరి తనకూ?

ఇదే ప్రశ్న ఆమె అంతరంగంలో సుడి తిరిగింది.

సముద్రంలా పొంగింది.

అనేక సార్లు లెక్కచేయకుండా విదిలించేసిన మార్కెట్లో మేకమాంసం అమ్ముకుంటూ బతికే రెహమాన్ మాటలు మార్తమ్మకు అప్పుడే జ్ఞాపకం వచ్చాయి.

"మార్తమ్మా! మన మతాలతోటీ, కులాలతోటీ పట్టింపులు పెట్టుకోకు. మనసు ముఖ్యం. నేనొంటిగాణ్ణి. నువ్వు వొప్పుకుంటే నేను పెళ్ళాడుతాను. నీ యిద్దరి పిల్లల్నీ నా పిల్లల్లాగే చూసు కుంటాను—" అన్న మాటలు ఆమెను విలువెల్లా చుట్టేసుకున్నాయి.

మార్తమ్మకు ఓ మార్గం కనిపించింది.

బయట హోరున వర్షం ప్రారంభ మైంది.

నిద్రపోతున్న తన కూతురికి నిండుగా దుప్పటి కప్పింది.

రెపరెపలాడే దీపంతోపాటు తన బతుకుకి కూడా ఓ చిమ్నీ తెచ్చుకోడానికి అంత రాత్రిలోనూ, అంత వానలోనూ రెహమాన్ యింటివేపు నడిచింది మార్తమ్మ.





యం.వి. కిషన్

# వినిపించని సంగీతం

గంజాయి వనంలో తులసి మొక్కలా

మాలతి ఆ ఇంట తప్పుబుట్టిందన్న అభిప్రాయానికి రావడానికి ముందు, శ్రీహరిరావు ఆ ఇంట్లోని మనుషుల్నీ ఆ ఇంటి పరిస్థితుల్నీ నిశితంగా పరిశీలించి అవగాహన చేసుకున్నాడు. తన అవగాహన లోప భూయిష్టమైనది కాదని నిర్ధారణ చేసుకున్నాకనే ఆ అభిప్రాయాని కొచ్చాడు

ఎవరి విషయంలోనూ, ఎలాంటి విషయంలోనూ తొందరపడి ఒక అభిప్రాయానికి రాకూడదన్నది శ్రీహరిరావు ముఖ్య సిద్ధాంతాల్లో ఒకటి. అందుకే తన మనసుకి అవగతం కాని ప్రతిదాన్నీ అతను డీప్‌గా స్టడీ చేస్తుంటాడు. స్టడీ చేసి, అర్థంచేసుకోడానికి ప్రయత్నిస్తుంటాడు.

కుటుంబరావుగారి కుటుంబాన్ని స్టడీ

చేసి అతగాడు అర్థంచేసుకున్న దేమిటంటే -

కుటుంబరావుగారు: విషవృక్షం. తన విషప్రభావంతో పెళ్ళాం అనబడే కల్పతరువుని మాడ్చి మసిచేసి, పిల్లలనబడే పచ్చని మొక్కల్ని కూడా అదే గతి (అధోగతి) పట్టించడానికి నిర్విరామంగా కృషిచేస్తున్న అప్రాచ్యుడు! తోకలేని పశువు!!

కుటుంబరావు గారి సంతానం (మాలతి మినహా) ; విషవృక్షం నీడను పెరుగుతూ, విషాన్ని పీలుస్తూ, భవితవ్యంలో విషవృక్షాలు కాగల విషపు మొలకలు!

మాలతి: గంజాయివనంలో తులసి మొక్క- విషవృక్షం నీడనే పెరుగుతున్న అమృతపు మొలక! తండ్రిలోని, తోబుట్టువుల్లోని విషాన్ని హరింప జేయాలని అనుక్షణం వ్యర్థప్రయత్నం చేస్తూ.... కరిగిపోతున్న కొవ్వొత్తి!!!

* * *

పక్కింట్లోంచి సన్నగా ఏడుపు వినరావడంతో చేతిలోని కలాన్ని పక్కన పెట్టి, చెవులు రిక్కించాడు శ్రీహరిరావు.

ఫట్! ఫట్!! - ఎవరో.... ఎవర్నో కొడుతున్న చప్పుడు!

ఎవరో ఏమిటి? ఎవరో ఏమిటి?.... ఆ అప్రాచ్యుడే! మాలతినే కొడుతుండాలి.... అనుమానం అనవసరం! దుర్మార్గుడు.... తుచ్ఛుడు.... నీచుడు!!! అసహ్యంతో ఒళ్ళు జలదరించి పోయింది శ్రీహరిరావుకి.

"నాన్నా, కొట్టకు నాన్నా.... చచ్చి పోతున్నాను కొట్టకు నాన్నా!"— ఏడుపు.

మాలతిదే? ఏడ్వటానికే పుట్టిన మాలతిదే ఆ ఏడుపు!

వెళ్ళి కుటుంబరావుగారి పీక పిసికేయా లన్నంత కోపం వచ్చింది శ్రీహరిరావుకి. ఐనా తమాయించుకున్నాడు - తనకు మాలిన విషయాల్లో తల దూర్చటం తగని పనని.

"ఛస్తే చావ్వే.... నువ్వొక్కదానివే కాదు, మీరంతా కట్టుగట్టుకొని ఏకంగా ఒక్కసారే చావండి... అప్పుడుగాని నా ప్రాణం కుదుటపడదు...." గర్జన. ఆ వెనుక - మళ్ళీ కొడుతున్న చప్పుడు!

వాళ్ళు కాదురా చావాల్సింది. నువ్వు. ఔను నువ్వేరా! చెదపురుగులా వాళ్ళ జీవితాల్ని తినేస్తున్నావు. వాళ్ళు చస్తే నీ ప్రాణం కుదుటపడ్తుందో లేదోగాని నోరేయ్ ... నువ్వు ఛస్తే వాళ్ళ జీవితాలు తప్పకుండా బాగుపడ్తాయ్. చావరా! త్వరగా చావు! కసిగా పళ్ళు కొరికాడు శ్రీహరిరావు.

"ఆ పనేదో నువ్వే చేసి, ఆ పుణ్యమేదో నువ్వే మూటగట్టుకో నాన్నా!" వెక్కిళ్ళ మధ్య మాలతి స్వరం.

వెంటనే — మనిషి గొడ్డును కొడు

తున్నట్టూ, గొడ్డు మనిషిని కుమ్ము తున్నట్టూ అలజడి!

అది వినలేక అక్కణ్ణించి లేచి పోయాడు శ్రీహరిరావు.

* * *

పీచురేగిన జుట్టు.... చిరిగిపోయిన దుస్తులు.... వడిలిపోయిన సుందర కుసుమంలాంటి వదనం.... ఒళ్ళంతా సున్నపు పట్టీలతో.... గాలివానలో చిక్కుకుపోయిన గూడులేని పక్షిలా... రూపమెత్తిన దైన్యంలా .... తన కళ్ళెదుట నించున్న మాలతిని చూడగానే ఎవరో కడుపులో చెయ్యిపెట్టి దేవి నట్టనిపించింది శ్రీహరిరావుకి

"కూర్చో మాలతీ!" అన్నాడు కుర్చీ చూపెడుతూ.

కళ్ళ నిండుగా కన్నీళ్ళు నింపుకుంటూ కుర్చీలో కూలబడింది మాలతి.

శ్రీహరిరావు కళ్ళల్లోని జాలి, మాలతి కళ్ళల్లోని కన్నీరు - ఒకదా న్నొకటి పరామర్శించుకున్నాయి.

అతని కళ్ళల్లోని జాలి తన హృద యాన్ని కొరికేస్తున్నట్టనిపించి, రెండు చేతుల్లో మొహం దాచుకొని గావురు మంది మాలతి.

తనివితీరా ఆమె ఏడుస్తుంటే- హృదయభారం తగ్గనైనా తగ్గుమంది కదాని ఆమెను ఓదార్చే ప్రయత్నం చేయలేదు శ్రీహరిరావు. ఆమె ఏడు స్తుంటే అలా చూస్తుండిపోయాడు.

ఏడ్చి ఏడ్చి, ఒకింతసేపటికి తెప్ప రిల్లింది మాలతి, "శ్రీహరిగారూ!" పిలిచింది.

"ఏమిటి మాలతీ?" దయార్ద్ర స్వరంతో బదులుపలికేడు శ్రీహరిరావు.

"నాకో చిన్న సాయం చేసిపెడ తారా?"

"అదేవిఁటి మాలతీ!! నువ్వేదైనా అడిగితే నే నెప్పుడైనా కాదన్నానా?"

"కాదన లేదనుకోండి.... కాని అవన్నీ వేరు, ఇప్పుడు నేను అడగ బోయేది వేరు."

"అంటే? అంత అడగరానిదా?.... ఫర్వాలేదు.... అడుగు."

"నాకు.... నాకు కొంచెం విషం తెచ్చిపెట్టండి...."

"మాలతీ!" కదిలిపోయాడు శ్రీహరి రావు. చటుక్కున కుర్చీలోంచి లేచి ఒక్కుదుటున మాలతిని సమీపించాడు. "ఏమైంది నీకీ వేళ? నరకయాతన్లను నవ్వుతూ స్వీకరించటం నీ కలవాటేగా? ఎందుకింత బేలగా మాట్లాడుతున్నావు?"

"శ్రీహరిగారూ!" ఏడ్చేసింది మాలతి. "ఈ రోజు మా నాన్న నన్ను కొట్టింది దేనికో తెలుసా శ్రీహరిగారూ? తాగటానికి డబ్బు లియ్యలేదని కాదు.... బ్రాకెట్టాడ్డానికి మదుపు పెట్టలేదని కాదు...."

"జాలిగా చూస్తున్నాడు శ్రీహరిరావు.

"వసంత.... వసంత... "

ఓహ్! డార్లింగ్ మన పెళ్ళి 30 రోజులు
దాటాయి దాచిపెట్టాను, ఈలోగా 29
రోజులు రోజుకొక్కర్ని పెళ్ళిచేసుకోవాలి
సినిమాల్లో, కాలేజీల్లో ఇచ్చాను మరి




"ఊఁ.... వసంత?"

చెబుదామా వద్దా అని సంశయించింది మాలతి.

"ఊఁ.... చెప్పు మాలతీ!"

చెప్పేసింది - "వసంత కాలు జారింది."

"ఏమిటి మాలతీ! ఏమిట్నువ్వంటున్నది!!"

"ఔను, శ్రీహరిగారూ! దానికి నెల తప్పింది. అది కాలు జారింది, దానికి నెల తప్పింది. అందులో ఆశ్చర్యమేమీ లేదు. కాని.... ఈ విచిత్రం విన్నారా!"

"ఏవిఁటది?"

"దానికి నెల తప్పించింది నేనుట!"

"మాలతీ!?"

"ఔను శ్రీహరిగారూ .... దాన్ని కళ్ళల్లో పెట్టి కాపాడుకోవలసిన బాధ్యత నాదట! నేను అలక్ష్యం చెయ్యబట్టి దానికి నెల తప్పిందట!" చెప్పి, కుళ్ళి కుళ్ళి ఏడ్చింది మాలతి.

ఏమనాలో పాలుపోలేదు శ్రీహరి రావుకి. ఆమె నెలా ఓదార్చాలో తోచ లేదు.

* * *

మాలతీ!

ఎన్నో రోజులుగా నా మనసులో దోబూచులాడుతున్న ఊహను ఈవేళ నీ ముందుంచాలనిపించింది. ఉంచుతున్నాను. దీన్ని నీ పట్ల జాలితో నేను చేసుకున్న తొందరపాటు నిర్ణయంగా నువ్వెంత

మాత్రం పరిగణించవద్దు. ఎన్నాళ్ళుగానో నా మనసులో గూడుకట్టుకొని వున్న కోరికకు రూపకల్పనే ఈ ఉత్తరం.

నేనూ ఇక్కడికి వచ్చినప్పట్నుంచీ మీ కుటుంబ పరిస్థితులన్నీ నిశితంగా పరిశీలిస్తూ, ఒక్కొక్కర్నే కీన్‌గా అబ్జర్వ్ చేస్తున్నాను.

నా అబ్జర్వేషన్‌లో నే నర్థం చేసుకున్న దేమిటంటే - ఉజ్వలమైన భవిష్యత్తుకోసం ఇంతో అంతో కృషిచేస్తూ, కళ్ళల్లో వొత్తులు పెట్టుకొని ఎదురు చూస్తున్నది మీ ఇంట్లో నీవు ఒక్కదానివి మాత్రమే. మిగతా ఏ ఒక్కరిలోనూ ఆ ఆలోచనా లేదు, ఆ ఆశా లేదు. వాళ్ళంతా ఎవరిమట్టుకు వాళ్ళు బాధ్యతారహితంగా ప్రవర్తిస్తూంటే, నీ వొక్కదానివీ అందరి బాధ్యతలూ నెత్తిన వేసుకొని మీ కుటుంబాన్ని చక్కదిద్దాలని వ్యర్థప్రయత్నం చేస్తున్నావు. కానీ, నీ తాపత్రయానికి గుర్తింపులేదు సరికదా....నీ మంచితనాన్ని ప్రతిఒక్కరూ వంచిస్తున్నారు. వాళ్ళు తప్పటడుగులు వేస్తూ వాటి ఫలితాలను నీ నెత్తిన రుద్దుతున్నారు. ఇలా ఎంతకాలం? నువ్వు సహిస్తూ వచ్చినంతకాలం ఇలా సాగుతూండాల్సిందేగాని నువ్వు ఎదురు చూస్తున్న రేపు మాత్రం రానేరాదు. నీ జీవితంలో నవ్వులు పండనే పండవు.

త్రాగుడు, బ్రాకెట్ .... అవి రెండే జీవితానికి పరమార్థాలుగా పరిగణిస్తున్న మీ నాన్న తండ్రిగా మీకు ఒరగబెడుతున్నదేమిటి? పిల్లల భవిష్యత్తుకి బంగారుబాటలు నిర్మించవలసినవాడై ఆ పని చేయడంలేదు సరికదా, తన బిడ్డల భవిష్యత్తుకి అడ్డంగా ముళ్ళకంచెలు కడుతున్నాడు. ఉన్న పొలం కాస్తా అమ్మేశాడా? ఇక రేపో మాపో ఇల్లు కూడా అమ్మేయడని గ్యారంటీ ఏమిటి? అది కూడా పోతే - ఇంటిమీద అద్దె రూపేణా వస్తున్న ఆ కాస్త రాబడీ లేకుండా పోతే - మీ కుటుంబానికి వేరే ఆధారమేముంది? మిషను కుట్టి నువ్వు సంపాదించే దేపాటి? అప్పుడు మీ పరిస్థితి ఏమిటి?

మీ అన్నయ్య ఉన్నాడంటే చెట్టల్లే ఎదిగాడేగాని అతనివల్ల కూడా ప్రయోజన మేమీలేదు. జులాయి తిరుగుళ్ళూ, నాటకాలూ - అవే అతడి లోకం. బాధ్యతాయుతంగా అతనీ జన్మకి ప్రవర్తిస్తాడని నేననుకోను. కాదంటావా?

పోతే మీ చెల్లెలుందంటే .... మీ ఇంటి పరిస్థితంతా తెలిసుండి కూడా ఇలాంటి పని చేసిందంటే - మీ కుటుంబం బాగును కాదుకదా, కనీసం తన బాగును తానైనా కోరుకునే మనిషిలా తోచటం లేదు.

ఇక మీ తమ్ముడు .... ఇప్పుడంటే పసివాడు కాని, రేప్పొద్దున్న ఏ గూటి చిలక ఆ పలుకే పలుకునన్నట్టు....మీ అన్నా నాన్నలను ఆదర్శంగా తీసుకుం

టాడే గాని, తద్భిన్నంగా ప్రవర్తిస్తా డనుకోవడం వెర్రితనమే అవుతుంది.

ఇదంతా నే నెందుకు రాస్తున్నానంటే నువ్వు ఎంత అవివేకంగా ఎలాంటి వ్యక్తులకోసం పాటుపడుతున్నావో నీకు గుర్తుచేయడానికి. నీ కళ్ళు తెరిపించ డానికి.

మాలతీ! నీ వాళ్ళెవరూ వాళ్ళు బాగు పడనూ పడరు; నిన్ను బాగుపడానివ్వరు.

వాళ్ళ కోసం నువ్వు తాపత్రయ పడటం దేనికి?

పగలంతా రెక్కలు ముక్కలు చేసుకొని మిషను కుట్టి సంపాదించిన దంతా సాయంత్రమయేసరికి మీ నాన్నకి - ఆయనచేత దెబ్బలు తిని .... ధార పొయ్యడం దేనికి?

మీ అన్న, మీ చెల్లి, మీ తమ్ముడు వాళ్ళు రాటుదేలినమనుషులు. వాళ్ళ నేమీ అనలేక మీ నాన్న అన్నిటికీ నీమీద ధ్వజమెత్తుతుంటే నువ్వెందుకు సహిం చాలి? సహించలేక ఏ విషమో మింగి చావాలన్నంత నిరాశకి ఎందుకు లోనుకావాలి?

ఆలోచించు. బాగా ఆలోచించు.

విషం కావాలని అడిగావు నువ్వు. అయితే....నేను నువ్వు 'ఊఁ' అంటే చాలు నీ జీవితంలో అమృతం చిలికించ డానికి సిద్ధంగా ఉన్నాను. మీ కుటుంబంతో సంబంధ బాంధవ్యాలన్నీ తెంచేసుకుంటే నేను నిన్ను వివాహం చేసుకుంటాను. నిన్ను ఆ నరకంనుంచి తప్పిస్తాను. ఏమంటావ్?

బాగా ఆలోచించుకొని ఏ విషయమూ తెలియజెయ్.

నువ్వు కాదనవని ఆశిస్తూ
శ్రీహరిరావు.

- రాయటం ముగించి, రాసినదాన్నో మారు చదువుకుని, మడిచి జేబులో పెట్టుకొని, మాలతి కిచ్చొద్దామని బయటి కెళ్ళాడు శ్రీహరిరావు. అయితే బయట ఏదో గొడవ జరుగుతూండటం గమ నించి గుమ్మంలోనే నించుండిపోయాడు.

కుటుంబరావుగారి యింటి ముందు—

చేతుల్లో బెల్టులతో....హిప్పీ జుట్లు.... బెల్‌బాటమ్ పాంట్లు....ఓ నలుగురు ఆకు రౌడీలు చింపొని తలా ఓ అరుపూ అరుస్తున్నారు.

"ఒరేయ్, బయటికి రారా! నీ అంతు చూస్తాం!"

"పూటకి ఠికాణా లేని వెధవ్వి నీ మొహానికూడా లవ్వట్రా?!"

"మా చెల్లికి లౌలెటర్ రాయడానికి నీ కెన్ని గుండెల్రా? - రాస్కెల్!"

"ఆడముండలా ఇంట్లో దాక్కున్నా వేంరా? రారా బయటికి"

"ఒరేయ్ రారా!"

"ఒరే ఖోజ్జా రారా బయటికి...."

ఆకాశా న్నంటుతున్నాయ్ అరుపులు.

"ఒరేయ్! మీ అరుపులకు భయపడి పోవడానికి ఇక్క డెవరూ గాజులు

తొడుక్కొని లేరురా. ఇదిగో వచ్చాను. ఏంచేస్తారో చెయ్యండి," అంటూ రాకెట్‌లా ఇంట్లోంచి బయటికి దూసుకొచ్చాడు గోపీ. మగతనాన్ని సవాలు చేస్తే రోషపడని మగవాడెవడుంటాడు?

అంతే! రెప్పపాటులో బెల్టులు నాలుగూ ఛెళ్ ఛెళ్ మంటూ గోపీ ఒంటిమీద నాట్యం ప్రారంభించాయి.

అజ్ఞాస్తున్న శ్రీహరిరావుకి అరికాళ్ళలోంచి నడినెత్తివరకూ వొణుకు పుట్టుకొచ్చింది. చిన్నప్పట్నుంచి పోట్లాట అంటే అతనికి తగని భయం! ఇంట్లోకి వెళ్ళిపోవడానికి సిద్ధపడ్డాడు. అయితే అంతలో ఏడ్చుకుంటూ పరుగెత్తుకొచ్చింది మాలతి.... "శ్రీహరిగారు వాళ్ళు మా అన్నయ్యను చంపేస్తున్నారు....వద్దని చెప్పండి... వదిలిపెట్టమని చెప్పండి...." ఏడుస్తూ శ్రీహరిరావు కాళ్ళను వాటేసుకొంది.

కాలూ చెయ్యీ ఆడలేదు శ్రీహరిరావుకి. ఔనని కాని, కాదని కాని అనలేకపోయాడు. శిలా విగ్రహంలా నించుండిపోయాడు.

అవతల బెల్టుల నాట్యం వేగం పెరిగింది. "అమ్మోయ్! నాయనోయ్!" అని కేకలేస్తూ బాధతో మెలికలు తిరిగిపోతున్నాడు గోపీ. చుట్టూతా పోగైన జనం చోద్యం చూస్తూ నించున్నారేగాని, ఏ ఒక్కరూ ఆ ఘోరాన్ని ఆపుజెయ్యటానికి ప్రయత్నించటంలేదు. ఆకురౌడీలు విజృంభించారు.

శ్రీహరిరావుతో ఇక లాభంలేదనుకొని తానే అందుకు సిద్ధపడింది మాలతి. గుంపులోకి జొరబడిపోయింది. "అన్నయ్యా వచ్చేయ్‌రా...తప్పించుకొని వచ్చేయ్‌రా," గోపీ నుద్దేశించిఅరుస్తోంది. "ఏమండీ మా అన్నయ్య నొదిలిపెట్టండి. మీకు దణ్ణం పెడతాను....కనికరించండి" రౌడీల నుద్దేశించి చేతులు జోడించి ప్రాధేయపడుతోంది.

"ఒరేయ్ ఉచ్చా! నీ కీ సన్మానం చాలదురా....ఉండు విన్నేం చేస్తానో" అంటూ, ఇంటిముందున్న పందిరికప్పులోంచి లావాటి కర్ర నొకదాన్ని ఊడబెరికి చేతబట్టుకున్నాడు రౌడీల్లోని ఒకడు. "మీ రాగండి, వాడి భరతం నేను పడతాను" అంటూ బెల్టుదారుల్నందర్నీ పక్కకి లాగాడు.

"అన్నయ్యా!" అంటూ భయ విహ్వాలయై అరిచింది మాలతి.

సరిగ్గా అదే క్షణంలో అక్కడికొచ్చాడు కుటుంబరావు. పక్కవాడో రెండు ముక్కలు చెప్పగా పరిస్థితి అర్థం చేసుకొని, "ఆగండి!" అంటూ వెర్రి కేకేశాడు.

తాటాకు చప్పుళ్ళకి కుందేళ్ళు బెదురుతాయా? ఆగలేదా రౌడీ. అతని చేతిలోని కర్ర గాల్లోకి లేచింది. వెనువెంటనే వెనుదిరిగింది.

మరో క్షణంలో అది గోపీని తాకేదే కాని,"నాయనా గోపీ" అనరుస్తూన్న అదే




క్షణానికి కుటుంబరావు అడ్డమెళ్ళటం వల్ల - గోపీని బదులు కుటుంబరావు బుర్రను తాకింది. తాను రెండై, అతని బుర్రను రెండుగా చీల్చింది.

చివ్వున రక్తం ఎగజిమ్మింది!

జనంలో కలకలం చెలరేగింది!!

* * *

క్షణాల్లో హాస్పిటల్‌కి చేర్చబడ్డ కుటుంబరావు అక్కడ కొద్దిగంటలసేపు చావుబ్రతుకులమధ్య ఊగిసలాడి, కొసకి చావును కౌగిలించుకున్నాడు. చనిపోయే ముందు - పిల్లల్ని దగ్గరికి తీసుకొని, "నేను మీకు అన్యాయం చేసిపోతున్నాను. ఇక మీదట మీ రెలా బ్రతుకుతారో ఏమో!" అని ఏడుస్తూ, పిల్లల గురించి అతను వ్యక్తంచేసిన ఆవేదన....తపన శ్రీహరిరావుని దిగ్భ్రాంతుణ్ణి చేశాయి.

తన అవగాహన కందని కొత్త విషయాన్ని గ్రహించి సిగ్గుపడ్డాడు శ్రీహరిరావు. సిగ్గుపడి, "మీ పిల్లల గురించి మీరేం విచారించకండి కుటుంబరావు గారూ? ఇక నుంచి వాళ్ళకు అండగా నే నుంటాను. వాళ్ళ బాగోగులన్నీ నేను చూస్తాను. నన్ను నమ్మండి" అంటూ పోతున్న ప్రాణాన్ని ఓదార్చి పంపాడు.

కుటుంబరావుని కాటి కప్పగించి ఇంటికొచ్చిన శ్రీహరిరావుని చూసి ఘొల్లుమంది మాలతి.

"చూశారా శ్రీహరిగారూ? మానాన్న మా కెంత అన్యాయం చేసిపోయాడో చూశారా? మమ్మల్నెలా దిక్కులేని వాళ్ళని చేసి వెళ్ళిపోయాడో చూశారా? ఇంక మా కెవరండీ దిక్కు?" అని ఆమె ఏడుస్తుంటే, దగ్గరగా వెళ్ళి ఆమె శిరసున చెయ్యానించాడు శ్రీహరిరావు. "ఊరుకో, మాలతీ! ఊరుకో....ఎంత

ఏద్చేం ప్రయోజనం? ఏడిస్తే పోయిన వాళ్ళు తిరిగొస్తారా? మీ నాన్నగారు పోవడం....నిజంగా మీ పాలిటి పూడ్చ లేని వెలితె! కాని....మీరు దిక్కులేని వాళ్ళైపోయారని మాత్రం అనుకోవద్దు నేనున్నాను. ఊరుకో .... ధైర్యంగా వుండు"

"ఎంత కాలం శ్రీహరిగారూ! ఎంత కాలం మీరు మాకు దిక్కుగా వుండ గలరు? మీరు.... మీ రేమైనా మా నాన్న కాగలరా?"

మాలతి అలా అడుగుతుంటే శ్రీహరిరావు కళ్ళు చెమర్చాయి.

"ఔను.. మాలతీ! నేనే కాదు, ఈ లోకంలో ఇంకెవ్వరూ మీకు మీ నాన్న కాలేరు. కానీ మాలతీ.... నేను నిన్ను ప్రేమిస్తున్నాను. నువ్వు ఊ అంటే నిన్ను నా దాన్ని చేసుకుంటాను. సంతోషంగా మీ అందరి బాధ్యతా స్వీకరిస్తాను.... ఏమంటావ్ మాలతీ? కాదనవు కదూ!" ఆమె చుట్టూ చేతు లల్లుతూ ఆప్యాయంగా, ఆత్రంగా ప్రశ్నించాడు.

సున్నితంగా అతని చేతుల్ని తప్పించి అన్నది మాలతి: "నాకు.... నాకు కొంత వ్యవధి కావాలి"

"అలాగే, మాలతీ! తొందరేం లేదు. బాగా ఆలోచించే నీ నిర్ణయం తెలియజెయ్" అన్నాడు శ్రీహరిరావు.

ఆ మర్నాడు శ్రీహరిరావు చేతిలో ఓ కవరుంచింది మాలతి.

"ఏమిటిది, మాలతీ?" అనడిగాడు శ్రీహరిరావు

"చదవండి.... తెలుస్తుంది" అంటూ వెళ్ళిపోయింది మాలతి - శ్రీహరిరావు కేకేస్తున్నా వినిపించుకోకుండా.

కవరు తెరిచి, ఉత్తరం చదివాడు శ్రీహరిరావు -

'శ్రీహరిరావు గారికి,

ఎంతో ఔదార్యంతో నన్ను మీ భార్యగా స్వీకరిస్తాననీ, మా కుటుంబానికి అండగా నిలబడతాననీ అన్నారు మీరు. ఎంత విశాలహృదయులో అర్థమయింది నాకు.

మీరు నన్ను నిజంగానే ప్రేమిస్తు న్నారో లేక మా కుటుంబ పరిస్థితులకు జాలిపడి ఆ నిర్ణయాని కొచ్చారో నాకు తెలియదు గాని, నేను మాత్రం మీ ఔదార్యాన్ని ఉపయోగించుకోలేకపోతు న్నాను. నన్ను మన్నించండి.

మీరు నాకు ప్రసాదిస్తున్న అమూల్య వరాన్ని కాదని కాలదన్ను తున్నందుకు నాపై కోపగించుకోకండి. దయతో నన్ను అర్థంచేసుకోవడానికి ప్రయత్నించండి.

వసంత విషయం మీకు తెలుసు కదా! సవరించుకోవడానికి వీలులేని తప్పిదం చేసింది తను. అతనికి పెళ్లై పోయిందట. కాబట్టి దాని జీవితం బాగుపడే అవకాశం ఇంక లేనట్టే.

దాన్నలా మోడులా మిగిల్చి నా సౌఖ్యం, నా స్వార్థం నేను చూసుకోవడానికి నా మనసు సుతరామూ అంగీకరించటం లేదు. ఏం చెయ్యను చెప్పండి?

శ్రీహరిగారూ!

ఎంతో ఉన్నతమైన భావాలు, ఆశయాలు వ్యక్తంచేస్తూ ఎన్నెన్నో కథలు రాస్తుంటారు మీరు. ఆ ఔన్నత్యం కేవలం మీ కథలవరకే పరిమితం కాకుండా మీలోనూ వున్నదని దృఢంగా నమ్ముతున్నాను నేను. ఆ నమ్మకంతోనే మిమ్మల్ని కోరరాని కోరిక కోరాలనుకుంటున్నాను. చెప్పమంటారా?

మీరు నన్ను ప్రేమించిన మాట నిజమే అయితే - అందుకు కారణం నా రూపమే అయుండాలి. అవునా? అయితే వసంత నాకన్నా అందంగా వుంటుంది. అది వేసిన ఆ ఒక్క తప్పటడుగు వినా మిగతా అన్నిట్లోనూ అది నా కన్నా మిన్నే! తెలిసీ తెలియక అజ్ఞానంతో అది చేసిన ఒక్క తప్పిదం దాని వెండు జీవితాన్ని బుగ్గిపాలు చేస్తున్నది. మీరుసహృదయులు. మహోన్నతమైన వ్యక్తిత్వం గలవారు, నన్ను కాక, మా వసంతను స్వీకరించి చీకటికి ఆహుతైపోతున్న దాని జీవితాన్ని కాంతిమయం చెయ్యగలరేమో ఒక్కసారి ఆలోచించండి.

ఇలాంటి కోరిక కోరుతున్నందుకు నన్ను మరోమారు మన్నించండి.

మాలతి!

చదవడం ముగించి, వెంటనే మరోసారి చదివాడు శ్రీహరిరావు. ఆ వెనుక మరోసారి.... మరోసారి.... మరోసారి లెక్కలేనన్ని సార్లు చదివాడు.

కానీ, అలా ఎన్నిసార్లు చదివినప్పటికీ మాలతి త్యాగం వెనుక వున్నదేమిటో అతనికి అర్థంకాలేదు. బహుశా ఇంకెన్ని సార్లు చదివినా కూడా అర్థం కాదేమో! ఎందుకంటే....

అతడు చిన్నప్పుడే తలిదండ్రులను కోల్పోయి, తోబుట్టువుల్లేని కారణంగా ఏకాకిగా పెరిగి పెద్దవాడైన వ్యక్తి.






"అందరూ నిజంచెప్పమనేవాళ్ళేకాని, నిజంగా నిజంచెబితే యెవ్వరూ నమ్మటంలేదు."

"నిజం చాలా కటువుగా వుంటుంది."

"నిజంయొక్క తీక్షణతను యెవ్వరూ తట్టుకోలేరేమో !"

"నిజమనేది అందరికీ తెలుసు. కాని యెవ్వరూ బైటికి చెప్పరు."

"కోర్టులో నిజాన్నిచెప్పి శిక్ష తప్పించుకోవటం చాలా కష్టం."

"అబద్ధమాడి నిర్దోషిగా బైటపడటానికి చాలా అవకాశం వుంది."

కోర్టు హాలులోకి వచ్చి కూర్చున్నవాళ్ళంతా తలొకరకంగా తమలో తాము ఊహించుకుంటున్నారు.

వరదరాజు వంక పదేపదే నలుగురూ చూస్తున్నారు కాని అతనుమాత్రం నిబ్బరంగా కూర్చున్నాడు.

'నిజం దేనికోసం చెప్పాలి ! అన్యాయాన్ని అరికకట్టటానికి నే చేసిన పని చట్టందృష్టిలో నేరంకావచ్చు. అయితే వాళ్ళు చేస్తున్నపని న్యాయమా ?....' అటూ యిటూ ఒక్కసారిగా చూశాడు, వరదరాజు, తనలోతాను తర్కించుకుంటూ. కోర్టుహాలంతా కిక్కిరిసివుంది. గుసగుసలు అక్కడక్కడ వినిపిస్తున్నాయి. వరదరాజు మొహంలో ఆవేశం, ఉద్రేకం, అక్కసు, తామసం, అన్నీ కూడా విడివిడిగా స్పష్టంగా కనిపిస్తున్నాయి.

ప్రక్కనే కూర్చున్న అంజనేయులు, అతన్ని అదుపులో పెట్టటానికి విశ్వ ప్రయత్నం చేస్తున్నాడు.

వరదరాజు కళ్ళు గుండ్రంగా అటూ ఇటూ తిప్పి భీకరంగా చూస్తుంటే మామూలువాళ్ళకే శరీరంలోంచి వణుకు పుట్టుకుంటూ వస్తుంది.

శ్రీధర్ అప్పటికి యింకా కోర్టుహాలులో అడుగుపెట్టలేదు బైట వరండాలో నిలబడి సీరియస్‌గా కేసు ఫైలు చూస్తున్నాడు. టైము చూసుకుంటూ మెల్లిగా లోపలికి ప్రవేశించాడు.

నలుగురికళ్ళూ ఒక్కసారిగా శ్రీధర్ మీద పడ్డాయి. ఆ బరువుకు ఆయన తల వంచుకున్నాడు నమ్రతగా.

సుచేతమాత్రం జడ్జిగారి రాకకోసం నిరీక్షిస్తున్నట్టు కూర్చుంది

గోడగడియారంలో సంచలనం బయలుదేరింది. ఇహ గంటలు కొట్టేస్తాను అన్నట్టు ముందుగా హెచ్చరిక చేసింది.

క్షణంలో నాలుగవతరగతికి చెందిన ఆఫీసరుగారు గదిలోంచి గభాలున హాలులోకి వచ్చి 'సైలెన్స్' అంటూ అతివినయంగా తలవంచుకుని నిలబడ్డాడు.

గోడగడియారం పదకొండుగంటలు కొట్టటమేమిటి, జడ్జిగారు ఠీవిగా తల పైకెత్తి గబగబ అడుగులు వేసుకుంటూ ఆ ఎత్తైన ఆసనంమీద కూర్చోటమేమిటి రెండూ ఒక్కసారిగా జరిగిపోయినాయి. హాలులో అందరూ లేచి నిలబడి నమస్కారంచేసి కూర్చున్నారు.

బెంచ్‌క్లర్క్ పీతాంబరం 'కాజ్‌లిస్ట్' తీసుకుని కేసులను చదువుతున్నాడు. వరదరాజు పేరు పిలిచారు.

వరదరాజు వొళ్ళువిరుచుకుంటూ మెల్లిగా లేచి నిలబడ్డాడు.

శ్రీధర్ వల్లగౌను సవరించుకుంటూ, కాలరు కొంచెం పైకిలాగుతూ, నిటారుగా నిలబడ్డాడు.

వరదరాజు దగ్గరకు బెంచ్‌క్లర్క్ వచ్చి, నేను చెప్పినట్టు అనండి అన్నాడు మెల్లిగా అతనివంకచూస్తూ.

వరదరాజు సరేనన్నట్టు తలవూపాడు.

'నేను నిజమే చెపుతాను, అబద్ధం చెప్పను' అన్నాడు.

వరదరాజుకూడా ఆ మాటల్ని వత్తివత్తి మరీ దర్జాగా అనేశాడు.

పేరు, తండ్రిపేరు, వయస్సు, ఉండేచోటు, ఉద్యోగం వీటన్నింటిని టైపిస్ట్ కామాక్షి గబగబ కొట్టేసింది. వరదరాజు, శ్రీధర్ అడిగిన ప్రశ్నలన్నింటికీ సూటిగాను వ్యంగ్యంగాను సమాధానాలు చెప్పేశాడు. ఛీఫ్‌ఎగ్జామినేషన్ అయిపోయింది

అప్పటికి గోడగడియారం, రెండుగంటలుకొట్టి మరీ ఊరుకుంది.

జడ్జిగారు గభాలున లేచి లోపలికి వెళ్ళిపోయారు.

వరదరాజును అమాంతం నలుగురూవచ్చి కౌగలించుకున్నారు.

'వెల్‌డన్....' అంటూ వీపును చరిచారు. అతనికింకా ధైర్యం వచ్చేసింది.

జడ్జిగారు మళ్ళీ వచ్చేసి తన కుర్చీలో కూర్చుండిపోయారు, ఇంటర్‌వల్ అవంగానే. అదరాబాదరాగా నలుగురూ కోర్టుహాలులోకి వచ్చేశారు. వరదరాజు మళ్ళీ ప్రమాణంచేశాడు నిజమే చెపుతానని.

ఇహ మేనేజిమెంట్ వకీలు ఏకాంబరయ్యగారు, వరదరాజును క్రాస్ ఎగ్జామినేషన్ చెయ్యటం మొదలుపెట్టాడు.

ఆయన క్రాస్‌ఎగ్జామినేషన్‌తో ఆనాటికి కోర్టులో యీకేసుకు సంబంధించిన 'ప్రొసీడింగ్స్' ముగిసినాయి. అర్గ్యుమెంట్స్‌కు 'డేట్' యిచ్చేశారు. అందరూ నిశ్శబ్దంగా మెట్లుదిగుతూ క్రిందకు వచ్చేశారు.

## 2

మీరెప్పుడూ యింతే!....వచ్చిన అవకాశాన్ని జారవిడుచుకోవటం, తర్వాత తీరిగ్గా కూర్చుని బాధపడటం.

శ్రీధర్‌కి మతిపోయినట్లవుతోంది.

'వెంకట్రామన్ విషయం నెత్తిన నోరుపెట్టుకుని చెపితే విన్నారా? తీరా లేబర్ కోర్టులో కేసు గెలిచాడని తెలిసినతర్వాత మొహం దాటేశాడా! పోనీ ఆ తర్వాత వచ్చినప్పుడయినా, వెంకట్రామన్‌కు డబ్బుయిచ్చేటప్పుడు మీరు వెంటవుండండని బ్రతిమాలుకుని చెప్పాను. వింటేగా. చెక్ మార్చుకుని పత్తా లేకుండా వెళ్ళిపోయాడు. వీడికి మనింట్లో యెన్నెన్నిసార్లు అన్నం పెట్టాం....

నా చేత్తో నేను యెన్నిసార్లు కాఫీలు యిచ్చాను. ఆ విశ్వాసం యేమన్నా వుందా ?....'కోమలి తన ఆవేదనన్నంతా భర్తముందు వెళ్ళగక్కింది.

పెద్దగా నిట్టూర్చాడు శ్రీధర్.

ఇంకా కోమలి ఏదో చెప్పబోతుంటే, 'అబ్బే నన్ను విసిగించకు. నా మనస్సేమీ బాగాలేదు....నన్ను ఒంటరిగా వదిలేసెయ్యి...' చాలా చిరాకుపడ్డాడు శ్రీధర్.

'సరేలెండి....ఇవ్వాళ మురళికి జీతంకట్టాలి....పద్మప్రియకు పరికిణీలు బొత్తిగాలేవు....మీ చెల్లెల్ని పై ఆదివారమే చూడ్డానికి వస్తార్ట. ఆమెగార్కి కూడా ఓ చీరె కావాలి.... తర్వాత మీ యిష్టం...' రుసరుసలాడుతూ లోపలికి వెళ్ళిపోయింది కోమలి.

శ్రీధర్ ఆలోచనా ప్రవాహానికి అడ్డువచ్చేసింది. తన ఆలోచనా పరంపరలన్నీ, యింట్లో వస్తువులు లేకపోవటంమీద కేంద్రీకరించబడ్డాయి.

'అవును యీ నెలలో సంపాదన బాగానేవుంది... ఏమయింది డబ్బంతా....' శ్రీధర్ గుర్తుతెచ్చుకుంటున్నాడు.

'ఊహూ....దేశముఖ్ తల్లి హఠాత్తుగా చనిపోయింది. పాపం అతనికి తన మన అంటూ యెవ్వరూలేరు. తన జీవితంమీద తన కుటుంబాన్ని పోషించటమే కష్టంగా వుంది. ఇహ నేను ఆదుకోకపోతే యెవ్వరు ఆదుకుంటారు. మానవత్వాన్ని చంపుకోలేను. నేను అతని కిచ్చింది సహాయంగా కాదు. అది నా విద్యుక్త ధర్మం. నేను చేసింది తప్పుకాదు.... తనలో తాను సమాధానపడుతున్నాడు శ్రీధర్.

'శంకరన్ చెల్లెలి పెళ్ళికి నాలుగు వందల రూపాయలు యిచ్చాను.... ఇది కూడా అవసరమే. వీళ్ళంతా నా సహచరులు. నా మీద ఆశలు పెంచుకున్నారు. నా నీడన బ్రతుకుతున్నారు, సమయానికి వాళ్ళను ఆదుకోకపోతే వాళ్ళేమయిపోతారు....' తనలో తాను గుణించుకుంటున్నాడు.

'అయితే నా సంసార బాధ్యతలు నేను మరిచిపోలేదే.... పిల్లలకు జీతాలు కట్టాను, బట్టలు కుట్టించాను. ఇంకా డబ్బు యిచ్చాను. ఇచ్చిన డబ్బంతా యేం చేస్తోందో కోమలి అర్థంకాదు. గట్టిగా అడిగితే నలుగుర్లోనూ బావురుమని ఏడుస్తుంది నా పరువు తీసేస్తుంది.... దీంతో వేగలేక చస్తున్నా. యేం చెయ్యాలో అర్థంకావటంలేదు. దాని కెన్నిసార్లు చెప్పినా తన ధోరణే తనది. మూర్ఖత్వం యెక్కువ. దాని కర్మ దానిది....' శ్రీధర్ చాలా అలసిపోయాడు.

ఇంట్లో ఘర్షణ పడుతున్నారు తల్లీ పిల్లలు, శ్రీధర్ చెల్లెలు విశాలాక్షి వదిన గారితో వాగ్యుద్ధానికి తలపడింది. తలొక మాటా విసురుగానే అను కుంటున్నారు.

'నీ మూలానే మీ అన్నయ్యగారికి దిగులు పట్టుకుంది. ఈసారైనా వచ్చినవాడికి వంకలు పెట్టి పంపించకమ్మ మహాతల్లి. నీ పెళ్ళి అయిపోతే ఆయన గుండెలమీద బరువు తగ్గుతుంది....' కోమలి యీసడింపు మాటలు మంచంలో వత్తిగిల్లుతున్న శ్రీధర్ తల్లి చెవిన పడ్డాయి.

'నీ పోరు వలన వాడి మనస్సు పాడయిపోతోంది. ఇంటికొస్తే చాలు యేదో ఒకటి వాడి చెవిలో నూరిపోస్తూ వుంటావు. అన్ని విషయాల్లోనూ నీకు జోక్యం కావాల్సిందే....' వర్ధనమ్మ, అయాసపడుతూ అన్నది.

'కూర్చున్న చోటునుంచి కదల్లేక పోయినా రాయసాలు యెక్కువే....' కోమలి ఓ విసురు విసిరింది

'వింటున్నావురా అబ్బాయి.... కోడలేమంటుందో....' చాకిరీ చేసినన్నాళ్ళు చేశాను....ఇవ్వాళ నేనెందుకూ పనికిరాకపోయాను....' ఉక్రోషంతో అన్నది వర్ధనమ్మ.

శ్రీధర్ బిగ్గరగా అరుస్తూ 'కాసేపు నోరు మూసుకోండి' అని చేతిలో ఫైలు విసిరి గిరాటు పెట్టాడు.

అంతా ఆ క్షణంలో నిశ్శబ్దం ఆవరించుకుంది. బిక్కమొహాలు వేసుకుని ఒకరి వంక ఒకరు చూస్తూ మెదలకుండా వుండిపోయారు.

వచ్చిన పనిమనిషి నివ్వెరపోతూ నిలబడిపోయింది. 'ఏమిటిప్పుడు వచ్చావు.... నీకూ్కడా యెవరైనా నేర్పారా ఎనిమిది గంటలే పనిచెయ్యాలి.... ఆ తర్వాత పనిచేస్తే ఓవర్‌టైం అడగాలని.... మా యింటి కొచ్చేటప్పుడే అలాంటి బుద్ధిపుట్టిందా....' కోమలి పనిమనిషిని దెప్పిపొడుస్తున్నట్టుగా అంటూనే భర్తవంక చూసింది.

శ్రీధర్‌కు భగ్గున మండింది.

పనిమనిషి ముందర ఏమీ అనలేక అశక్తుడయిపోయాడు 'వారానికోరోజు శలవు బాగానే వుంది... కాని ప్రతి రోజూ నాకూ వంట తప్పదే.... కోమలి సణుగుతూనే వుంది.

'నేను యెంతమందికో నీతులు చెప్పాను. ఎంతోమంది మనసులు మార్చ టానికి ప్రయత్నం చేశాను. హక్కుల కోసం ప్రతినిత్యం హోరాహోరీ




పోట్లాడుతూనే వున్నా. అందరితోనూ విరోధం తెచ్చుకుంటూనే వున్నా. కాని నా యింట్లోనే, నేను నా ఆదర్శాలను అమలు చెయ్యలేకపోతున్నాను. నేను పూర్తిగా ఓడిపోయాను....' శ్రీధర్ మనస్సు తెగ ఆరాటపడింది. బాగా ఆందోళన పడింది. మనస్సు వికలమయిపోయింది.

రేపు అంబయ్య వస్తే ఏం సమాధానం చెప్పాలి? వరదరాజు కేసులో ఆర్గ్యుమెంట్స్‌కు ప్రిపేర్ కావాలి. ఓ మూల యూనియన్ల ఎలెక్షన్లు వచ్చి పడుతున్నాయి. ఈ సారైనా మంచివాళ్ళను ఆఫీసు బేరర్స్‌గా ఎలెక్ట్ చేస్తే తప్ప ప్రయోజనంలేదు. తన ఆదర్శాలకు, తన మనోప్రవృత్తికి అనుగుణంగా నడుచుకోగల ఆత్మవిశ్వాసం గలవాళ్ళు చాలా కొద్దిమందే సాధించే కనిపిస్తున్నారు. ఇలాంటప్పుడు అందరికి వ్యతిరేకమయి తాను ఒంటరిగా దేమీ వుండదు. వాళ్ళ పద్ధతి ప్రకారం నడుచుకోవటానికి మనస్సు వొప్పటం లేదు.

ఇలాంటి మధనంతో సతమత మయిపోతున్నాడు శ్రీధర్.

బైట సమస్యలు యిన్ని వుండగా, యింట్లో సమన్వయం, సహకారం లేకుండా పోతోంది. ప్రతి చిన్న విషయానికి యింట్లో పోట్లాటలు, బిగ్గరగా అరుచుకోవటం పరిపాటయిపోయింది

ముఖ్యంగా యిప్పుడు తాను తన చెల్లెలిపెళ్ళి చేస్తే కొన్ని సమస్యలు పరిష్కార మయినట్లే! ఈ సంబంధమైనా కుదిరితే బాగుండును అనుకుంటున్నాడు.

ఇంతలో నలుగురు ఓ టాక్సీలోంచి దిగి లోపలికి వస్తూనే నమస్తే అన్నారు.

శ్రీధర్ తలెత్తి చూసి, ప్రతినమస్కారం చేశాడు.

శ్రీధర్ యిల్లు అట్టే పెద్దదేమీ కాదు. వెనకాల వంటిల్లు, స్టోర్ రూము వదిలేస్తే, ముందు వరండా, ఓ చిన్న గదీ వున్నాయి ఇవైనా యీమధ్యనే యేర్పడ్డాయి. కోపరేటివ్ సొసైటీలో మెంబరుగా చేరి, వాళ్ళవెంట తిరగ్గా తిరగ్గా నాలుగేళ్ళకు యీ ప్లాటు ఆయనకు యిచ్చారు. అన్నీ రూల్స్ ప్రకారం నడుచుకోవటం వలన ఇంటిప్లాను మంజూరవటం దగ్గర్నుంచి సొసైటీవాళ్ళు 'లోన్' శాంక్షను చేసేవరకు అంతా ఆలస్యమే. ఏమైనాగాని అని పట్టుదలతో అన్ని పాట్లుపడి 'లోన్' శాంక్షన్ చేయించు కున్నాడన్నమాటే తప్ప చేతికి డబ్బు రానేరాలేదు. తీరా రేపో మాపో 'చెక్' వస్తుందను కుంటూ వుండగా, ఆ కోపరేటివ్ సొసైటీని సూపర్‌సీడ్ చెయ్యటం, ఆ సొసైటీ సెక్రటరీని డబ్బు దుర్వినియోగం చేశాడనే నేరంమీద అరెస్టు చెయ్యటం జరిగింది. మళ్ళీ మొదలు. ఇన్సూరెన్స్ కంపెనీ చుట్టూ తిరిగి ఎట్లాగయితే 'లోన్' తెచ్చుకున్నాడు. ఈమాత్రం యిల్లైనా కట్టుకోగలిగాడు. పైన ఓ గది వెయ్యాలని విశ్వప్రయత్నం చేస్తూంటే ఏడాదినుంచి సాధ్యంకావటంలేదు. ప్రతి నెలా ఏదో అదనపు ఖర్చులు అనుకోని ఇబ్బందులు, అట్లాగే గడిచిపోతోంది.

ఎవరైనా వచ్చిఅంతరంగికంగా మాట్లాడాలంటే, ముందుగదిలో మధ్యగా ఓ చెక్కతో పార్టిషన్ ఏర్పాటుచేసి వుంచాడు. అక్కడ కూర్చొని మాట్లాడు కుంటారు.

ఆయనింటికి వచ్చే వాళ్ళందరికి యిది తెలుసు. అందుకనే వచ్చీ రావటం తోనే చొరవగా లోపలికి వెళ్ళి చాపమీద కూర్చున్నారు.

శ్రీధర్ కూడా, వాళ్ళ వాలకం చూస్తూ ఆదరా బాదరాగా లోపలికి వెళ్ళాడు.

'మా డిమాండ్స్ అన్నీ మూల్‌చంద్ వొప్పుకున్నాడు. ఇహ ఎగ్రిమెంట్ రాసుకోవడమే మిగిలిపోయింది. ఈసారి హౌస్ రెంట్ ఎలవెన్స్ కూడా యివ్వటానికి నిర్ణయమయింది. ఇదంతా అంబయ్యగారి చాకచక్యం. నిజంగా ఆయనే కనక ఇంత శ్రమా ఓర్పు చూపించకపోతే యిది సాధ్యమయ్యేదేకాదు. ఇంకోమాట, ఏ చిన్న విషయము వచ్చినా, మేము మీ దగ్గరికి సలహాలకు వస్తూనే వుంటున్నాం. ఇంతవరకు మేము యేమీ యిచ్చుకోలేకపోయినాము, అయిపోయిందేమిటో అయిపోయింది. ఇది తీసుకోండి.... మీరేమో కొంచెం మీరు అంబయ్యగారితో మూల్‌చంద్‌గారి దగ్గరకు వెళ్ళి ఎగ్రిమెంట్ డ్రాఫ్ట్ చెయ్యండి.... వస్తాం....' అంటూ గభాలున లేచి నిలబడ్డారు.

వాళ్ళు యిచ్చిన కవరు అక్కడే చాపమీద పెట్టాడు. ఆ కవరులో యెంత డబ్బుందో యేమో వాళ్ళూ చెప్పలేదు. శ్రీధర్ అడగనూలేదు.

అది తీసుకోవటమా తీసుకోకపోవటమా ?

నిజమే వీళ్ళు చాలాసార్లు తన దగ్గరకొచ్చి సలహాలు తీసుకోవటమే కాకుండా, ఎన్నో రిప్లయిస్ నోటీసులు వ్రాయించుకెళ్ళారు కూడా. అప్పు డేమీ డబ్బు ఇవ్వనేలేదు ఫీజు క్రింద నేను యీ డబ్బు తీసుకోవడంలో తప్పు లేదు. లాయరుగా ఫీజు తీసుకోవాల్సిందేగా? అందులో వాళ్ళంతట వాళ్లు యిస్తున్నారు. శ్రీధర్ మనస్సు పూర్తిగా సమాధానపడింది.

అయితే మీరు అంబయ్యతో కూడ కలిసి మూల్‌చంద్ దగ్గరకు వెళ్ళమని యీ ఆదేశం ఏమిటి? ఇందాక అంబయ్య వచ్చి కూడా యిదే మాట అని పోయాడు. నేను ఆయన దగ్గరకు వెళ్ళటానికని ముందు ఈ డబ్బు ఎర చూపిస్తున్నారా యేమిటి! అట్లాగవుతే యిది తీసుకోకూడదు. ఇంకా యే నిర్ణయం తీసుకోలేదు గదా. తీరా నేను అంబయ్య చెప్పినట్టు నడుచుకోలేకపోతే, యీ డబ్బు నేను తీసుకోవటం ఎంతవరకు సమంజసం?

ఓ మూల చెల్లెల్ని చూడటానికి వస్తున్నారు. ఇదే ఖాయమవుతే పెళ్ళికి వ్యవధి కూడా లేదు. వాళ్ళనీ వీళ్ళనీ అడిగి డబ్బు సమకూర్చుకోవాలి. ఇప్పుడు యింటికొచ్చి యిచ్చిపోతున్న డబ్బును కాదని తర్వాత యింటింటికి వెళ్ళి చెల్లెలి పెళ్ళికి డబ్బు కావాలని అడుగుతే యెవరిస్తారు?

సరే యేమయినా కాని, నా అంతరాత్మకు నేను విరుద్ధంగా ఏదీ చెయ్యటం లేదు. నా ఆదర్శాలను నేను కాంప్రమైజ్ చేసుకోవటంలేదు. ఇదే ప్రధానం. తనలో తాను పూర్తిగా సమాధాన పడి, చిరునవ్వుతో నమస్కారం చేశాడు శ్రీధర్.

వాళ్ళు అన్నదానికి అవుననిగాని కాదనిగాని సమాధానం చెప్పలేదు. అయితే వాళ్ళు సంతృప్తిగా వెళ్ళిపోయారు.

ఆరోజు గడవటమే మహా కష్టమయిపోయింది. ఒక్కొక్కరోజు మహా టెన్షన్‌గాను, మహా ఆరాటంగాను గడుస్తూవుండటం శ్రీధర్‌కు మామూలయి పోయింది.

అయితే యీరోజు వెనకటివాటికంటె చాలా ప్రాబ్లమ్స్ తెచ్చిపెట్టింది.

శ్రీధర్ యిరకాటంలో పడిపోవటమే గాకుండా, తాను చేస్తున్న పని యే విధంగా పరిణమిస్తుందో అనే ఆందోళన కూడా బాగా యెక్కువగా వుంది.

రాత్రి తొమ్మిదయింది. పిల్లలు పడుకుని నిద్రపోతున్నారు.

విశాలాక్షికి రాత్రి చాలా పొద్దుపోయేదాక చదవటం అలవాటు.

ఈడొచ్చిన చెల్లెలు అట్లా దీపం ముందర చదువుతూ కూర్చుంటే, తాము గదిలోకి వెళ్ళి పడుకోవటం ఎబ్బెట్టుగానే వుంటుంది. కాని యిది ఒకనాటి సమస్య కాదు మొదట్లో తటపటాయించినా, తర్వాత తర్వాత తప్పిందికాదు. కోమలికి అవుతే అలవాటయిపోయింది విశాలాక్షి మనస్సు యేమనుకుం టుంటుందో యేమోగాని పైకి మాత్రం తనకు యేదీ పట్టనట్టుగానే ప్రవర్తిస్తోంది.

శ్రీధర్ ఆ గదిలో వున్న మంచంమీద వెల్లకిలా పడుకున్నాడు. కోమలి మంచంమీద కూర్చుని వుంది. తలుపులు కిర్రుమన్నాయి.

శ్రీధర్ అట్లాగే పడుకుని వున్నాడు.

కోమలి మనస్సంతా అక్కసుతోనూ కోపంతోనూ నిండిపోయింది.

'మీరు రోజు రోజుకు యిట్లా యిదయిపోతూంటే మేము ఎట్లా భరించ గలం... మీ మాట మీకేగాని, నేనెంత చెప్పినా వినిపించుకోరు....' కోమలి ప్రారంభించింది.

'నువ్వు చెప్పిన మాటేమిటి నేను విననిదేమిటి!' శ్రీధర్ తాపీగా అన్నాడు.

'మన పిల్లలు పెద్దవాళ్ళవుతున్నారు. వాళ్ళ విషయం చూడాల్సిన బాధ్యత మనదికాక యింకెవరిది! నాలుగు రూపాయలు వస్తున్నప్పుడే వెనక వేసుకోక పోతే ముందు ముందు మనల్ని ఎవరు ఆదుకుంటారు! ఇవ్వాళ సంఘ సేవ అంటూ కష్టపడి సంపాదించిన డబ్బంతా వాళ్ళకూ వీళ్ళకూ యిచ్చేస్తూ వుంటే, రేపటిరోజు మనకు అవసరమయితే ఒక్క ఒక్కడూ చిల్లిగవ్వ కూడా యివ్వడు. అందరూ మనల్ని గేలీ చేసేవాళ్ళే ఇది మీరు గ్రహించటంలా....'

శ్రీధర్ పెద్దగా నిట్టూర్చాడు.

'అవును నిజమే, కోమలి చెప్పింది నిజమే! మనకు అవసరం వచ్చి చెయ్యి జాస్తే ఎవ్వరూ యివ్వని మాట నిజమే! అయితే నేను యిప్పుడు చేస్తున్న దంతా ముందు వాళ్ళంతా ఏదో ఒరగబెడతారని కాదుగా ప్రతిఫలం ఆశించి యేమీ చెయ్యటంలేదే! నా విద్యుక్తధర్మం నేను చేస్తున్నాను. నా బాధ్యత నేను నిర్వర్తించుకుంటున్నాను ఈ ముక్క యెన్నిసార్లు చెప్పినా కోమలికి అర్థంకావటంలేదు, అర్థంకాదు.

ఇవ్వాళ నా కళ్ళ యెదుట నా తోటి మనుషులు నాతో కలిసిమెలిసి పనిచేసే వాళ్ళు కష్టాల్లో వుంటే, వాళ్ళకు సహాయపడకుండా, ఎప్పుడో పిల్లలు పెద్ద

వాళ్ళవుతారని, వాళ్ళ అవసరాలకని నేను డబ్బు దాయలేను. ఇది నా చేత కాని పని. ఇది నావల్ల కాదు.. శ్రీధర్ మనస్సులో ఆవేదనపడుతూ వత్తిగిలి పడుకున్నాడు.

'అయితే నేను చెప్పిన మాటలు వింటున్నారనటం యిదేనా!....మీరు ఆలోచించుకోండి. నేను చెప్పినదాంట్లో పొరపాటు వుంటే చెప్పండి, సరిదిద్దు కుంటాను....' కోమలి కొంచెం సాత్వికంగా మాట్లాడింది.

చప్పున కోమలివైపు తిరిగి ఆమె కళ్ళల్లోకి చూశాడు

'ఎప్పుడూ అనే ముక్కేగా. దాచుకోవటం, చూచుకోవటం రెండూ ఒకటే నని ఎవరో అన్న ముక్క పట్టుకుని అంత యిదిగా తీసుకోవటం మనకూ మన కుటుంబానికీ అంత మంచిదికాదు. దేనికైనా హద్దుంటుంది. మితిమీరితే ఏదైనా నష్టమే!...'

'కోమలీ... నేను రాను రాను ఒంటరివాణ్ణయిపోతున్నానేమోనని భయమేస్తూ వుంటుంది....ఇది మహా సమరం. సాంఘిక వ్యవస్థమీద, జీర్ణించుకుపోయిన మూఢవిశ్వాసాలమీద యుద్ధం ఇది యే వ్యక్తిమీద చేస్తున్న దాడీ కాదు. దీంట్లో గెలవాలంటే, నేను ఒక్కణ్ణే ఏమీ చెయ్యలేను ఇంటా బయటా కూడా నాకు పూర్తి మద్దతు, సహాయం, అవగాహన వుండాలి. అప్పుడే నేను యేమైనా చెయ్యగలుగుతాను ...' శ్రీధర్‌లో ఆవేశం పూర్తిగా కనిపించింది.

'స్వార్థం నూటికి నూరుపాళ్ళు జీర్ణించుకుపోయిన యీ వ్యవస్థలో మీరను కుంటున్న ఆదర్శాలకు ఆశయాలకు చోటు చాలా తక్కువ....' కోమలి సమాధానం శ్రీధర్‌కు ఆశ్చర్యం వేసింది.

'నువ్వేనా ఈ మాటలు అంటోంది. ఆ కోమలివేనా! చీకటిని ఛేదించటానికి ఎంత చిన్న దీపమైనా వెలిగించాలి అని, కాలేజీలో ప్రచారం చేశానని గొప్పగా చెప్పుకున్నావే, అదేమయింది... '

'తెలిసీ తెలియని రోజుల్లో ఎన్నెన్నో చేస్తాం. ఉద్రేకంలో ఆలోచన ఉండదు.' కోమలి చప్పున సమాధానం చెప్పింది.

'నువ్వు నన్ను ఉద్రేకపరచటానికి, నన్ను పరీక్షించటానికి యీ ముక్కలు అంటున్నావేగాని, నిజంగా నీ హృదయంలోంచి వచ్చినవి కావు....' శ్రీధర్ తమాయించుకున్నాడు.

'మీరేమైనా అనుకోండి. నేను నిజంగా చెప్తున్నాను. మనస్ఫూర్తిగా చెప్తున్నాను. మీరు ఏనాడైనా నిజాన్ని గ్రహించుకోగలుగుతామోననే నమ్మకం తోనే చెపుతున్నాను....'

శ్రీధర్ వేడి నిట్టూర్పులు కోమలిదాకా వచ్చినాయి.

'మా అమ్మ అంటూండేది, మన అన్నం మనం తింటూ వున్నా లోకులకు వెరవాలని...మనం చేస్తున్న పనులు సక్రమమైనవే అనుకుంటేచాలదు లోకం ఏ దృష్టితో చూస్తోందో కూడా గమనించాలి. మీకు యీ విషయం కూడా తెలియదు.' అచ్చితంగా చెప్పేసింది.

'ఈ మాట నేను కాదనటంలేదు. మరి నన్నేం చెయ్యమంటావు। నువ్వు దేన్ని గురించి చెపుతున్నావో నాకు అర్థమయింది....।

'అర్థమయిందని వూరుకుంటే చాలదు....నెత్తిమీద కొచ్చిపడిన తర్వాత మనం యేమనుకున్నా ప్రయోజనంలేదు....' కోమలి నిశ్చయంగా అనేసింది.

'అయితే యేం చెయ్యమంటావో నువ్వే చెప్పు....' సూటిగా ప్రశ్నించాడు.

'మగరాయిళ్ళతో సమానంగా తిరగటం, మాట్లాడటం, అయినవేళ కానివేళ మనింటిచుట్టూ తిరగటం యేమీ బాగాలేదు....'

'దానికి మనమేం చేస్తాం....మా యింటికి రావద్దంటాం. అంతేగా మనం చెయ్యగలిగింది. అంతకంటే మన మేమన్నా చెయ్యగలుగుతామా చెప్పు....'

'ముందర ఆ పని చెయ్యండి. తర్వాత సంగతి తర్వాత చూద్దాం....'

ఇదే ఆలోచనలేని పనంటే. మనింటికి రావద్దనంగానే, యూనియన్ ఆఫీసులో కలుసుకుంటుంది క్లబ్బుకు వస్తుంది, నా టేబుల్ దగ్గరికి వచ్చి నాతో మాట్లాడుతుంది. పదిమంది మగవాళ్ళలో కూడా తనిష్టంవచ్చినట్టు మాట్లాడేస్తుంది. వీటన్నింటికి మనమా బాధ్యులం।....

'మీరింతవరకే విన్నట్టున్నారు. సుచేతను గురించి యింకా యింకా విన్నా కూడా నేను. ఆంజనేయులును విడిచిపెట్టి ఒక్క క్షణం వుండదుట....।

'సుచేత అలాంటిది కాదు. సాటి స్త్రీని నిజమేమిటో తెలుసుకోకుండా యింత చులకనగా మాట్లాడటం మన సభ్యతకు లక్షణం కాదు' గంభీరంగా అన్నాడు.

'ఏదైనాగాని యితరులు చెపితే వింటాం, అంతేగాని మనం కళ్ళారా చూస్తేనేగాని నమ్మటానికి వీల్లేదంటే, మనం ఏదీ నమ్మటానికి వీల్లేదు....'

'ఇది టూమచ్ ।....'

'మీ కట్లాగే అనిపిస్తుంది....నందగోపాల్‌గారి కొడుకు కిశోర్‌ను, సుచేత కలుసుకుంటోందంటే మీరు నమ్ముతారా ।....'

'ఏమిటి। వాట్ నాన్‌సెన్స్। అబ్సర్డ్ ।....సుచేత యెక్కడ ? కిశోర్ యెక్కడ? .... అయినా యీ న్యూస్ అంతా నువ్వెక్కడ గాదర్ చేస్తున్నావు... ?'



'నాకు చెప్పేవాళ్ళు నాకూ వున్నారు. మీకు కోపంరాదంటే నేనో ముక్క అంటాను....'

'ఏమిటో చెప్పు....'

'మీకూ, సుచేతకు సంబంధం కలిపి నానా మాటలు అంటున్నారు' మీకు తెలుసా?....'

'ఇది పాత న్యూసే....'

'అయితే తెలిసికూడా మీ ప్రవర్తనలో ఏం మార్పు లేదన్నమాట....'

'ఎవరో ఏదో అన్నారని మనం బాధపడితే యేం లాభం చెప్పు....అయినా నీ ఉద్దేశం యేమిటి?....' 'అహ?....ఏం ప్రశ్న....'

'నేను నిజంగానే అడుగుతున్నాను... '

'పుకార్లు కాబట్టే నేను మీకు చెబుతున్నాను....మీకు అలాంటి ధైర్యాలు లేవని నాకు తెలుసు....'

శ్రీధర్ పకాలున నవ్వాడు.

చప్పున, చెల్లెలు పక్కగదిలో కూర్చుని చదువుతోందనే మాట స్ఫురణకు వచ్చి ఉక్కిరిబిక్కిరయిపోయాడు.

రాత్రి వెచ్చగా తియ్యగా గడిచిపోయింది.

## 3

అన్నిరోజులూ ఒకేమాదిరిగా గడిచిపోతున్నాయి. తెల్లారఁగానే అమాం బాపతువాళ్ళు శ్రీధర్ యింటికి రావటం, సలహాలు యిచ్చేవాళ్ళకు సలహాలు ఇవ్వటం, వ్రాసిపెట్టాల్సినవాళ్ళకు వ్రాసిపెట్టటం, ఉద్రేకంగా మాట్లాడేవాళ్ళను శాంతపరచటం, నీతులు బోధించటం ఊరడించటం, ఒకటేమిటి అన్నీను.

శ్రీధర్ దగ్గరకు వచ్చేవాళ్ళంతా మూడొంతులు కార్మికులే. ఏదో బాధతో, తీరని వ్యధతో అసంతృప్తితో వచ్చి వాళ్ళగోడును చెప్పుకోవటం, శ్రీధర్ అంతా సావధానంగా విని తగిన సలహాలివ్వటం పరిపాటే.

పదకొండు అయ్యేటప్పటికి కోర్టులో వుండితీరాలి. అందుకనే యీ తతంగం అంతా పదింటికే ముగించుకుని, ఆదరాబాదరాగా భోజనంచేసి, కోర్టుకువెళుతూ ఉంటాడు. పనిబట్టి అవసరమయితే సాయంత్రము అయిదింటివరకో, పెంద లాడే వస్తే మళ్ళీ లేబర్ ఆఫీసులోనూ కాలంగడిపేస్తూ వుంటాడు. సాయంత్రం అయిదు అయినప్పటినుంచి మళ్ళీ మొదలు. ప్రొద్దున మిగిలిపోయినవాళ్ళో లేక పోతే క్రొత్తవాళ్ళో కాకపోతే పాతవాళ్ళే సంప్రదింపులకోసమో వచ్చి కూర్చుంటారు. వాళ్ళతో సరిపోతుంది.

ఇహ రాత్రుళ్ళు సమావేశాలు. షిఫ్ట్ దిగివచ్చిన కార్మికులకు ఆ రాత్రే సమయం దొరుకుతుంది. వాళ్ళతో మాట్లాడాలంటే అదే సమయం. నిజానికి శ్రీధర్‌కు ఊపిరిసలపటంలేదు కాని కార్యక్రమాలన్నీ సక్రమంగా నెరవేర్చు కుంటూ వస్తూనే వున్నాడు అలసట విరామం అంటూ లేదు.

ఇంత నాకిరీ యెవరికోసం చేస్తున్నట్టు! ఈ ప్రశ్నకు కోమలికి యింతవరకు సంతృప్తి అయిన సమాధానం దొరకలేదు అందువల్లనే ఆమెగారు ఆవేశ పడిపోతూవుంటుంది. రోజుకు ఓసారయినా ఘర్షణ తప్పటంలేదు, శ్రీధర్‌తో.

ప్రతిరోజూ యిట్లా గడుస్తున్నా, ఒక్కొక్కరోజు మరీ సతమతమయిపోతూ వుంటాడు. రోజు యిట్టే గడిడిచిపోయినట్టు కనిపిస్తుంది. పనులేమో యెన్నో మిగిలిపోతూవుంటాయి.

యీనాడు యింకోరకమైన ఆందోళన అతన్ని పట్టుకు పీడిస్తోంది.

వరదరాజు కేసులో యివ్వాళే ఫైనల్ ఆర్గ్యుమెంట్స్!

ఈ సాయంత్రమే విశాలాక్షిని చూట్టానికి వాళ్ళొస్తున్నారు.

ఇల్లంతా హడావుడిగా వుంది

అందరితోనూ మాట్లాడుతున్నట్టే కనిపిస్తున్నాడుగాని యెవ్వరికీ సంతృప్తి కలిగించలేకపోతున్నాడు.

'ఆ... ఊ.. ' అనటం తప్ప విపులంగా యేమీ చెప్పటంలేదు.

'టైమయింది అన్నంపెట్టు....' అంటూనే గదిలోకి వెళ్ళి పుస్తకాలు సవరిస్తున్నాడు.

'ఇందాకనే వడ్డించాను....' అన్నది ఆనాటి హడావిడి అంతా గమనిస్తూ కోమలి.

'నేనొచ్చేటప్పటికి ఆలస్యం అవుతుందేమోగాని సాయంత్రం ఎరేంజ్ మెంట్స్ అన్నీ చూడు ..నీకిచ్చినడబ్బు సరిపోతుందిగా...కావాలంటే అలమారాలో వుంది తీసుకో ...మజ్జిగ పొయ్యి....?

'ఇంకా కూర కలుపుకోలేదు....'

'ఓహో... నెయ్యేయ్....' చెప్పటం మరిచేపోయాను....గంగాధరరావుగారు వస్తారేమో....ఉండమని చెప్పు....పెద్దవాడు ఆయనకూడా వుంటే సరిపోతుంది....'

'నే చెపుతాలెండి ... మీరవుతే పెందరాళే రండి... '

'ఆ' అయిదింటికి వచ్చేస్తాను. నేననుకోవటం...ఇంకా పెందరాళే రావచ్చుని మరి ఏకాంబరయ్యగారి ఆర్గ్యుమెంట్స్ ఎంతవరకు సాగుతాయో ....'

'పోనీ ఇంకోరోజు అడగరాదూ....'

'నేనడగను. యూనియన్‌వాళ్ళందరూ వచ్చి కూర్చుంటారు...వాళ్ళే అడిగితే ఏ చిక్కూ లేదు....సరేగాని....నే చెప్పిందంతా జ్ఞాపకం వుంచుకున్నావుగదా? విశాలా....నే వెళ్లొస్తానమ్మా....పెందరాళే వస్తాలే....' అంటూ చకచక కోర్టుకు బయలుదేరాడు శ్రీధర్.

ఇతర ఫ్యాక్టరీలలో పనిచేసే కార్మికులుకూడా వచ్చి కూర్చున్నారు.

లా పుస్తకాల దొంతర్లచాటున మేనేజిమెంట్ ఎడ్వకేట్ ఏకాంబరయ్య, ఆయనకు ఎదురుగా కూర్చున్న వరసలో వున్నవాళ్ళకు పూర్తిగా కనిపించటం లేదు.

ఈ పుస్తకాలు చూసి పెదిమలు విరుస్తున్నారు కొంతమంది.

'ఇదంతా ఒక షో. పుస్తకాల్లో యేముంటుంది .... మన శ్రీధర్‌గారు సామాన్యులా....ఆయన తీసుకొచ్చారు ముఖ్యమైన నాలుగు పుస్తకాలు....'

'ఈ పుస్తకాల దొంతర్లు చూసి భయపడే రోజులు పోయినాయి....'

'తెచ్చిపెట్టారు అంతే, ఎన్ని పుస్తకాలు తెరుస్తాడో చూస్తాంగా !....'

తలొకరకంగా వ్యాఖ్యానించుకుంటున్నారు.

గోడగడియారం పదకొండుగంటలు కొట్టటం, జడ్జిగారు చర్రున వచ్చి ఎత్తైన కుర్చీలో కూర్చోవటం ఒక్కసారిగా జరిగిపోయినాయి.

బెంచిక్లర్క్ పీతాంబరం తన డ్యూటీని సునాయాసంగా చేసేస్తున్నాడు.

ఆనాడు ప్రత్యేకంగా యీ ఆర్గ్యుమెంట్స్ వినటానికే జడ్జిగారు సిద్ధంగా వున్నారు.

హాలంతా నిశ్శబ్దంగా వుంది.

శ్రీధర్ లేచి నిలబడ్డాడు.

వరదరాజు గుండె గబగబ కొట్టుకుంటోంది. ఈనాడు ఏ ఆవేశం లేకండా తాపీగా కూర్చుని వున్నాడు. సుచేత బింకంగా కూర్చుని వుంది. మిగతా కార్మికులు, నాయకులు అంతా శ్రీధర్ వంకే చూస్తూ కూర్చున్నారు.

"యువర్ ఆనర్ .... మే ఇట్ ప్లీజ్ యూ ...." అని మెల్లిగా అంటూ "ఫస్ట్ ఆఫ్ ఆల్ ఐ విల్ రీడ్ ది రిఫరెన్స్" చదవటం మొదలుపెట్టాడు.

ఈ క్రింద ఉదహరించిన కోర్కెలు యెంతవరకు సమంజసమైనవి? వాటిని యెంతవరకు అంగీకరించవచ్చు. వరదరాజును పనినుంచి తొలగించటం సక్రమమైన పనేనా! లేకపోతే అతనికి యెలాంటి 'రిలీఫ్' యివ్వాలి.

ఈ విషయాన్ని పరిశీలించే ముందు కొంచెంగా బాక్‌గ్రౌండ్ చెప్పటం అవసరం అనుకుంటాను.

ఈ మందుల ఫ్యాక్టరీలో జీతాలు చాలా తక్కువగా వున్నాయి. యీ ప్రాంతంలో యిలాంటి ఫ్యాక్టరీలు యింకా కొన్ని వున్నాయి. వాటిలో వున్న వేజ్ స్ట్రక్చర్స్‌తో పోల్చి చూస్తే ఈ ఫ్యాక్టరీలో కార్మికులకు యిస్తున్న జీతాలు అతి హీనంగా వున్నాయనటంలో అతిశయోక్తి యెంతమాత్రమూ లేదు. రికార్డు చూస్తే కోర్టువారికి తెలుస్తుంది.

అయితే జీతాలు పెంచమని, ఇతర వసతులు కల్పించమని కార్మికులు రెండేళ్ళనుంచి వినతిపత్రాలు సమర్పించటంతో సరిపోయింది. మేనేజిమెంటు వారు మూర్ఖంగా, ఆ డిమాండ్స్‌ను తిరస్కరించారు."

ఏకాంబరయ్య చప్పున లేవబోయాడు. జడ్జిగారు కల్పించుకుని "మిస్టర్ శ్రీధర్! నింద మాటలు ఉపయోగించకండి. 'ఫాక్ట్స్' చెప్పండి" అన్నారు.

'ఐ యామ్ సారీ....' శ్రీధర్ మళ్లా మొదలుపెట్టాడు.

"ఈ వర్కర్స్ సహాయ సహకారాలతో యెంతో లాభం గడించి కూడా, ప్రాఫిట్ అండ్ లాస్, బాలెన్స్ షీట్స్‌లలో నష్టాలే చూపిస్తున్నారు. ఇలాంటి అక్రమ పద్ధతిని అరికట్టాలని కోర్టువారిని ప్రార్థిస్తున్నాను. నిజం తెలుసుకుని కార్మికులకు న్యాయం చేకూర్చమని విన్నవించుకుంటున్నాను."

"మిస్టర్ శ్రీధర్! కన్‌ఫైన్ టు ది సబ్జక్ట్!...."

శ్రీధర్ చెప్పినదాంట్లో ఎంత సత్యమూ, ఎంత వాస్తవికత వున్నా కూడా జడ్జిగారు యే రకంగానూ సహాయం చెయ్యలేరు. ఆయన కొన్ని నియమాలు పాటించాలి.

అందుకనే శ్రీధర్ గట్టిగా వాదిస్తున్నప్పటికీ జడ్జిగారు అప్పుడప్పుడు వారిస్తున్నారు.

"మా కడుపు మండిపోయి యిట్లా చెపుతున్నానేగాని, మాకు ఎవ్వరిమీదా ద్వేషంలేదు. ఇంత కష్టపడి పనిచేస్తున్నవారికి కడుపునిండని జీతాలు యిచ్చి యింకా యింకా ఎక్కువ పని చేయించుకోవటం మహా దారుణం. ఇలాంటి పద్ధతికి యింక స్వస్తి చెప్పాలి. మా సహనం అంతమయ్యే పరిస్థితికి తీసుకొచ్చారు మేనేజ్‌మెంట్‌వారు...."

'ఐ అబ్జెక్ట్!....' ఏకాంబరయ్య అమాంతం లేచి నిలబడ్డాడు.

"న్యాయం, ధర్మం ..ఏమీ లేకుండా మేనేజింగ్ డైరెక్టర్ని గదిలో బంధించి కొట్టబోవటం ఎవరైనా సమర్థిస్తారా...." ఎప్పుడూ కూడా తాపీగా వుండే ఏకాంబరయ్యగారు యివ్వాళ యెందుకనో చాలా తీవ్రంగా అన్నాడు.

"ఆకలిగా వున్నవాడికి నీతులు బోధించటం మహాపాపం...." శ్రీధర్ ఇంకా ఉద్రేకపడ్డాడు.

"హియర్ హియర్" అంటూ హాలులో చప్పట్లు వినిపించినాయి.

బంట్రోతు మామూలుగానే సైలెన్స్ అన్నాడు. జడ్జిగారికి వివేకానందుని రూపం ఒక్కసారిగా కళ్ళలోకి వచ్చింది. పైకి యెంతో హుందాగానూ ఠీవిగానూ ఉండిపోయాడు. తల విదిలిస్తూ జడ్జిగారు చాలా మెత్తగా మందలించారు.

శ్రీధర్ ఆపి ఆపి మెల్లి మెల్లిగా ఒక్కొక్క సమస్యనువి పులీకరిస్తూ, తూచి తూచి మరీ మాటలు వాడుతున్నాడు.

జడ్జిగారు ఆసక్తికరంగా వింటున్నారు.

'సాక్ష్యాలు సృష్టించటం. ఎంక్వైరీలో వాళ్ళచేత అబద్ధాలు చెప్పించటం,

మేనేజిమెంటువారికి కష్టమైన పనేమీ కాదు. ఆఫీసు స్టాఫ్ మేనేజిమెంట్‌వారు చెప్పినట్లు నడుచుకోవటం ఎక్కడైనా జరిగేదే. అందువల్లనే వరదరాజు, మేనేజింగ్ డైరెక్టరుగారి రూములోకి ప్రవేశించబోయాడని ఒక సాక్షి, మరొక సాక్షి రూములోకి వచ్చి నందగోపాల్‌గార్ని చంపబోయాడని, యింకొక సాక్షి, వరదరాజు దురుసుతనంగా ప్రవర్తించాడని చెప్పారు. ముగ్గురూ మూడు రకాలుగా చెప్పారు. అసలు నిజానికి వరదరాజు ఆ రూములోకే వెళ్ళలేదని, అక్కడ జరుగుతున్న గలాటాను విని అమాంతం వెళ్ళి నందగోపాల్‌గార్ని రక్షించటానికి ప్రయత్నం చేశాడని మా వాదన. ఇది కేవలం కక్షతోనూ, ద్వేషంతోనూ చేసిన పనని, వరదరాజు నిర్దోషని సవినయంగా కోర్టువారికి మనవి చేసుకుంటున్నాను.

ఒక సత్యాన్ని అబద్ధాల సాక్ష్యంతో అబద్ధంగా రుజువు చేయటానికి పూనుకోటం అతి శోచనీయమైన పనని, దానిని నేను గుర్తిస్తున్నానని మనవి చేస్తున్నాను. సమంజసమైన డిమాండ్స్‌ను అంగీకరించకపోగా, డిమాండ్స్ రైజ్‌చేశారని కోపంతో యూనియన్‌కు మూలస్తంభంగావున్న వరదరాజుగార్నే ఉద్యోగంలోంచి తీసివేశారు. బహుశా దీనివలన యూనియన్ పూర్తిగా విధ్వంసం అయిపోతుందని మేనేజిమెంట్‌వారు అపోహపడి వుండొచ్చు. ఇది వాళ్ళ భ్రమేకాని, నిజంకాదు. వాళ్ళ కవ్వింపు చర్యవలన యూనియన్ యింకా బలపడిందేగాని, విచ్ఛిన్నం కాలేదు. కార్మికవర్గాలలో యింకా దృఢ సంకల్పం యెక్కువయింది. మేనేజిమెంటువారి దుశ్చర్యలు యింకా కొనసాగవని హెచ్చరిస్తున్నాను....” ఇంకా శ్రీధర్ ఏదో చెప్పబోతుంటే....

“కం టు పాయింట్” అన్నారు జడ్జిగారు.

మళ్ళీ ‘అయామ్ సారి’ అంటూ శ్రీధర్ మొదలుపెట్టాడు.

ఈ ఎకౌంట్స్ బుక్స్ అన్నీ కూడా బోగస్‌వే. ఈ మేనేజిమెంట్ వారు రెండు రకాల సెట్లను తయారుచేస్తారు. ఒక పుస్తకంలో లాభం, మరొక పుస్తకంలో నష్టం కనబరుస్తూ వుంటారు....”

‘షేమ్ షేమ్’ అనే మాటలు జడ్జిగారి చెవిదాక వచ్చి ఆగిపోయినాయి

శ్రీధర్ తాను కోర్టులో దాఖలుచేసిన కాగితాల ప్రాశస్త్యాన్ని గురించి వివరంగా చెప్పాడు.

డొమిస్టిక్ ఎంక్వైరీ ఎట్లా జరపాలి. ఏ ప్రొసీజర్ ఫాలో కావాలి...యివన్నీ విశదీకరించిన సుప్రీంకోర్టు జడ్జిమెంట్స్‌ను ఉదహరిస్తూ ‘లా’ పుస్తకాన్ని కోర్టు వారికి అందించాడు.




అట్లాగే ఇంక్రిమెంట్స్, కరువుభత్యం మొదలయినవి యివ్వటానికి గల సూత్రాలను చాంతాడంతసేపు చదివి వినిపించాడు శ్రీధర్.

జడ్జిగారు అన్నింటిని అతి శ్రద్ధగా వింటూ అవసరమయిన చోట్ల గుర్తు పెట్టుకున్నారు.

"చివరికి నేను కోర్టువారిని ప్రార్థించేదేమనగా వరదరాజు విర్దోషిగా పరిగణించాలని, అతవిని ఉద్యోగంనుంచి బర్తరఫ్ చెయ్యటం, అన్యాయము, అక్రమము, చట్టవిరుద్ధము అని తీర్పుయిస్తూ అతనిని ఉద్యోగంలోకి వెంటనే తీసుకుని అతనికి రావలసిన పూర్తి బెనిఫిట్స్ యివ్వవలసిందిగా మేనేజిమెంట్ వారిని ఆదేశించవలసిందిగా సవినయంగా మనవిచేస్తున్నాను.

'ఇదేగాక, కార్మికులు నివేదించిన డిమాండ్స్ సమంజసమైనవేనని, మేనేజిమెంటువారికి వాటిని అంగీకరించగల ఆర్థిక స్థోమత ఉంది గాబట్టి, వాటన్నింటిని మేనేజిమెంట్‌వారు అమలుపరిచేటట్టు ఆదేశం యివ్వవలసిందిగా కోర్టువారిని ప్రార్థిస్తున్నాను.'

శ్రీధర్ నమస్కారం చేసి కుర్చీలో కూర్చున్నాడు.

"మీరెంత టైము తీసుకుంటారు? ..." జడ్జిగారు ఏకాంబరయ్యను ప్రశ్నిస్తే ఎక్కువ టైము తీసుకోనులెండి అన్నాడు నవ్వుతూ.

"నో లెటజ్ కంటిన్యూ ఆఫ్టర్ లంచ్ ...." అంటూ జడ్జిగారు లేచినిలబడ్డారు.

ఆయనతోపాటు అందరూ కూడా లేచారు.

ఆయనగారు లోపలికి వెళ్ళగానే 'కంగ్రాట్యులేషన్స్' అంటూ అంతా ఒక్కసారిగా వచ్చి శ్రీధర్‌ను చుట్టేశారు.

శ్రీధర్ తబ్బిబ్బులయిపోతున్నాడు వాళ్ళందరికీ 'థాంక్స్' చెపుతూ బైట పడ్డాడు.

'వన్ అవర్ తీసుకుంటారా...?' శ్రీధర్ ఏకాంబరయ్యను అడిగాడు తాను త్వరగా యింటికి వెళ్ళాల్సిన అవసరాన్ని గుర్తుకు తెచ్చుకుంటూ.

'మేగ్జిమమ్....' ఏకాంబరయ్య సమాధానం.

తన మనస్సంతా యింటివైపు వుంది.

అందరూ తలొక ప్రశ్నా వేస్తున్నారు యాంత్రికంగా సమాధానాలు చెపుతున్నాడు.

కిశోర్ కబురు పంపించాడని తెలిసింది. కారణం యేమయివుంటుంది. ఆర్గ్యుమెంట్స్ అయినతర్వాత వస్తానని కబురుచేశాగదా, ఇహ కిశోర్‌ని కలుసుకుంటే తప్పేముంది! ఎట్లాగూ యివ్వాళ పిలుపడదు. రేపైనా ఒంటరిగా వెళ్ళేదానికంటె ఒకరిద్దర్ని వెంటతీసుకెళితేనే మంచిది.

ఇట్లా రకరకాలుగా శ్రీధర్ మనస్సు పోతోంది.

అయ్యగారు రొస్తున్నారు అంటూ బంట్రోతు కబురు తెచ్చాడు.

గబగబ కాఫీ తాగేసి కోర్టు హాలులోకి వెళ్లాడు శ్రీధర్.

'సైలెన్స్' అని మళ్ళీ బిగ్గరగా బంట్రోతు అరవటం, జడ్జిగారు వచ్చి కుర్చీలో కూర్చోవటం జరిగిపోయింది.

'యువర్ ఆనర్.... మే... ఇట్....' ఏకాంబరయ్య అక్షరాలు మింగేశాడు.

'ఐ నీడ్ నాట్ రిపీట్ ఎగైన్. మై లెర్నెడ్ ఫ్రెండ్ డెల్ట్‌విధ్ ఎక్స్టెన్సివ్‌లీ....' అంటూ ప్రారంభించాడు.

'ముఖ్యంగా వరదరాజు డిపోజిషన్ కనక చూస్తే ఎన్నోచోట్ల కాన్‌ట్రడిక్షన్స్ కనిపిస్తాయి. ఛీఫ్ ఎగ్జామినేషన్‌లో అసలు యే డిమాండ్‌కూడా మేనేజిమెంట్ వారు ఏక్సెప్ట్ చెయ్యలేదని చెప్పాడు అదే క్రాస్ ఎగ్జామినేషన్లో, ఒక్కొక్క డిమాండ్ అంగీకరించినట్లు అతనే ఎడ్మిట్ చేశాడు యూనియన్ జనరల్ సెక్రటరీ అయినంతమాత్రాన అతనికి అన్ని హక్కులు వచ్చినాయి, క్రమశిక్షణకు భంగంగా ప్రవర్తించొచ్చు అనుకుంటే మాత్రం చాలా పొరపాటు పడినవాడవుతాడు. ఆయన యూనియన్‌లో ఏ హోదాలో ఉంటున్నాడు అనేది

ప్రస్తుత సమస్యకాదు. మేనేజిమెంట్ వారికి సంబంధించినంతవరకు అతను ఒక కార్మికుడు మాత్రమే. క్రమశిక్షణకు, రూల్సు రెగ్యులేషన్స్‌కు లోబడి అతను కూడా ప్రవర్తించాల్సిందే. వాటిని ఉల్లంఘించిననాడు అతనుకూడా డిసిప్లినరీ ఏక్షన్‌కు గురికాక తప్పదు. ఈ విషయం సుప్రీమ్‌కోర్టువారు యెన్నడో చెప్పారు. కోర్టువారికి తెలుసు. నేను ఆ జడ్జిమెంటును అంతా చదివి కోర్టువారి అమూల్యమైన కాలాన్ని వృధా చెయ్యదలుచుకోలేదు.

ఇకపోతే వరదరాజు ఏ ఏ పరిస్థితుల్లో నందగోపాల్ రూములోకి ప్రవేశించాడు? అప్పుడు అక్కడ యెవరెవరున్నారు? అతను ఆ రూములోకి ఎందుకు వచ్చినట్టు? వచ్చి ఏం చేశాడు? ఈ ప్రశ్న లన్నింటికీ సమాధానాలు వరదారాజు యిచ్చిన డిపోజిషన్‌లోనే వున్నాయి.

గలాభా విని రూములోకి వచ్చానని ఒకసారి చెప్పాడు. రూములోకి వెళ్ళిన తర్వాత గలాభా జరుగుతున్నట్టు చూశాను అని మరొకచోట అన్నాడు.

ఆఫీసు స్టాఫ్ ఆ రూములో వుంది. ఎవరెవరున్నారు అని అడిగిన ప్రశ్నకు గుర్తులేదని సమాధానం తేలికగానే యిచ్చాడుగాని అక్కడే యింకా యిద్దరు వున్నట్టు, వాళ్ళను గుర్తుపట్టగలనని, వాళ్ళు కోర్టుహాలులో కూర్చున్నారని యిట్టే చెప్పగలిగాడు. ఈ రెంటికిగల తేడాను, గమనించవలసిందిగా కోర్టువారిని ప్రార్థిస్తున్నాను.

ఎవరో గూండాలు అక్కడ వున్నట్టుగా చెప్పాడు. సాటి కార్మికులను గూండాలుగా చిత్రించగల ధైర్యమూ, చాకచక్యమూ, వరదరాజుకు వున్నాయి సరే బాగానేవుంది.

అయితే ఆ గూండాలు యెందుకు వచ్చారు? ఆ రూములో యేం చేస్తున్నారు? చెప్పటానికి నిరాకరించాడు. నాకు తెలీదని మాట తప్పించాడు.

వీటన్నింటిని బట్టి చూస్తే వరదరాజు నిజంగా బ్లాంకెట్ అబద్ధం చెప్పటంలో కృతకృత్యుడు కాలేకపోయాడు అని స్పష్టమవుతోంది.

వరదరాజు తన ప్లాను ప్రకారం నందగోపాల్ రూములోకి వచ్చి ఆయనను 'ఎస్సాల్ట్' చెయ్యటానికి సిద్ధపడితే చప్పున చౌకీదారు వచ్చి ఆపినట్లు ప్రత్యక్ష సాక్షము వుంది పైగా యీ ఆఫీసుస్టాఫ్ యింటికి వెళ్ళి సాక్ష్యం కనక చెపితే చంపుతామని బెదిరించినట్టు తగిన సాక్ష్యం వుంది. అందువల్లనే ఎకౌంటెంట్ తత్తరపడి, ఆ భయంతో అటూ యిటూ కాకుండా చెప్పాడు.

యూనియన్‌లో ఏ కార్మికుడైనా, ఏ హోదాలో వున్నప్పటికి మేనేజిమెంట్

వారికి ఏమీ ప్రమేయంలేదు వారి అంతరంగిక వ్యవహారాల్లో జోక్యం చేసు కోవటంమేనేజిమెంట్‌వారి పాలసీకాదు యూనియన్‌ని సర్వనాశనం చెయ్యటమే వారి లక్ష్యము అని వేసిన అభియోగాన్ని పూర్తిగా ఖండిస్తున్నాను. యూనియన్ వున్నదీ అనే సత్యాన్ని, యికముందుకూడా వుంటుందీ అనే వాస్తవికతను గుర్తించే యూనియన్‌తో సంప్రదింపులు జరపటం, లోగడ వారితో ఒప్పందాలకు రావటం జరిగింది. ఇలాంటప్పుడు వరదరాజు యూనియన్ ఆఫీసు బేరర్ కాబట్టి ఆయనమీద ఫాల్స్ ఛార్జెస్ పెట్టి ఉద్యోగంలోంచి తొలగించారనటం హాస్యాస్పదం, అబ్సర్డ్ !....

మేనేజింగ్ డైరెక్టర్ని హత్యచెయ్యటానికి ఉద్యుక్తుడయిన కార్మికుణ్ని ఫ్యాక్టరీలో వుంచటం సాధ్యమా ! అతనే కనక ఉద్యోగంలోనే వుంచే ఫ్యాక్టరీ రన్ అవుతుందా ! ఇలాంటి దారుణమైన చర్యకు తగిన శిక్ష విధించకపోతే మేనేజిమెంట్‌వారు తమ కర్తవ్యాన్ని విస్మరించటంకదా ! . ' కాస్త ఊపుగా మాట్లాడి, జడ్జిగారివంక చూస్తూ ఏకాంబరయ్య కొంచెం గొంతుక తగ్గించి, వరదరాజును ఇట్టి పరిస్థితుల్లో ఉద్యోగంలోంచి తొలగించటం సమంజసమని, సమర్థనీయమని మనవిచేసుకుంటున్నాను' అన్నాడు.

'ఇహపోతే డొమిస్టిక్ ఎంక్వైరీ విషయంలో కొన్ని లోపాలు జరిగినాయని, చట్టప్రకారం జరగలేదని శ్రీధర్‌గారు చెప్పారు. ఇప్పుడు వాటిని నేను విపులంగా చెప్పాల్సిన అవసరం యేమీలేదు. అంతా రికార్డులోనే వుంది. ఎంక్వైరీ, తు.చ. తప్పకుండా చట్టప్రకారం స్టాండింగ్ ఆర్డర్స్‌లో రిలెవెంట్ ప్రొవిజన్స్ ప్రకారం జరిగిందని మనవి చేసుకుంటున్నాను.

అందువలన వరదరాజును డిస్మిస్ చెయ్యటం న్యాయసమ్మతమైనదని మేనేజిమెంట్‌వారి చర్య సక్రమమైనదిగా హోల్డ్ చెయ్యవలసిందిగా కోర్టువారిని ప్రార్థిస్తున్నాను.

ఇప్పుడు డిమాండ్స్ విషయము, ప్రాఫిట్ అండ్ లాస్ అకౌంట్, బ్యాలెన్స్ షీట్స్ మూడేళ్ళవి కోర్టులో దాఖలుచేయటం జరిగింది. అవి ఛార్టర్డు ఎకౌంటెంట్ సర్టిఫై చేసినవే. వాటి ప్రకారం కంపెనీకి తగినంత లాభం లేదు. ఒక ఏడాది అయితే నష్టంకూడా వచ్చింది. పేయింగ్ కెపాసిటీ లేనప్పుడు, మేనేజిమెంట్ వారు అదనంగా యే వసతులూ యిచ్చే స్థితిలో లేరని ద్యోతకమవుతోంది. ఈ విషయాన్నే పదే పదే సుప్రీమ్‌కోర్టువారు అనేక కేసుల్లో స్పష్టీకరించారు. వాటికి సంబంధించిన పుస్తకాన్ని కోర్టువారికి నివేదిస్తున్నాను.

ఒక్కమాట! శ్రీధర్‌గారు తమ ఆర్గ్యుమెంటులో చాలా విసురులు విసిరారు. అయితే అవేవీ కూడా కోర్టువారి ముందు వున్న కాగితాల్లో కాని, సాక్ష్యాల్లోగాని కనిపించటంలేదు. అందువలన వాటికి ప్రత్యుత్తరం యివ్వటం అనవసరమని భావిస్తున్నాను. వారు అన్నమాటలు ఊరికే ఊహాగానాలే గాని వాస్తవికతకు సంబంధించినవి కావని మాత్రం మనవిచేస్తున్నాను.

'మిస్టర్ శ్రీధర్! ఎనీ రిప్లయ్....'

'నో సార్....' శ్రీధర్ గభాలున అనేశాడు.

'ఎవార్డ్ రిజర్వ్డ్!....'

అంతా లేచి నిలబడ్డారు.

శ్రీధర్ ఆదరా బాదరాగా యింటికి బయలుదేరాడు. వెంట, నలుగురైదుగురు వచ్చారు. అందులో సుచేతకూడా వుంది.

శ్రీధర్ ఆమెవంక అదోరకంగా చూశాడేగాని యేమీ అనలేకపోయాడు.

అందరూ ముందు గదిలో కూర్చున్నారు.

శేషయ్యగారు, హరిబాబు, పార్వతి ముగ్గురూ ఆటోలోంచి దిగారు.

ఎదురుగా వెళ్ళి కోమలి వారిని ఆహ్వానించింది. వెనకాలే శ్రీధర్ ముభావంగా నిలబడిపోయాడు.

విశాలాక్షి తల వంచుకుని అప్పుడే పెళ్ళికూతురయిపోయింది.

శ్రీధర్ పరిచయం చేశాడు.

టిఫిన్ తీసుకోవటం, కాఫీలు సేవించటం, అయిపోయింది. హరిబాబువంక ఎట్లాగయితే తలెత్తి విశాలాక్షి చూసింది. ఇంట్లో అయితే వచ్చేవాళ్ళకు పోయే వాళ్ళకు జబర్దస్తీగా సమాధానాలు చెప్పే విశాలాక్షి. తనను చూట్టానికి వచ్చే టప్పటికి మరీ సిగ్గులో మునిగిపోయింది. తలెత్తి చూట్టానికే బిడియపడి పోతోంది. ఇంకా నోరు విప్పటం కూడానా, శ్రావ్యంగా పాడగలదు. ఎట్లాగయినా ఓ పాట పాడించాలని చనువుగా సుచేత విశ్వప్రయత్నం చేస్తోంది.

సుచేత అంత చనువు తీసుకోవటం కోమలికి యేమాత్రం యిష్టంలేదు.

తీరా యీమె యెవరు అని అడిగితే యేం చెప్పాలి? మావారి గరల్ ఫ్రెండ్ అని చెప్పాలి అంతేగా. వచ్చిందేదో వచ్చింది. అసలు యిప్పుడు రావటమే అనవసరం. వచ్చింది నోరు మూసుకుని కూర్చుంటే సరిపోదూ, అనుకుంది కోమలి.

విశాలాక్షి కూడా గట్టి పట్టుదలగానే వుంది. పాడనంటే పాడనంటూ కూర్చుంది.

'వీరెవరండీ?....' ఈ ప్రశ్న వెయ్యనే వేసింది వచ్చిన పార్వతమ్మగారు.

శ్రీధర్‌కు గొంతుక అడ్డంపడింది.

సుచేతకు యేం చెప్పాలో చప్పున తట్టకపోయినా, 'మేం ప్రక్కింటివాళ్ళం లెండి' అని సమయస్ఫూర్తిగా చెప్పేసింది.

అమ్మయ్య అనుకున్నారు కోమలి, శ్రీధర్‌లు.

పెళ్ళిచూపులు అయిపోయినయ్.

పెళ్ళికొడుకును అక్కడికి వచ్చిన నలుగురూ మెచ్చుకున్నారు. అమ్మాయిని వంక పెట్టే ప్రశ్నేలేదు. ఎట్లాగయితే యిన్నిసార్లు చూట్టం అయిన తర్వాత, ఒకర్నొకరు మెచ్చుకున్నారు.

ఇక ఇచ్చి పుచ్చుకోవటాల్లో నిమగ్నులయిపోయారు. పిల్ల తరఫున గంగాధరరావుగారు రాయబారం, ముందరే ఆయనకు శ్రీధర్ చెప్పేసి వుంచాడు.

'పెళ్ళి మా తాహతుకు తగ్గట్టుగా చేస్తామని, పెళ్ళికొడుకును గూడా తన శక్తికి తగ్గట్టుగా గౌరవిస్తామని' శ్రీధర్ చాలా అంతరంగికంగా రహస్యంగా గంగాధర రావుకు చెప్పాడు.

'కట్నాలు కానుకలు యివ్వటం, పుచ్చుకోవటం మాకు అలవాటు లేదు అని చెప్పండి. అంతేగాని వరకట్న నిషేద ఉద్యమానికి నేను నాయకత్వం వహించి నట్లు మాత్రం చెప్పాల్సిన పనేమీ లేదు. వాళ్ళకు తెలిస్తే మనం సిగ్గుపడాల్సిం దేమీ లేదు....' అని శ్రీధర్ గంగాధరరావుతో చెప్పాడు

సాధారణంగా పెళ్ళిచూపులు అయిన తర్వాత, నచ్చటాల విషయంలో ఉత్తరాలు రాస్తామనీ కబురు చేస్తామనో చెప్పేసి ఆ పూటే యెక్కడివాళ్ళు అక్కడికి వెళ్ళిపోతారు.

కాని శేషయ్యగారు మనస్సులో మాట దాచుకునే మనిషి కాదు. అందులో హరిబాబుకు మహా తొందర. నచ్చిన పిల్ల దొరికితే చాలు అమాంతం మూడు ముళ్ళూ వేసి, శకుంతల పీడ వదిలించుకుందామని తొందరపడుతున్నాడు.

శకుంతలను తనకు యెట్లాగైనా కట్టబెట్టాలని, ఆ అమ్మాయి తండ్రి, తన మేనమామ అయిన కృష్ణమూర్తిగారు శతవిధాల ప్రయత్నం చేస్తున్నాడు శకుంతలను తన కొడుకుకు చేసుకోవటానికి పార్వతికి యిష్టమే. అందుకనే పెళ్ళి చూపులకని వెళ్ళటం, యేదో వంక చెప్పి ఆ సంబంధం తప్పించటం చేస్తూ వచ్చింది.







ఇంతవరకు నిజానికి హరిబాబుకు నచ్చిన సంబంధం ఒకటీ రానే రాలేదు. ఇప్పుడయితే విశాలాక్షి నచ్చింది. పార్వతికి యేమీ పాలుపోవటంలేదు. ఇహ కట్నం దగ్గర పేచీ పెట్టాలని నిశ్చయం చేసుకుంది

గంగాధరరావు నీళ్ళు నములుతున్నట్లు మాట్లాడుతుంటే పార్వతమ్మగారు జోక్యం చేసుకుని, మావాడికి యెంత కట్నం యిస్తారో చెప్పండి. మా యిష్టం వచ్చిన వస్తువులు మేము కొనుక్కుంటాం' అని బిగ్గరగానే అన్నది.

శ్రీధర్ బిత్తరుపోయాడు.

గంగాధరరావు తికమకపడి బైటకు వచ్చి, శ్రీధర్‌ను పిలిచి చాటుగా తీసుకువెళ్ళాడు.

....ఇదొక పరీక్షా సమయం, పిల్లా పిల్లాడు ఒకరి కొకరు నచ్చారు. వాళ్ళు కూడా డబ్బాపేక్షేమీ చూపించటంలేదు. నువ్విస్తానన్న వస్తువుల ధరలుచూస్తే యెంత లేదన్నా అయిదారువేల రూపాయలు అవుతాయి. వాళ్ళా సామాన్య కుటుంబీకులు. ఆ వస్తువుల బదులు డబ్బే యిస్తే బాగుంటుందని నా సలహా.... గంగాధరరావు విడమర్చి చెప్పాడు.

శ్రీధర్ ఉలిక్కిపడ్డాడు.

'అసలు నేను యీ వస్తువులేవీ యిస్తానని నీతో చెప్పలేదే! అంతగా వాళ్ళు పట్టుపడితే మధ్యవర్తిగా మాకు కావలసినవారుగా భారమంతా నేనే వేసుకుంటానని వాళ్ళకు చెప్పమని అన్నాను. అంతే గాని....'

'నీ పట్టుదల నీదేగాని, యింకోళ్ళ మాట వినవు. ఇదే మూర్ఖత్వం. విశాలాక్షి నీ కూతురు కాదు. నీ చెల్లెలు. అది మరిచి పోవద్దు....' ఇంకా చెప్పబోతుంటే, కోమలి మెల్లగా వచ్చి నిలబడింది.

'నువ్వన్నా చెప్పమ్మా మీ ఆయనకు....'

కోమలి కళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరిగాయి. 'ఈ సంబంధం తప్పిపోతే యిహ విశాలాక్షి పెళ్ళికాదు.' కోమలి గొంతుకలో గీత వచ్చింది.

గంగాధరరావు ఊరడించటానికి ప్రయత్నం చేస్తున్నాడు.

'నన్నేం చెయ్యమంటారు?....'

'ఊరుకో తొందరపడక....'

'ఎన్నైనా చెప్పండి. ఈ రోజుల్లో కట్నం యివ్వందే పెళ్ళి చేసుకోరండి....' నిక్కచ్చిగా అనేసింది కోమలి.

శ్రీధర్ యేమీ మాట్లాడటంలేదు

నాకు మళ్ళీ ఓ సమస్య యెదురయింది దీన్ని పరిష్కారం చెయ్యటం యెట్లా! నేను వూరుకుంటే, వాళ్ళేమైనా చేసుకోనీ, ఈ బాధ్యతంతా గంగాధర రావుకే వదిలేస్తే ఆయనే అన్నీ చూసుకుంటాడు. నా యింట్లో నా స్వంత విషయంలో అమలు చేయలేని విషయాన్ని యితరుల దగ్గరకు వెళ్ళి యెట్లా బోధించటం! ఇంతకంటే ఆత్మవంచన యింకోటేమీ వుండదు. ఏమైనాగాని, నేను కట్నం యివ్వను. విశాలాక్షి పెళ్ళి యెందుకు జరగదో నేనూ చూస్తాను. కట్నం అనే పేరు అంటే నేరం. దానికి శిక్షకూడా వుంటుందని వాళ్ళను హెచ్చరిస్తాను. శ్రీధర్ పరిపరి విధాల ఆలోచించుకుంటూ సతమతమయి పోతున్నాడు.

## 4

తెల్లటి చీరె, ఆకుపచ్చని బోర్డర్, ఆకుపచ్చని జాకెట్టు బోర్డరు తెలుపు. ఇదీ డ్రస్, ఆడవాళ్ళందరూ యీ డ్రస్‌లో లైనులో నిలబడి వుంటే చూసేవాళ్ళ కళ్ళు చెదురుతాయి.

వరసగా షుమారు ఇరవైమంది అట్లాగే నిలబడి వున్నారు. సుచేత డ్రస్ కూడా యిదే. ఆమె వాళ్ళందర్నీ అజమాయిషీ చేస్తోంది.

బాటిల్ సెక్షన్‌లో నిలబడివున్న ఆ మహిళా వర్కర్స్‌కు సుచేత ఆ రోజు పనిని ఎలాట్ చేస్తోంది.

కొంతమందిని బాటిల్ వాషింగ్‌కు పురమాయించింది. మరి కొందర్ని

బాటిల్స్‌ను వరసగా పేర్చటానికి నియమించింది. మరికొందర్ని, శుభ్రపరిచిన ఖాళీ ఇంజక్షన్ బాటిల్స్‌ను ప్రిపరేషన్ రూమ్‌లోకి తీసుకు వెళ్ళటానికి చెప్పింది.

ఇవన్నీ ఆ సెక్షన్‌లో రోజూ జరిగే పనులే. సుచేత పర్సనల్‌గా సూపర్ వైజ్ చేస్తూ తన డ్యూటీని నిర్వర్తిస్తూనే వుంటుంది.

ఆ ఫ్యాక్టరీ వర్కర్స్ యూనియన్‌కు జాయింట్ సెక్రటరీ కూడా.

ఆమెను చూస్తే అందరికీ అభిమానమూ, గౌరవమూ అందరితోనూ చనువుగా మాట్లాడుతుంది. కాని యెవ్వరికీ లొంగదు. ఎవ్వరి మాటా వినదు. తనకు యెంత తోస్తే అంతే ! చాలామంది మొండి పట్టుదల కలది. మూర్ఖురాలు అని ఆమెను నిందించేవాళ్ళు. కాని క్రమక్రమంగా వాళ్ళ అభిప్రాయాలను మార్చుకున్నారు. ఎంతోమంది భంగపడ్డారు కూడా. ఆమెఅంటే అందరికీ ఎనలేని గౌరవం, మర్యాద.

ఈ విషయంలో సుచేత సిస్టర్ ఏం చెపుతుందో కనుక్కొన్నారా అని ఏ చిక్కు ప్రశ్న వచ్చినా ఎలాంటి సమస్య వచ్చినా, నలుగురూ అనటం పరిపాటి అయిపోయింది.

ఫ్యాక్టరీలో ఎనిమిది గంటల డ్యూటీ అయిపోయిన తర్వాత, మిగతా టైమంతా యూనియన్ వ్యవహారాల్లోనే గడిపేస్తూ వుంటుంది.

అనేకసార్లు కన్సీలియేషన్ మీటింగ్స్‌కు వెళ్ళింది. మేనేజిమెంట్ వారిని ఎదుర్కోవటంలో ఎంతో చాకచక్యం చూపిస్తూ వుంటుంది.

సుచేత వెళ్ళితే మన పనులు పూర్తి అవుతాయి అనే భావనకూడా చాలా ప్రబలంగా వుంది.

ఈ కార్యకలాపాల మూలాన శ్రీధర్‌తో పరిచయం ఏర్పడటం జరిగింది. శ్రీధర్ ప్రొద్దస్తమానం, కార్మికుల సమస్యల్లో చిక్కుకునిపోయి సతమతమయి పోతూవుంటాడు. రకరకాల యూనియన్ల ఆఫీసు బేరర్స్, యింకా చెదురు వాటుగా కార్మికులు ఆయన దగ్గరకు నిత్యము వస్తూనే వుంటారు.

ఎప్పుడయితే వరదరాజు కేసు కోర్టుకు రిఫర్ అయిందో అప్పటినుంచి సుచేత, శ్రీధర్ ఆఫీసుకు వెళ్ళటం మహా ఎక్కువయిపోయింది.

ఆమె చొరవ, అవగాహన, తెలివి తేటలు, ఆత్మవిశ్వాసం, శ్రీధర్‌ను పూర్తిగా ఆకట్టేసినాయి సుచేతంటే ఎంతో అభిమానం గౌరవం పెంచు కున్నాడు. ఆమె తన ఆఫీసుకు వచ్చిందంటే ఆమెతో గంటల తరబడి మాట్లాడుతూ వుండేవాడు. గంటలు మాట్లాడటం మొదలుపెట్టేటప్పటికి,

కేవలం యూనియన్ 'ఎఫైర్స్'కే పరిమితం అవటం ఎట్లాగయినా సాధ్యంకాదు. రకరకాల సమస్యలు, రకరకాల విషయాలను గురించి మాట్లాడటం కూడా తప్పనిసరి అయింది.

ఇహ శ్రీధర్ విషయంలో కూడా సుచేతకు అదే అభిప్రాయం. ఆయన ఆదర్శాలు, ఆశయాల కోసం ఆయన చేసే హోరాహోరి పోరాటం, సుచేతను బాగా ఆకట్టేసింది.

శ్రీధర్ యేమి మాట్లాడినా నిక్కచ్చిగానూ, నిర్దుష్టంగానూ విస్పష్టంగానూ మాట్లాడతాడు. డొంకతిరుగుడు మాటలు అతనికి చేతకావు. ఇది కూడా సుచేతకు పెద్ద ఆకర్షణకు కారణమే.

ఎంతోమంది కార్మికులు తమ గోడులను చెప్పుతూ శ్రీధర్‌ను విసిగిస్తూ వుంటే, ఆయన కసురుకోడు, కోపపడడు. అందరికీ నచ్చేటట్టు సమాధానాలు చెప్పి పంపిస్తూ వుంటాడు. ఈ పద్ధతి కూడా సుచేతకు నచ్చిందే.

ఒకర్నొకరు ఆకర్షించుకుంటూ, ఎవరికివారు తమలో తాము సంతోషపడుతూ యిద్దరూ కూడా అనేకసార్లు చర్చల్లోకి దిగారు.

కాని అంతమాత్రంచేత సుచేతను పూర్తిగా శ్రీధర్ అర్థంచేసుకున్నాడని గాని, శ్రీధర్ మనస్సేమిటో సుచేత తెలుసుకుందనిగాని చెప్పటానికి వీల్లేదు.

ఉభయులకు ఒకరిమీద ఒకరికి చెప్పలేనంత గౌరవము ఏర్పడింది దాంతో పాటు ఒక విధంగా ఆత్మీయత కూడా పెంచుకున్నారు.

శ్రీధర్‌ను గురించి యింకో విధంగా ఆలోచించటం గాని, యితరులెవరైనా అతన్ని గురించి తేలికగా మాట్లాడటంకాని సుచేత ఒక్క నిముషం సహించదు.

సుచేత విషయంలో ఎవరైనా పొరపాటు మాట అన్నా, తూలనాడినట్లుగా మాట్లాడినా, శ్రీధర్ ఉద్రిక్తుడయిపోతాడు.

ఇంత అవినాభావ సంబంధం వున్నందునే యీనాడు సుచేత విల విల లాడిపోతోంది.

లేడీ వర్కర్స్‌కు ఏదో చెపుతోందన్న మాటేగాని తన మనస్సంతా మరొక చోట వుంది.

నిజమేనా! తాను శ్రీధర్‌ను గురించి విన్నమాట నిజమేనా! నిజంకాదు.... ఒక్కనాటికి నిజంకాదు. గిట్టనివాళ్ళు లేవదీసిన మాట. అంబయ్యతో మూల్‌చంద్ దగ్గరకు వెళ్ళినంత మాత్రాన శ్రీధర్ యింత దిగజారిపోయాడంటే నమ్మలేకుండా వుంది. అంబయ్య విషయం అందరికీ తెలిసిందే. అయితే అతన్ని

చూసి భయపడిపోతారు. ఎవ్వరూ ఎదురుగా అనలేరు. చాటుగా మాట్లాడాల్సిందే. అంబయ్య పొజిషన్ అలాంటిది. కాని శ్రీధర్, కేవలం అంబయ్య ఆడిన నాటకానికి బలయిపోయే బలహీనుడు కాదు నిజమే। కాని ఎవరైనా ఆయన్ని గురించి చెడుగా అంటే నమ్మిఉండేదాన్ని కాదు. అంజనేయులే చెప్పాడు. అతను 'వెసఫై' చెయ్యందే అక్కడి మాటలు ఇక్కడి మాటలు మోసుకొచ్చే రకం కాదు. కాని ఆయన నిజంగా పొరపాటు పడివుండొచ్చు ఈ ఒక్క అవకాశం మినహాయిస్తే అంజనేయులు చెప్పినదాన్ని నమ్మకపోవటానికి కారణం యేమీ కనిపించలేదు నలుగురు వర్కర్స్‌ని 'డిస్మిస్' చెయ్యటానికి వొప్పుకోవటం డిమాండ్స్‌లో కొన్నింటిని ఉపసంహరించుకోవటం అంబయ్య సాధించిన ఘనకార్యం. దీనికి ఎగ్రిమెంట్ శ్రీధర్ రాయటం చాలా లక్షణంగా వుంది.

అంబయ్య పాతికవేలు తీసుకున్నాడని కొంతమంది అంటారు. మూల్‌చంద్ డబ్బు అంత చిలకనగా యివ్వడు. పాతికవేలు యిచ్చాడంటే యాభైవేల లాభం లేకపోతే యివ్వడని కొందరు అంటుంటారు. ఏది నిజమో ఏమో। అయితే యీ అగ్రిమెంట్‌కు ముందే శ్రీధర్‌కు ముట్టచెప్పార్ట. తర్వాత కూడా యిచ్చార్ట! కేవలం డబ్బు తీసుకుని తన ఆశయాలను వదులుకునేవాడు కాదు శ్రీధర్

అయినా యీ విషయం ఆయన్నే అడిగి తెలుసుకుంటేనే సరిపోతుంది. అట్లా మధనపడటం యెందుకు?

సుచేత తలవూపి ఒక్కసారిగా వొణికింది.

ఏమిటమ్మా అట్టా వులిక్కిపడ్డారు. అందులో ఒకామె సుచేత వాలకం అంతా చూస్తూ అడిగింది.

అబ్బే ఏంలేదే...అంటూ కళ్ళు తుడుచుకుంటూ సుచేత గబగబ టాబ్లెట్ సెక్షన్‌లోకి వెళ్ళింది.

అక్కడ అంజనేయులు పౌడర్ని టేబ్లెట్స్ చేస్తున్నాడు. మిషన్లో పౌడర్ని నింపటం, టక్ టక్‌మని టేబ్లెట్స్ క్రిందపడడం, వాటన్నింటిని పేకింగ్ సెక్షన్‌లోకి పంపటం అతని పని.

సుచేతను చూడగానే అంజనేయులు విస్తుపోయాడు. ఎప్పుడూ కూడా సుచేత డ్యూటీ అవర్స్‌లో యింకో సెక్షన్‌లోకి వెళ్ళదు. ఏమన్నా మాట్లాడాలన్నా, లంచ్‌టైమువరకూ ఆగాల్సిందే. ఎనిమిదిగంటల పనికాలంలో ఒక్క నిముషం కూడా వృధా చెయ్యదు. ఎవరైనా మాట్లాడుతున్నా, ఏ పని చెయ్యక

పోయినా, వారిని మందలిస్తుంది. ఆ ఫ్యాక్టరీలో నూటికినూరుపాళ్ళు క్రమశిక్షణ అమలులో వుందంటే, మేనేజ్‌మెంట్‌వారి ప్రయోజకత్వము కాదు. చట్టాల్లో బిగించిన రూల్స్ కావు. అది కేవలం బాధ్యతాయుతమైన సుచేత తన విద్యుక్త ధర్మాన్ని నెరవేర్చటం, యితరులకు మార్గదర్శకంగా వుండటమే!

ఆంజనేయులుకు ఏమీ తోచలేదు. సుచేత ఎందుకు వచ్చిందో అర్థంకాలేదు. కాని అడగటానికి సాహసించలేదు. నివ్వెరపోయి ఆమెవంక చూశాడు.

'శ్రీధర్‌గారి విషయంలో నువ్వు చెప్పింది నిజమేనా!....' ఎంతో పేలవం గానూ వ్యధతోనూ అడిగింది.

'ఊ....' ముక్తసరిగా అని తలవంచేసుకున్నాడు ఆంజనేయులు.

అప్పటికప్పుడే సుచేత టాబ్లెట్ సెక్షన్‌లోకి ఆఫీసు టైములోనే వెళ్ళింది అని ఫ్యాక్టరీ అంతా తెలిసిపోయింది.

నందగోపాల్ కుమారుడు కిశోర్ ఆ ఫ్యాక్టరీకి జనరల్ మేనేజరు. చాలా మొహమాటస్థుడు. తన రూములోంచి కదలకండానే ఫ్యాక్టరీలో అనుక్షణం జరుగుతున్న విషయాలన్నీ తెలుసుకుంటూ వుంటాడు

అందులో యూనియన్‌వారు ఛార్టర్ ఆఫ్ డిమాండ్స్ యిచ్చినప్పటినుంచి కిశోర్ ప్రతిరోజూ ఫ్యాక్టరీకి రావటం, ఎనిమిదిగంటలు అక్కడే వుండటం అలవాటు చేసుకున్నాడు. అనుక్షణం కిశోర్‌కు వార్తలు అందుతూనే వుంటాయి. వాటినిబట్టి ఏ ఏ చర్యలు తీసుకోవాలో అప్పటికప్పుడే నిర్ణయిస్తూ వుంటాడు.

అందుకనే తటాలున ఒకతను రూములోకి వచ్చి 'అయ్యగారూ....సుచేత గారు టాబ్లెక్ సెక్షన్‌కు వెళ్ళి ఆంజనేయులుగారితో మాట్లాడుతున్నార్ట' అంటూ చెప్పి బయటకు వెళ్ళి నిలబడ్డాడు.

కిశోర్ కుర్చీకి తగిలించిన కోటును భుజాన తగిలించుకుని, కెమెరా తీసు కుని చప్పుడుగాని బూట్లతో గబగబ టాబ్లెట్ సెక్షన్‌దగ్గరకు వెళ్ళి కెమెరాను క్లిక్ మనిపించాడు.

సుచేత యిట్టే వెనక్కు తిరిగింది.

కిశోర్ సూటిగా తన కళ్ళల్లోకి వచ్చి నిలబడ్డాడు. కిశోర్ కూడా చనువుగా సుచేత కళ్ళల్లోకి చూశాడు.

సుచేత ఒళ్ళు ఝల్లుమంది.

ఆంజనేయులు చాలా యిరకాటంలో పడిపోయాడు. అన్ని సెక్షన్లలో వర్కర్స్ వింతగా ఒక్క క్షణం బయటకు వచ్చేశారు.

కిశోర్ వెనక్కి తిరగంగానే అందరూ యిట్టే లోపలికి వెళ్ళిపోయారు.

కిశోర్ అవుతే ఎవ్వరితోనూ ఏమీ మాట్లాడలేదు ఎవ్వరినీ ఏమీ ప్రశ్నించలేదు

తలవంచుకుని సూటిగా తన రూములోకి వెళ్ళి కుర్చీలో కూర్చుని గిర్రున తిరిగాడు.

ఇంతలోకి బెల్ కొట్టేశారు.

అందరూ లంచ్‌కు బయలుదేరారు.

ఆ పెద్ద హాలులో అందరూ బెంచీలముందు కూర్చుని భోజనాలు చేస్తున్నారు.

ఆ కాసేపు యెవరిష్టం వచ్చినట్లు వాళ్ళు మాట్లాడుకుంటున్నారు. తలొక రకంగా అనుకుంటున్నారు. కాని యెవ్వరూ కూడా సుచేత ప్రస్తావనే తీసుకు రాలేదు. అంజనేయుల్ని ఆడిపోసుకుంటున్నారు.

అంజనేయులు వంచిన తలెత్తలేదు. గబగబ తాను తెచ్చుకున్న పదార్థాలను తినేసి చెయ్యి కడుక్కుని తన సెక్షన్‌లోకి వెళ్ళిపోయాడు.

సుచేత హాఫ్ డే లీవ్ పెట్టేసి మధ్యాహ్నమే వెళ్ళిపోయింది.

అంత హఠాత్తుగా వెళ్ళటానికి గల కారణాలు తలొక రకంగా అనుకుంటున్నారు.

కసిగానూ కోపంగానూ బరబరా సూటిగా శ్రీధర్ యింటికి వెళ్ళింది. తలుపు తట్టింది.

గభాలున తలుపులు తెరుచుకున్నాయి.

ఎదురుగా కోమలి నిలబడి వుంది.

ఆమె మొహంలోకి చూస్తూ సుచేత బిత్తరపోయింది. కోమలి మొహం పీక్కుపోయి వుంది. చాలా విషాదంగానూ, విచారంగానూ కనిపిస్తోంది.

సుచేతకు ఏమీ అర్థంకాలేదు.

సుచేతను చూస్తుంటే కోమలికి దుఃఖం ఆగలేదు. బావురుమని ఏడ్చింది.

సుచేతకు చెడ్డ భయమేసింది.

ఏమిటీ అన్నట్టు తల విలువుగా ఊపుతూ అడిగింది సుచేత.

'విశాలాక్షి యింట్లోంచి లేచిపోయింది....' ఇంకా వెక్కి వెక్కి ఏడుస్తూ అంది కోమలి.

'ఆఁ' విస్తుపోయింది సుచేత.

'ఎప్పుడూ!....'

'రాత్రే!....?

'శ్రీధర్‌గా రెక్కడ?... '

'ఎక్కడెక్కడి కెళ్లారో యేమో!....'

'మీరు భయపడకండి .. నేవస్తా....' గాభరాగా యూనియన్ ఆఫీసుకు పరుగెత్తింది.

యూనియన్ ఆఫీసలో పేపర్లన్నీ చింపరవందరగా పడివున్నాయి అక్కడెవ్వరూ లేరు. తలుపులు తీసేవున్నాయేమిటి అనుకుంటూ వెళ్ళబోతూ కూడా మళ్ళీ ఏం బుద్ధి పుట్టిందో యేమొ ఒక్క అంగలో వెళ్ళి లోపల గదిలో తొంగి చూసింది.

గుండె ఝల్లుమంది

శ్రీధర్ కుర్చీలో కూర్చుని రికామీగా, నిరామయంగా పేపరుచదువుతున్నాడు.

ఒక్క క్షణం ఆగిపోయి, మళ్ళీ తమాయించుకుని లోపలికి అడుగు పెట్టింది సుచేత.

అడుగుల చప్పుడు విని వెనక్కు తిరిగాడు శ్రీధర్.

సుచేతను చూసి ఆశ్చర్యపోయాడు. గభాలున లేచి నిలబడ్డాడు.

సుచేత కూడ అట్లాగే నిలబడి యేమీ మాట్లాడలేకపోయింది.

శ్రీధర్‌మీద ఆ క్షణంలో వచ్చిన కోపం యిట్టే తగ్గిపోయింది సానుభూతి చూపించాలని మనస్సు తహతహలాడుతోంది. పరామర్శ చెయ్యాలని నిశ్చయం చేసుకుంది.

కాని తాను ఏవిధంగా పలకరిస్తే బాగుంటుంది! ఏ మాటంటే ఏ రిఫ్లక్షన్ వస్తుందో? అసలు విశాలాక్షి పెళ్ళి తప్పిపోవటానికి కారణం శ్రీధరే! అతను కట్నం యిచ్చే ప్రసక్తి లేదని ఘంటాపథంగా చెప్పబట్టే, పార్వతమ్మకు కోపం వచ్చి వెళ్ళిపోయింది. అలాంటప్పుడు శ్రీధర్‌ని ఏమని పరామర్శించాలి. సుచేతకు యేమీ తోచటంలేదు.

అమాంతం ఒక ఆలోచన తట్టింది.

అసలు విశాలాక్షి యింట్లోంచి వెళ్ళిపోయిన సంగతే తనకు తెలియనట్లుగా ప్రవర్తిస్తే! ఇది బాగానేవుంది అనుకుంది. ప్రస్తుతం అట్లా చేస్తేనే యీ యిరకాటంలోంచి తప్పించుకోవచ్చు.

తనంతట తానుగా శ్రీధర్ విశాలాక్షి విషయం కనక చెపితే అయ్యో పాపం అంటే సరిపోతుంది. అనుకుంటూ యింకో అడుగు ముందుకువేసింది.



శ్రీధర్ కళ్ళల్లో తీక్షణత, గాంభీర్యం, సుచేతను చకితురాల్ని చేసింది. ఆగిపోయింది. అతన్ని చూస్తుంటే, ఆమెకు యేమీ మాట్లాడబుద్ధి పుట్టటం లేదు

'శ్రీధర్ బింకంగానే కుర్చీ చూపించి 'కూర్చోండి' అన్నాడు.

సుచేత సూటిగా వెళ్ళి కుర్చీలో కూర్చుంది. ఇద్దరూ కూడా క్షణకాలంపాటు మాట్లాడలేదు.

శ్రీధర్ తమాయించుకుని, 'ఇవ్వాళ ఫ్యాక్టరీకి వెళ్ళలేదా?' అన్నాడు.

'హాఫ్‌డే శలవుపెట్టా....'

'ఏం....?'

'ఒంట్లో బాగులేదు....'

'ఏంటి?....'

'ఆ! ఏంలేదు, తలకాయ నొప్పిగా వుంది....ఏమిటో డల్‌గా వుంది....'

'నాకూ అట్లాగే వుంది....ఊహిస్తున్నది ఒకటి....జరిగేది ఒకటి....'

సుచేత ఏమీ మాట్లాడలేదు.

'రంజకం లేని చాకిరీ అయిపోయింది. ఎంతచేసినా అసంతృప్తే, అభాండాలే. నీతికి నిజాయితీకి రానురాను స్థానంలేకుండా పోతోంది.అయితే నేను నిరుత్సాహ పడేదేమీలేదు. కాని ఒక్కొక్కప్పుడు ఊహించలేని విషయాల్ని వింటుంటే మతిపోతూ వుంటుంది... '

'అవును ఆ మాట నిజమే! పబ్లిక్ 'లైఫ్'లో యీ నిందలు అపనిందలు తప్పవేమో!....'

'మన జాగ్రత్తలో మనం వుంటే మంచిదేమో?...'

'ఎంత జాగ్రత్తగా వున్నా వచ్చేవి వస్తూనే వుంటాయి. ఎవరి నోళ్ళని కట్టేస్తాం....'

'అసలు యేమీ లేందే పూర్తిగా అబద్ధాలు ప్రచారంలోకి వస్తాయంటే నేను నమ్మను....'

సుచేత గతుక్కుమన్నది.

తాను అడగదలుచుకున్న ప్రశ్నలకు అప్రయత్నంగా శ్రీధర్ సమాధానాలు చెపుతున్నాడని అనుకుంటోంది. కాని ఒక్కొక్క సమాధానం వింటుంటే, తన నిశ్చితాభిప్రాయం చెదిరిపోతోంది.

'ఏమయినాగాని మీతో ఓ మాట అందామనుకుంటున్నాను, మీరేమీ అనుకోరు గదా?'

'....నేను ఏదో అనుకుంటానని మీకే అనుమానం కలిగినప్పుడు మీ మాటకు నేను 'రియాక్ట్' అవటంలో తప్పేం వుంటుంది....'

'ప్రస్తుత పరిస్థితుల్లో కొన్నాళ్ళపాటు మనం కలుసుకోకుండా వుంటే బాగుంటుందేమో!....' చాలా నెమ్మదిగా అన్నాడు శ్రీధర్.

తటాలున తలెత్తి చూసింది సుచేత.

'రూమర్స్‌కు భయపడిపోయా!... '

'మనిద్దరం ధైర్యంగానే వుండొచ్చు. పిరికివాళ్ళ విషయం ఏమిటి?....'

'అవును, మనం యెప్పుడూ బలహీనులను గురించేగా ఆలోచించేది. అందువలన ఆ పిరికివాళ్ళ విషయంకూడా మనమే ఆలోచించాలి....'

శ్రీధర్ యేమీ మాట్లాడలేదు....

'నేను కేవలం రూమర్స్‌కు భయపడి మిమ్మల్ని రావద్దన్నానని మీరు అనుకోనక్కర్లేదు....నా ఆశయాలకు, నా ఆదర్శాలకు అనుగుణంగా నడుచుకునే వ్యక్తులతోనే నేను యెక్కువ చనువుగా వుంటానని మీకు తెలుసు... '

'ఆ కారణంగానే నేను కూడా మీ వైపు మొగ్గుచూపిస్తున్నాననే మాటకూడా మీకు తెలుసనుకుంటాను.'

'అందువలన యిన్నాళ్ళూ ఒకర్నొకరు అర్థంచేసుకున్నామని సంతృప్తి పడ్డాం....కాని....'

'కాని చెప్పండి ఏమిటో....'మన మార్గాలు' దృక్పథాలు వేరుగా వున్నాయని యిప్పుడిప్పుడే తెలుసుకున్నాను....'

'మీ సిద్ధాంతాలను సమయానుకూలంగా మార్చుకుంటున్నారని నాకూడా తెలిసిపోయిందనే మీ ఆరాటం....'

'ఏమిటి మీరంటుంది....'

'డబ్బు అనేది అందరికీ అవసరమే?....'

'అయితే?....'

'ఇంకా నన్ను విడమర్చి చెప్పమంటారా?....'

'పైకో మాట, లోపలో మాట నాకు చేతకాదు....'

'అంటే?....'

'ఇక్కడ మా దగ్గర మాతో వున్నట్టుగా నటిస్తూ, చాటుగా కిశోర్‌ని మీరు కలుసుకోవటంలేదా? బాహాటంగా నందగోపాల్ ముర్దాబాద్, కిశోర్ ముర్దాబాద్ అని కేకలుపెట్టటం, యెవ్వరికీ తెలియకుండా కిశోర్‌ని హోటలు రూములో కలుసుకోవటం, ఇది నేను ఊహించలేనిది....'

సుచేత గజగజలాడింది.

శ్రీధర్‌కు యీ విషయం యెట్లా తెలిసిందీ అని ఆశ్చర్యపోతోంది.

ఆమె మొహంలో వచ్చిన మార్పు యిట్టే కనిపెట్టేశాడు.

తనను అంత సూటిగా ప్రశ్నిస్తాడని ఆమె ఊహించి వుండదు.

మనస్సు చిక్కబట్టుకుని, 'నేను యూనియన్ జాయింట్ సెక్రటరీగా నా విధి నిర్వహణలో యే పొరపాటూ చెయ్యలేదు కార్మికులు, నాయందు వుంచిన విశ్వాసాన్ని యెప్పుడూ కూడా దుర్వినియోగం చేసుకోలేదు....'

'అవును. నేను మీ అంతరంగిక వ్యవహారాల్లో జోక్యం చేసుకోవటం తప్పే కావచ్చు కాని నేను విన్న విషయాన్ని ముఖాముఖిగా మిమ్మల్ని అడిగి తేల్చుకుందామనుకున్నాను అంతే మీ మనస్సు కష్టపెడితే దానికి నన్ను మన్నించండి.. '

'మీరు నన్ను అపార్థం చేసుకుంటున్నారు.... అంతకంటె నేనేమీ యిప్పుడు చెప్పే పరిస్థితుల్లో లేను....'

'నేను యెంతమందికని సమాధానంచెపుతూ కూర్చోను వచ్చినవాళ్ళందరికీ మీరు నిప్పులాంటి మనిషని చెప్పటమేనా నా పని ; అది రుజువుచేసుకోవాల్సిన బాధ్యత మీకు లేదా ? మీరు ఏ ఉద్దేశంతో కిశోర్‌ని కలుసుకుంటున్నారో నాకు తెలుసుకోవాలనే కుతూహలం లేదు. దానివలన యూనియన్ 'మొరేల్', వర్కర్స్ 'కాన్ఫిడెన్స్' బాగా షేక్ అయిపోయిందనిమాత్రం మీకు చెప్పగలను.

'నామీద నమ్మకంలేని క్షణంనుంచి నేను యూనియన్‌లో వుండను..

'ఆ సమస్యకు పరిష్కారం అదికాదు....'

'పరిష్కారం కాకపోవచ్చుగాని, నేను చెయ్యకలిగింది అంతకంటే యేమీ లేదు....'

'చాలారోజులబట్టీ నేను సహనంపట్టి మానసిక క్షోభపడుతున్నాను. మీ విషయమై యెంతో ఓర్పుతో యెన్నో రకాలుగా అందరికీ చెపుతూ వచ్చాను. నా మాట యెవ్వరూ నమ్మటంలేదు. మీరు యూనియన్‌ని 'బిట్రే' చేశారనే భావన చాలామందిలో కలిగింది. అది అబద్ధమని నాకు తెలిసినంతమాత్రాన సరిపోదు....'

'పోనీలెండి మీరు అలాంటి 'ఛార్జెస్'ను నమ్మలేదుగదా ?....'

'ఏం ప్రయోజనం ? మిమ్మల్ని 'సపోర్ట్' చేస్తున్నందుకు నన్నే అనుమానించటంవరకూ వచ్చింది....అందువల్లనే మనం కొన్నాళ్ళపాటు కలుసుకోకుండా వుంటే మంచిదని అన్నాను....'

సుచేత కళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరిగాయి. దుఃఖాన్ని కంట్రోలు చేసుకోలేక పోయింది

'మీ మనస్సు చాలా బాధపడిందనుకుంటాను....' అన్నాడు శ్రీధర్.

'మీరు వేసిన ప్రశ్నలకు నేను సూటిగా సమాధానం చెప్పలేకపోయాను. అందుకనే బాధగావుంది. అంతకంటె యేం లేదు. మీరన్న ముక్కలకు నేనేమీ బాధపడటంలేదు. నేను యే తప్పూ చెయ్యలేదు. ఎవ్వరినీ 'బ్రీఫ్' చెయ్యలేదు. ఇంతకంటె నేనేమీ చెప్పలేను....' బింకంగానే అన్నది.

శ్రీధర్ మౌనంగా వుండిపోయాడు.

తటపటాయించింది సుచేత. మాటకు మాట అంటే సరిపోతుందని మనస్సు ఊగిసలాడిపోతోంది. అంబయ్యా, మీరూ కలిసి ఇండస్ట్రియల్ ఏరియా వర్కర్స్‌కు ద్రోహం చేశారని ఊళ్ళో అనుకుంటున్నారు. మీరేమంటారు అని అడుగుదామనుకుంది. కాని ధైర్యం చాలలేదు.

కాని తన మనస్సులోని మాటను బైటకు చెప్పకుండా వెళ్ళిపోవటం యిష్టం లేదు. తన అహం బాగా దెబ్బతిన్నది.

శ్రీధర్ ముందర ఠీవిగానూ హుందాగాను నిలబడి మాట్లాడగల శక్తీ ధైర్యమూ సన్నగిల్లినాయి మనస్సు ఊగిసలాడిపోతోంది.

కిశోర్‌ను తాను కలుసుకోవటం విషయంలో శ్రీధర్ మనస్సులో చెలరేగిన ఆలోచనా స్వరూపాన్ని రకరకాలుగా ఊహించుకుంటోంది.

ఒక్కొక్క రకపు ఆలోచన వచ్చినప్పుడు మరీ బేజారయిపోతోంది. గుండె చిక్కపట్టుకుని ధైర్యం తెచ్చుకుంటూంది.

ఇంక ఒక్క క్షణం అక్కడ ఉండబుద్ధి పుట్టలేదు. ఇంత విబ్బరంగా శ్రీధర్ మాట్లాడటం, తన చెల్లెలి విషయమై ఒక్కమాటకూడా మాట్లాడకుండా వుండటం సుచేతకు నిజంగా ఆశ్చర్యంగానే వుంది తాను మెదలకుండా వూరుకుంది.

వస్తానంటూ గిర్రున తిరిగి వెళ్ళింది.

## 5

ఆనాడు ఆదివారం.

తాను యిప్పుడు కిశోర్‌ని కలుసుకోవటానికి వెళుతున్నాడు

'లంచ్'కు రమ్మని ఆయన ఆహ్వానించటం శ్రీధర్ సరేననటం జరిగి పోయింది.

ఇప్పుడు తనకు ధైర్యము, విశ్వాసము రెండూ పూర్తిగా వచ్చేసినాయి. కిశోర్‌ను తాను ఒంటరిగా కలుసుకోవటంలో తప్పేమీ లేదు.

'వరదారాజును, ఉద్యోగంలోకి తీసుకోమని, అతనికి, ఉద్యోగంలోంచి బర్తరఫ్ చేసినప్పటినుంచి యీనాటివరకు జీతం యివ్వాలని' అవార్డ్ వచ్చింది.

మిగతా డిమాండ్స్‌కూడా ట్రిబ్యునల్ చాలావరకు అంగీకరిస్తూ శ్రీధర్ వాదనకు జయం చేకూర్చింది.

ఈరోజు సాయంత్రమే శ్రీధర్‌కు ఘనమైన సన్మానం యేర్పాటుచేశారు కూడా....

శ్రీధర్ తెల్లటిపాంట్, తెల్లటి బుష్‌షర్ట్ వేసుకుని, నీటుగా హోటల్ బంజారాకు సరిగ్గా పన్నెండు గంటలకు బయలుదేరాడు.

అక్కడ కిశోర్, శ్రీధర్‌కోసం నిరీక్షస్తూ వుంటాడు.

కిశోర్, నందగోపాల్ కుమారుడు. ఫ్యాక్టరీ జనరల్ మానేజరు. ఇంతవరకు తెలుసు అతన్ని గురించి తలొకరకంగా చెప్పారేగాని, ఫలానా వ్యక్తి అని మాత్రం తాను ఒక అభిప్రాయానికి రాలేదు. తానే స్వయంగా అతన్ని కలుసుకుని అతనితో మాట్లాడాలనే కుతూహలం శ్రీధర్‌కు లేకపోలేదు.

పోర్టికోలో బ్రౌన్ సూట్‌లో కిశోర్ అటూ యిటూ పచార్లు చేస్తున్నాడు.

ఆటోని కొంచెందూరంలోనే ఆపి, శ్రీధర్ నడిచి కిశోర్ దగ్గరకు వచ్చాడు.

'వెల్‌కమ్ టు యూ!....' అన్నాడు కిశోర్ శ్రీధర్‌ను విష్‌చేస్తూ.

శ్రీధర్ 'షేక్‌హేండ్' చేస్తూ మళ్ళీ విష్‌చేశాడు.

'ఫస్ట్ అఫ్ అల్, ఐ హేవ్‌టు కంగ్రాట్యులేట్‌యు....' చాలా హాయిగా నవ్వాడు కిశోర్.

శ్రీధర్ చిరునవ్వుతో థాంక్స్ అన్నాడు.

'మా ఏకాంబరంగారు చెప్పారు. మీరు బాగా ఆర్గ్యూ చేశార్ట? మిస్టర్ వరదరాజు ఈజ్ రీ ఇన్‌స్టేటెడ్. ఐ కాన్ట్ అండర్‌స్టాండ్....' తల అడ్డంగా తిప్పుతూ చాలా గంభీరంగా అన్నాడు కిశోర్.

శ్రీధర్ యేమీ మాట్లాడలేదు....

ఇద్దరూ లిఫ్ట్‌లో పైకి వెళ్ళారు. సూటిగా ఓ రూమ్‌లోకి తీసుకువెళ్లాడు ఇద్దరూ టేబుల్స్‌ముందు కూర్చున్నారు.

కిశోర్ ప్రారంభించాడు.

అతను తెలుగు, ఇంగ్లీషుల్లో మాట్లాడుతున్నాడు. శ్రీధర్‌కూడా అట్లాగే సమాధానం చెపుతున్నాడు.




ట్రిబ్యునల్ అవార్డ్‌ను మేము 'ఆనర్' చేస్తాం. బట్ వరదరాజును తీసుకోవటం, ఇంపాజిబుల్. ఒక్క క్షణం యీ ఫ్యాక్టరీ నడవదు. ఐ టెల్ యు ఇన్ కాన్ఫిడెన్స్!....అతనికి రావలసినదంతా యిచ్చేస్తాం. గ్రాట్యుటీ, బోనస్, వేజెస్, వాట్‌నాట్....అంతా యిచ్చేస్తాం.... మీ యూనియన్‌కు కావాలంటే డబ్బిస్తాం. ఐ మీన్ డొనేషన్, డోన్ట్ మిజండర్‌స్టాండ్ మి .... అయామ్ ఓపెనింగ్ మై మైండ్ ఫ్రాంక్లీ అండ్ వితవుట్ ఎనీ రిజర్వేషన్స్?.... ఇంక పూరీలు తీసుకుంటారా....' కిశోర్ ఉద్రేకంగా, తాఫీగానూ, కోపంగానూ, చిరునవ్వుతోనూ అంటున్నాడు.

'నో....థాంక్స్?....'

ఆల్ రైట్!

వరదరాజు మళ్ళీ ఫ్యాక్టరీకి కనక వస్తే డిసిప్లిన్ అంతా పోతుంది. ఇప్పుడు స్మూద్‌గా నడుస్తున్న ఫ్యాక్టరీ కుంటుపడుతుంది. అతను తన పనిని సక్రమంగా నిర్వర్తిస్తాడనే నమ్మకం యెన్నడో పోయింది. వుయ్ హావ్ కంప్లీట్లీ లాస్ట్ కాన్ఫిడెన్స్ ఇన్ హిమ్. అలాంటప్పుడు అతన్ని పెట్టుకుని నడపటం ఇంపాజిబుల్. కాని అలాంటి స్థితే వస్తే, వుయ్ ప్రిఫర్ టు క్లోజ్ డౌన్ ది ఫ్యాక్టరీ .... ప్లీజ్ డోన్ట్ టేకిట్ ఏజ్ ఎ థ్రెట్ .... ఉన్న ఫాక్ట్ మీ ముందర చెపుతున్నా ...." కిశోర్ తన నిర్ణయాన్ని చెప్పేశాడు.

కిశోర్ బాగా అలసిపోయాడు. ఆవేశాన్నీ ఉద్రేకాన్నీ తమాయించుకుంటూ, చాలా విబ్బరంగానూ పొందాగానూ చెప్పాడు.

ఇందుకా నన్ను రమ్మన్నది అనుకున్నాడు శ్రీధర్.

ఇద్దరూ వచ్చి సోఫాలో కూర్చుని ఐస్‌క్రీమ్ తీసుకుంటున్నారు.

శ్రీధర్‌కు ఏమీ పాలుపోలేదు. ఆ క్షణంలో ఏం మాట్లాడాలో ఏం సమాధానం చెప్పాలో తెలీక తికమకపడ్డాడు. అయినా కాసేపు ఆలోచించి ఏదైనా మాట చెపితే బాగుంటుంది అనుకున్నాడు.

'మాకున్న ప్రాక్టికల్ డిఫికల్టీస్ నేను చెప్తున్నాను. నేను కూడా ఓ ముక్క చెపితేనే మంచిది. మన్మల్ని ఊరికే అడ్డుపెట్టుకోవటమేగాని, మేము చెప్పినట్లు వాళ్ళు వినరు కూడా. అందులో వచ్చిన బెనిఫిట్స్ పోగొట్టుకోమని మేము చెప్పలేము. చెప్పినా వాళ్లు వినరు....' నిక్కచ్చిగా శ్రీధర్ అన్నాడు

'పోనీ మీరు కన్విన్స్ అయ్యారా చెప్పండి....'

'నేను కన్విన్స్ అవటం అవకపోటం వలన ప్రయోజనం లేదనే చెప్తున్నా....మీరు అది గ్రహించుకోవాలి.'

'నిజమే ఆ మాట. కాని నేను చెప్పినదాంట్లో తప్పేమీ లేదని మీలాంటి సహృదయులు కూడా సపోర్ట్ చేస్తే నాకు చాలా ధైర్యం వస్తుంది. ఆత్మ విశ్వాసం పెరుగుతుంది....'

శ్రీధర్ నవ్వి ఊరుకున్నాడు.

'మీ అభిప్రాయాలు యింకెవ్వరిచేతైనా చెప్పిస్తే, అంటే ఎవరిచేతైనా కబురు పంపిస్తే బాగుంటుందనుకుంటాను... ' శ్రీధర్ నీళ్ళు నమిలాడు.

'అది ఎవరో మీరే చెప్పండి... '

'మిస్ సుచేత చేత కబురు పంపిస్తే....'శ్రీధర్ బరువుగా అన్నాడు తడుముకోకుండా.

కిశోర్ వంచిన తల ఎత్తలేదు. అతను అన్న మాటలకు ఆశ్చర్యంగాని విస్మయంగాని కనపరచలేదు.

'ఎట్లాగయినా మీరు చెప్పిన దారి వేరులెండి... ' కిశోర్ మామూలుగానే అన్నాడు.

అయితే కిశోర్ పూర్తిగా దార్లోకి వచ్చేటట్టు కనపడలేదు. కాని శ్రీధర్ ఊరుకోదలుచుకోలేదు.

'మిస్ సుచేతకు మీమీద చాలా గౌరవం వుంది. మీరు చెపితే కాదనదు ....' శ్రీధర్ తడుముకోకండా అనేశాడు.

కిశోర్ తటపటాయించాడు.

శ్రీధర్‌తో తన పర్సనల్ విషయముకూడా చెపితే అతనిని తన అంత రంగికుడుగా భావించాడనే ఫీలింగ్ వస్తుంది. చెప్పటంలో తప్పేముంది. ఇవ్వాళ కాకపోతే రేపైనా అందరికీ తెలిసేదే కదా అని సమాధానపడి కిశోర్ చిరునవ్వు మొహంతో శ్రీధర్‌వైపు చూస్తూ 'ఐ విల్ గివ్ యూ ఏ ప్లెజెంట్ సర్‌ప్రైజ్' అన్నాడు.

శ్రీధర్ హాయిగా సంతోషంగా కిశోర్ మొహంలోకి చూశాడు.

'మే మిద్దరం పెళ్ళిచేసుకోబోతున్నాం....'

'ఆ!...' శ్రీధర్ ఆ మాటలు ఆ క్షణంలో నమ్మలేకపోయాడు.

'యస్... వుయార్ గోయింగ్ టు బి మారీడ్!....' మళ్ళీ అన్నాడు కిశోర్.

'కంగ్రాట్యులేషన్స్! హర్టీ కంగ్రాట్యులేషన్స్!....యూ ఆర్ రియల్లీ ఏ గ్రేట్ మాన్....' శ్రీధర్ ఉద్వేగాన్నీ, సంతోషాన్నీ అదుపులో పెట్టలేక పోయాడు

అతని హృదయం ఆనందంతో నిండిపోయింది. సుచేతమీద తనకు కలిగిన చెడు అభిప్రాయం పటాపంచలయిపోయింది. అమాంతం వున్నవాడు వున్నట్టు వెళ్ళి సుచేతను క్షమాపణ కోరదామనుకున్నాడు.

సుచేత కూడా చాలా గొప్పది. చాలా అదృష్టవంతురాలు....తనలో తాను తబ్బిబ్బులయిపోయాడు.

'మీరు మాలో ఒక ఫామిలీ మెంబర్‌గా ట్రీట్‌చేసి మీతో చెపుతున్నాను. ఇంతవరకు ఈ విషయం అతి రహస్యంగానే వుంచాము. మా యిద్దరికే తప్ప యింకెవరికీ తెలీదు. నాటీవెన్ టు మై ఫాదర్....! గర్వంగా చెపుతున్నాడు.

'థాంక్స్....' శ్రీధర్‌కు మాటలు రాలేదు.

'నేను ఆ అమ్మాయి ఆర్గనైజింగ్ కెపాసిటీ చూశాను.

నిజాయితీ, డిసిప్లైన్ బ్రహ్మాండంగా వుంది. అలాంటి వ్యక్తి కేవలం ఒక ఫ్యాక్టరీలో పాతికమంది లేడీ వర్కర్స్‌ను అజమాయిషీ చేస్తూ తన టాలెంటంతా వేస్ట్‌చెయ్యటం నేను చూస్తూ చూస్తూ సహించలేకపోయాను. అంతస్థుల దృష్టిలో మేమిద్దరం నార్త్‌పోల్ సౌత్‌పోల్. కాని ఆ అమ్మాయి క్వాలిటీస్ నన్ను బాగా ఎట్రాక్ట్ చేసినాయి. మేము బిజినెస్ ఎంతో ఎక్స్‌పాండ్ చేద్దామను

కుంటున్నాం. ఇంకా అనేక ప్రాజెక్ట్స్ వున్నాయి. డబ్బయితే యెక్కడి
నుంచైనా తీసుకురావచ్చు. కాని హ్యూమన్ టాలెంట్ ఇంపాజిబుల్. చాలా
రోజులుగా మధనపడి చివరకు ఓ డెసిషన్‌కు వచ్చేశాను.'

శ్రీధర్ అతి శ్రద్ధగా వింటున్నాడు.

ఆ అమ్మాయిని మిస్ సుచేతను నన్ను కలుసుకోమని నా అంతరంగికుడు ద్వారా కబురు చేశాను. ఆమె రెండోమాట ఆలోచించకుండా వచ్చేసింది. ఆమె ధైర్యం, ఆత్మవిశ్వాసం నన్ను షేక్ చేసినాయి. ఆమె వాలకం, ఆమె ధోరణి చూస్తే నాకే భయమేసింది.

నన్ను రమ్మనమని కబురు చేశారు ఏం పని అని సుచేత నన్ను అడిగి నప్పుడు నేను ఏం సమాధానం చెప్పాలో తెలీక తికమకపడ్డాను కూడా.

కూర్చోండి అని చాలా 'హంబుల్'గా అన్నాను.

మీతో ఫ్యాక్టరీ విషయాలుగాని యూనియన్ విషయాలుగాని మాట్లాడటానికి రమ్మనలేదు. ఇవి కేవలం పర్సనల్ మాటలే. మీరు ఫ్యాక్టరీలో పనిచేస్తున్న తీరు, మీ కెపాసిటీ అన్నీ నన్ను ఆకర్షించినాయి. మీ టాలెంట్‌ను యీ విధంగా వేస్ట్ చేయడం నేను చూడలేక మిమ్మల్ని పిలిపించాను. మీకు అభ్యంతరం లేకపోతే, ఒక మాటంటాను, అని వినయంగానూ నెమ్మదిగానూ, నా మనస్సు విప్పి చెప్పాను.

ఆమె తత్తరపడిపోయింది.

చివాలున లేచి నిలబడింది.

నాకూ ఏం చెయ్యాలో తోచక గభాలున లేచి నిలబడ్డాను. అట్లాగే నిలబడి పోయాము.

'నేను ఆత్మసాక్షిగా అంటున్నాను. మీ ఎక్సెప్షనల్ క్వాలిటీస్ నన్ను ఎట్రాక్ట్ చేసినాయి.....' దాచుకోకుండా చెప్పేశాను.

సుచేత కాళ్ళూ చేతులు వొణికినట్లు, శరీరం కంపించినట్టు నేను చూశాను.

ఆమె పెదవులు తడబడ్డాయి. ఆమె పూర్తిగా సిగ్గులో మునిగిపోయినట్టు గ్రహించాను.

'తర్వాత ఒకటి రెండు సార్లు కలుసుకున్నాం. మేము కలుసుకున్నట్టు ఒక వ్యక్తి చూసి నలుగురికీ చెప్పటం కూడా తెలుసు. అయినా మా కేమీ భయం లేదు. మీతో చీటికిమాటికి సంప్రదింపులకు వస్తూ మిమ్మల్ని కలవటం గిట్టనివాళ్ళు ఏవేవో అనటం కూడా మీకు తెలుసు. మీ ఇంటిగ్రెటీ మీద నాకు

సెంట్ పర్సెంట్ నమ్మకం వుంది. అదే నన్ను బాగా ఎట్రాక్ట్ చేసింది. అందువల్లనే మీతో యింతసేపు మాట్లాడగలిగాను....' కిశోర్ పూర్తిగా అలసిపోయాడు.

శ్రీధర్ ఉద్రిక్తుడయిపోయాడు.

'మీరు నాకొక్క సహాయం చెయ్యాలి ....' శ్రీధర్ ప్రాధేయపడుతున్నట్లుగా అన్నాడు.

'ఎట్లాగూ నా సొంత చెల్లెలి పెళ్ళి చేయలేకపోయాను. సుచేతకు తల్లిదండ్రులు లేరు. నేను యీ పెళ్ళి చేతులారా చేయిస్తాను. నాకీ అవకాశం యివ్వండి.... అదే నా కోరిక.... ఈనాడు నాకు యెంత సంతోషంగా వుందో చెప్పటానికి వీల్లేదు....' శ్రీధర్ హృదయం ఉప్పొంగిపోతోంది.

'నే వస్తా!' అంటూ శలవు తీసుకుని గదిలోంచి బైటకు వచ్చేశాడు శ్రీధర్.

సూటిగా యింటికి వెళ్ళాడు.

'[illegible]లీ' అని పిలిచి మళ్ళీ నాలుక కరుచుకుని యీ ముక్క యిప్పుడే భార్యకు చెప్పకూడదని 'ఏం లేదులే' అనేశాడు.

'ఎందుకు....?'

'అబ్బే ఏం లేదులే....'

'విశాలాక్షి రాసిన ఉత్తరం చదవమంటారా?....'

'కులాసాగా వుందిగదా, అంతే చాలు....'

'మీతో ఓ మాటంటాను కోప్పడరు గదా!....'

'గంగాధరరావుగారు మంచిపనే చేశారు గాని, చెడ్డపనేమి చెయ్యలేదు.... ఏమంటారు....'

'నిజమే....'

'మనసారా అంటున్న మాటేనా!....'

'అవును. మొదట్లో నేను బాధపడిన మాట వాస్తవమే.... కాని విశాలాక్షి యింట్లోంచి లేచిపోయింది అని కబురు తెచ్చినవాళ్ళే, మీ చెల్లెలు లేచిపోలేదండీ గంగాధరరావుగారు, తీసుకెళ్ళి ఆ హరిబాబుతోనే పెళ్ళి చేయించాడు. అటు పార్వతమ్మ మాట నెగ్గింది. ఇక్కడా మీరు కట్నంయిచ్చి చెల్లెలి పెళ్ళి చేశాడనే అపనిందా లేదు అని నన్ను 'కన్సోల్' చేశారు కూడా.'

'అయితే మీరు పూర్తిగా సమాధాన పడ్డారన్నమాట'

శ్రీధర్ యేమీ మాట్లాడలేదు.

ఇంతలోకి వర్కర్స్ ప్రొసెషన్ వస్తున్నట్లు అలజడి వినిపించి అదరా బాదరాగా శ్రీధర్ డ్రెస్ మార్చుకుని ఠీవిగా వాకిట గుమ్మందగ్గర నిలబడ్డాడు.

శ్రీధర్ యింటిదగ్గరకు వచ్చేటప్పటికి శ్రీధర్ జిందాబాద్ అనే నినాదాలు బిగ్గరగా వినిపించటం మొదలుపెట్టినాయి.

ఈ రోజు సాయంత్రమే శ్రీధర్‌ను సన్మానం చేయటం. అన్ని యూనియన్లు కలిసి వేరు వేరు ఊరేగింపులుగా వచ్చి చివరకు స్టేషనుకు ఎదురుగా వున్న బహిరంగ స్థలంలో గుమికూడతారు. అక్కడే ఎత్తుగా వేసిన వేదికమీద శ్రీధర్‌తో పాటు యితర నాయకులు ఆసీనులవుతారు.

అరేంజ్‌మెంట్సన్నీ చురుకుగా సాగుతున్నాయి. తన యింటి వైపునుంచి వెళుతున్న ఊరేగింపులన్నీ సావకాశంగా చూస్తూ అందరికీ నమస్కారం చేస్తూ నిలబడిపోయాడు.

సాయంత్రం అయిదు అవబోతుండగానే, పూలదండలతో అలంకరించిన ఒక జీపు శ్రీధర్ యింటిముందు వచ్చి ఆగింది.

ఆయన, కోమలి పిల్లలు అంతా ఓపెన్ జీపులో యెక్కి కూర్చున్నారు.

బర్రున మీటింగ్ స్థలానికి చేరుకుంది.

కోలాహలంగా వుంది. నినాదాలు మిన్నుముట్టుతున్నాయి. ఈ మధ్య కాలంలో యింత చైతన్యవంతంగా కార్మికవర్గం తమ ఐకమత్యాన్ని ప్రదర్శించ లేదు అని నలుగురూ అంటున్నారు. పార్టీల ప్రమేయం లేకుండా కార్మికులు, వారి వివిధ నాయకులు కూడా యీ బహిరంగ సమావేశానికి వచ్చారు.

శ్రీధరంటే ఆ ఊళ్ళోనేగాక చుట్టుపక్కల కూడా పేరు ప్రతిష్ఠలు తెచ్చుకున్న కార్మిక నాయకుడు. న్యాయవాది. నిజాయితీపరుడు. ఇక సభ ప్రారంభమయింది. అంతే ఉపన్యాసాల దాడి జోరుగా వుంది.

ఆ ఉపన్యాసాల్లో ముఖ్యంగా శ్రీధర్‌ను పొగిడటం ఒక భాగం అయిపోయింది. నిజానికి యీ సభ యేర్పాటుచేసింది ఆయన్ని మెచ్చుకోవటానికేగా!

శ్రీధర్ మాత్రం పూర్తిగా యిరకాటంలో పడిపోయాడు. పరనింద ఆయనకు యెంత అయిష్టమో ఆత్మస్తుతి కూడ అంతే. అందులోనూ యెవరైనా యితరులు పొగుడుతూవుంటే అతనికి రుచించదు. తప్పని సరయింది అన్నీ వింటూ ఓపికగా కూర్చున్నాడు.

ముందు వరసలో, మేనేజిమెంట్ వారి ప్రతినిధులు కొందరు వచ్చి కూర్చు

న్నారు. ఆ వరసలోనే చివర మహిళలు కూర్చున్నారు. వాళ్ళల్లో సుచేత కూడా వుంది. రెండో వరసలో సుచేతకు చాలా దూరంగా మూలగా కిశోర్ తిరుబడిగా కూర్చుని వున్నాడు.

ఇహ వీటన్నింటికి శ్రీధర్ సమాధానం యివ్వాల్సి వుంటుంది.

శ్రీధర్ లేచి నిలబడేటప్పటికి, అయిదు నిమిషాలదాక హర్షధ్వానాలు కొనసాగినాయి. నాకు పొగడ్తలంటే యిష్టంలేదని మీకు తెలుసు. అయినా నన్ను మెచ్చుకున్న వారందరికి కృతజ్ఞతా వందనములు....

....ఏమైనప్పటికి మనం తలపెట్టిన కార్యక్రమాలు పూర్తిగా సాధించటానికి ఎంతో కృషి చేయాల్సి వుంటుంది. వర్గ వైషమ్యాలతో జీర్ణించుకుపోయిన యీ వ్యవస్థను ఛేదించాలంటే నా ఒక్కడి వలన సాధ్యంకాదు. మనందరం కలిసి పనిచేసినా యిది యీనాడు పరిష్కారం అయ్యే సమస్య కాదు. తాత్కాలికంగా కార్మికవర్గానికి ఏవో లాభాలు కొన్ని కనిపించొచ్చు. అంతమాత్రంచేత ఏదో గొప్పగా సాధించామని అనుకోవటం పొరపాటు అవుతుంది. యజమాని - గుమాస్తా, సేట్-కార్మికుడు మోతుబరి - వ్యవసాయకూలీ ఇలాంటి వర్గాలు వున్నంతవరకు యీ సమరం తప్పదు.

ఈ వర్గాలు ఎప్పుడూ వుంటాయి. ఇదికూడా గుర్తుపెట్టుకోవాలి మీరు, అందరూ పల్లకీ యెక్కితే మోసేదెవరని?

కాని యీ వర్గాలమధ్య వ్యత్యాసాలు, భేదాలు సాధ్యమైనంతవరకు తగ్గించటం, ఒకరిమీద ఒకరికి సానుభూతి కలగచేయటం, ఉభయుల్లోనూ అవగాహన పెంపొందించటం, ఒకరినొకరు ఎక్స్ప్లాయిట్ చేయకుండా ఎవరి హక్కులు వారికి వుండేటట్లు చూడటం, పరిశ్రమల్లో శాంతి క్రమశిక్షణ నెలకొల్పుతూ, ఉత్పత్తిని తోడ్పటం యివే మన ధ్యేయాలు.'

సభలో పెద్దగా హర్షధ్వానాలు చెలరేగినాయి. హియర్ హియర్ అంటూ పెద్ద పెద్ద కేకలు వినిపించినాయి.

'....వీటిని సాధించటానికి ప్రతిఒక్కరూ కృషిచేయాల్సి వుంటుంది. కార్మికుడు, యజమాని, సలహాదారుడు, కార్మిక నాయకుడు, లాయరు-వీరందరికి వారివారి విధులు నిర్దుష్టంగా వుండనే వున్నాయి. నేను యిందాక చెప్పిన లక్ష్యాల సాధనకు వీరందరుకూడా అవిరళంగా కృషిచేయాల్సి వుంటుంది— అప్పుడే వాటిని సాధించగలుగుతాం.

మన కృషికి, మన ప్రయత్నానికి మూలస్తంభాలు, నీతినిజాయితీ అవగాహన

ఇవి లేనినాడు మనం ఏంచేసినా నిష్ప్రయోజనం. మనం ఏం సాధించినా అవి తాత్కాలికమే. ఇది అవిరళకృషి. ఒకనాటితో సమాప్తమయ్యేదికాదు. ఒక వ్యక్తి జీవితానికి పరిమితం అయ్యేదికాదు. ఒలెంపిక్ రేసుల్లో అఖండజ్యోతిని ఒకరి తర్వాత ఒకరు తీసుకుని గమ్యస్థానానికి చేరుకున్నట్లు, అట్లానే యీ ఉద్యమాన్ని, ఒకరితర్వాత ఒకరు కొనసాగించాల్సి వుంటుంది.

....మన కాలంలో మనం చేసే పనులన్నీకూడా యితరులకు మార్గదర్శకత్వం కావాలి. ఇదే నా ప్రయత్నం. నా శాయశక్తులా నేను కృషిచేస్తున్నాను. ఈ నా కృషిలో మీ అందరి సహాయ సహకారాల వలన కొంతలాభం చేకూరింది.

'....డిస్మిస్ చేయబడ్డ కార్మికులను ఉద్యోగంలో పెట్టగలిగాం....న్యాయమైన న్యాయమైన కోర్కెలను మనం సాధించగలిగాం....ఇంకా సాధించాల్సింది చాలా వుంది....'

నేను మీ అందరికీ యీ సమయంలో మనవిచేసే దేమిటంటే, కేవలం తన స్వలాభం, తన విషయం చూసుకోవటమే కాకుండా, మొత్తం కార్మికవర్గానికి శ్రేయోదాయకమైనది ఏమిటి అని ఆలోచించి, అలాంటిదాన్ని సాధించటానికి స్వలాభాన్ని కూడా త్యాగం చెయ్యటానికి సిద్ధపడాలని నేను మిమ్మల్నందర్నీ కోరుతున్నాను....' అంటూ శ్రీధర్ తన ఉపన్యాసాన్ని ముగించాడు

కిశోర్ గట్టిగా చప్పట్లు కొట్టాడు. ఆ ధ్వని గభాలున ప్రతిధ్వనించింది. కాని ఒక్కసారిగా చూపులన్నీ కిశోర్‌మీద కేంద్రీకరించబడ్డాయి. కొంతమందికి తెలియలేదు చప్పట్లు కొట్టింది ముందుగా ఎవరో అని. నిజానికి శ్రీధర్ కూడా గమనించనేలేదు.

## 6

రోజులు గడుస్తున్నకొద్దీ సుచేత చాలా డిజప్పాయింట్ అయిపోయింది. ఈ ఉద్యోగం, యీ యూనియన్ ఏక్టివిటీస్‌తో తలబొప్పికట్టిపోయింది

ఎంతచేసినా తృప్తిలేదు. పైగా తలొకమాట అనటం. పలుగురి నోళ్ళల్లోనూ నలగటం, ఆడదాన్ని ఒంటరిగా ధైర్యంగా యిన్నిపనులు చెయ్యకలుగుతున్నాననే సంతృప్తి ఒక్కటే మిగిలిపోయింది. మెచ్చుకునేవాళ్ళు తక్కువ, నొచ్చుకునేవాళ్ళు ఎక్కువ.

అసూయ, అసహనాలు ఆసరా చేసుకున్నచోట సానుభూతి, ప్రశంసలు కుంటుపడతాయి. అయినా ఆత్మవిశ్వాసంతో ముందుకు సాగిపోతోంది. తనకు

పెద్ద అండగావున్న శ్రీధరే తనను యింటికి రావద్దన్నాడు. తనను పూర్తిగా అపార్థం చేసుకున్నాడు.

తోటి కార్మికులు, యూనియన్ నాయకులు, తనను అదోవిధంగా చూస్తూ వుంటారు. తమలో ఒకత్తెగా వాళ్ళు భావించటంలేదు. ఎడమెడంగానే వుంటూ వచ్చారు. ఆడదానితో చనువుగా చొరవగా వుంటే వాళ్ళమీదకేమొచ్చి పడతాయో అని భయం? వాళ్ళ మాటెందుకు, శ్రీధర్ గారికే అలాంటి భయం కలిగినప్పుడు మిగతావాళ్ళ సంగతెందుకు!

మిస్టర్ కిశోర్ హఠాత్తుగా నన్ను రమ్మంటం, నేను వెళ్ళితే నన్ను పెళ్ళి చేసుకుంటాననీ అనటం యినంతా కలా నిజమా అర్థంకావటంలేదు.

నిజమని నమ్మి సరే అన్నాను. అసలు ఆ క్షణంలో నేనేమి మాట్లాడానో నాకే తెలీదు. అనేశాను అంతే? మళ్ళీ కబురులేదు. ఒకటిరెండుసార్లు ఫోనుచేస్తే లేరని సమాధానం వచ్చింది.

నాకు కబురుతెచ్చిన శంకర్ ని అడుగుతే వారు వూళ్ళో లేరమ్మగారూ అని చెప్పాడు. కాని ఆరోజున మిస్టర్ కిశోర్ యీవూళ్ళోనే వున్నట్టు నాకుతెలిసింది. ఇదంతా యేమిటి? దీనికి వెనకాల కుట్ర, మోసం, దగా యేమైనా వుందా? నేను ఆయనదగ్గరకు వెళ్ళినట్టు ప్రచారంచేసి నన్ను అవమానంపాలు చేద్దామనుకుంటు న్నాడా? ఏమిటో అర్థంకాదు.

సుచేత [illegible] తనలో తాను మధనపడుతోంది. ఏమైనాగాని తాను యీ వూరువదిలిపెట్టి యింకోచోటుకు వెళ్ళటమే ఉత్తమమని అనుకుంటోంది.

ఎప్పుడో చిన్నప్పుడే తల్లిదండ్రులు పోయారు. మేనమామల యింట్లో పెరగటం, కాస్త ప్రాయకం వచ్చినప్పటినుంచి, తన చిన్న మేనమామతో పెళ్ళిచెయ్యాలని పట్టుబట్టటం, తనకు యిష్టంలేదని చెప్పి ఒక్క ఒక్క క్షణంకూడా వుండనని ఆ యిల్లు వదిలిపెట్టేసి రావటం, ఎన్ని అడ్డంకులూ ఎన్ని అవరోధాలు వచ్చినా వాటన్నింటిని ఒంటరిగా ఎదుర్కొంటూ యీ లేబరేటరీస్ లో సూపర్ వైజర్ గా ఉద్యోగం సంపాదించటం, ఒక్కొక్కటే గుర్తుకొచ్చి కళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరిగాయి. ఉద్యోగంలో సంతృప్తి లేకపోయినా, తాను వర్కర్స్ యూనియన్ లో ప్రముఖపాత్రవహిస్తూ వుండటమే ఎంతో సంతృప్తిని, సంతోషాన్ని కలుగచేసినాయి. అందువల్లనే అక్కడ యీ నాలుగేళ్ళపాటు వుండకలిగింది.

ఇప్పుడు అలాంటివే లేమీవు.

ఎవ్వరికీ తెలీకుండా ఏదో ఉద్యోగం చూసుకుని ఆ వూరు వదిలిపెట్టి వెళ్ళిపోవాలని, మిస్టర్ కిశోర్ పన్నాగం యేమిటో తెలీదు. ఆ ఉచ్చులోకి రాకముందే యిక్కడినుంచి తప్పించుకోవటం అవసరమని సుచేత రెండు రోజులు తీవ్రంగా ఆలోచించుకుని ఓ నిర్ణయానికి వచ్చింది.

మిస్టర్ కిశోర్ స్టేటస్, అంతస్తు యెక్కడా? నా పొజిషన్ యేమిటి? ఇదేమీ ఆలోచించకుండానే, ఆయన నన్ను పెళ్ళిచేసుకుంటాననంగానే పొంగిపోయాను. ఆశ అట్లా అనిపిస్తుంది గామోసు. తనలో తాను తర్కించుకుంటోంది.

అప్లికేషన్ తను పూర్తి చేస్తోంది.

వి. సుచేత, తండ్రి పేరు కరుణానిధి. వయస్సు 26 ఏళ్ళు, ఎత్తు 5 అడుగుల ఆరంగుళాలు. వెయిట్ 61 కె.జి. క్వాలిఫికేషన్స్ బి.ఏ. ఇక రిఫరెన్స్ కాలమ్ దగ్గరకు వచ్చేటప్పటికి వాకిట తలుపు ఎవరో కొట్టినట్టు చప్పుడయింది.

తలుపు తెరిచేటప్పటికి శ్రీధర్ ఎదురుగా నిలబడివున్నాడు.

సుచేత ఒళ్ళు ఝల్లుమంది.

ఆమె మొహం చూస్తూ శ్రీధర్ యిట్టే గ్రహించాడు. ఆమె మొహంలో తీక్షణత, విషాదం రెండూ మిశ్రమంగా కనిపించాయి.

లోపలికి రమ్మన్నట్టు సుచేత కొంచెం ప్రక్కకి వెళ్ళింది. శ్రీధర్ బిగువుగా లోపలికివచ్చి కుర్చీలో కూర్చున్నాడు.

వీధితలుపు కర్టెన్ దానంతటదే అడ్డం వచ్చేసింది

'సుచేతా నన్ను క్షమించు. నేను చాలా పొరపాటు పడ్డాను....' అన్నాడు శ్రీధర్.

సుచేత మొహం తిప్పింది. కాని ఎందుకంటున్నాడో అర్థంకాలేదు.

'నువ్వు చాలా అదృష్టవంతురాలివి. హార్టీ కంగ్రాట్యులేషన్స్....' అన్నాడు.

సుచేత కుర్చీలో కుదించుకుపోయింది. నోట మాటరాలేదు.

అతని మొహంలోకి విడ్డూరంగా చూస్తోంది.

'నేను మిస్టర్ కిశోర్‌ని కలుసుకున్నాను. నాకు అంతా చెప్పేశాడు. ఆ క్షణంలో నేను యెంత ఆనందపడ్డానో చెప్పటం నా తరంకాదు....నీకంటెకూడా నేను అదృష్టవంతుడ్ని. నా చెల్లెలు పెళ్ళి నేను చెయ్యలేకపోయాను. సుచేత పెళ్ళి నా చేతులారా నేను జరిపిస్తాను, దానికి కన్‌సెంట్ యివ్వమని అడిగాను. దానికి ఆయన ఏక్సెప్ట్ చేశాడు....'



సుచేతకు ఆ మాటలు వింటుంటే కళ్ళవెంబడి నీళ్ళు బొటబొట కారినయి. పెదిమలు గజగజ వణికినయి.

ఆమె ఉద్వేగాన్నీ ఆవేశాన్నీ అణచుకోలేకపోయింది.

'....మీ పెళ్ళివిషయం నాకు తప్ప యింకెవ్వరికీ తెలీదు. తెలియనీయకూడదని కూడా మిస్టర్ కిశోర్ అభిప్రాయం. నందగోపాల్‌గారు పై వన్‌డే అమెరికా వెళుతున్నారు. ఆయనకు యీ పెళ్ళి నచ్చదు. ఆయన పద్ధతీ ఆలోచనా వేరు. అయితే మిస్టర్ కిశోర్ తనిష్టంవచ్చినట్టు నడుచుకోవటానికి పూర్తి అధికారాలు యెప్పుడో యిచ్చాడు. నందగోపాల్‌గారు అమెరికా వెళ్ళినతర్వాతే

తన పెళ్ళి జరగాలని, చివరిక్షణం వరకు దీని విషయం యెవ్వరికీ తెలియ కూడదని అయన మరీ మరీ చెప్పాడు. దానికి నేను అన్ని ఏర్పాట్లు చేస్తున్నాను. ఈ నెల 14వ తేదీ ముహూర్తంకూడా నిర్ణయించారు. ఈ మధ్య ఒకటిరెండు సార్లు నువ్వు ఫోన్‌కూడా చేశావట. రెస్పాన్స్ లేదని ఏమీ అనుకోవద్దని, యీ విషయాలన్నీ నీతో చెప్పమని నాతో అంతరంగికంగా చెప్పాడు....' ఊపిరి సలపకుండా గబగబ చెప్పేశాడు.

చప్పున కుర్చీలోంచి లేచి శ్రీధర్ పాదాలమీద తన రెండుచేతులు పెట్టింది సుచేత.

శ్రీధర్ కంఠంలో గీర వచ్చింది.

'అమ్మాయి సుచేతా....లే అమ్మా....' అంటూ లేవదీశాడు.

సుచేత నోట మాట లేదు.

కళ్ళకు పెట్టుకున్న కాటుకంతా మొహం మీదికి పాకిపోయింది. బుగ్గలు ఎర్రబారినాయి. కళ్ళు పెద్దవయినాయి. హృదయం అంతా సంతోషంతో నిండి పోయింది. మాటా పలుకూ లేకుండా కాఫి తెచ్చి ఇచ్చింది. శ్రీధర్ తీసుకున్నాడు.

'ఇంకా యెక్కువ సేపు యిక్కడ నేను వుండకూడదు. ఎప్పటికప్పుడు డెవలెప్‌మెంట్స్ నీకు చెపుతూ వుంటాను. 14 వ తారీఖు మార్చ్ అని శలవు చీటీ జనరల్ మేనేజర్‌గారికి యిస్తావు కదూ....' అంటూ వెళ్ళిపోయాడు.

ఇంటికెళ్ళగానే ఎదురుగా కోమలి వచ్చి నిలబడింది. చాలా సంతోషంగానూ ఉత్సాహంగానూ వుంది.

అంతకంటె హుషారుగానూ ఆనందంగానూ కనిపిస్తున్నాడు శ్రీధర్.

ఒకర్నొకరు చూస్తూ ఏమిటివ్వాళ యింత సంతోషంగా కనిపిస్తున్నారు... ఏదో కారణం వుండితీరాలి అనుకుంటున్నారు.

ఏమిటి విశేషం అని అడగబోతుండగానే .. 'ఏమిటండీ మీరు యివ్వాళ యింత సంతోషంగా' వున్నారు అన్నది కోమలి.

'నే చెపుతాగాని నువ్వింత ఉత్సాహంగా వున్నావు....దానికి కారణం ఏమిటో చెప్పు....' అన్నాడు.

'దానికి కారణం వుందిలెండి. మీరు చెప్పండి ముందర....' అని రెట్టించింది.

'చెపుతా విను. సుచేత నందగోపాల్‌గారి కొడుకు కిశోర్‌ని పెళ్ళిచేసుకో బోతోంది....' పట్టలేని సంతోషంతో అన్నాడు.

'నిజంగానా ?....'

'నిజంగానే.... ఈ 14వ తారీఖే పెళ్ళి. ఇంతవరకు యెవ్వరికీ తెలీదు. అతి రహస్యంగా వుంచాలి. నువ్వుకూడా యెవ్వరికీ చెప్పొద్దు....'

'ఆశ్చర్యంగా వుందే, ఆయన్నెట్లా పట్టింది ?....'

'ఆయన్ను పట్టటమేమిటి ? ఆయనే అడిగాడు సుచేతను. సుచేత....సరే అంది.'

'చాలా అదృష్టవంతురాలు. ఎంత గొప్పసంబంధం....అసలు ఇదెవ్వరూ వూహించివుండరు. నాకు యిది నిజమేనా అనిపిస్తోంది....'

'అవునుగాని నువ్వుకూడా ఏదో విశేషం చెపుతా నన్నావుగా....'

'విశాలాక్షి, గంగాధరరావుగారు ఆ గదిలో వున్నారు....'

'ఆ...విశాలాక్షి వచ్చిందా ?....'

'అసలు మిమ్మల్ని తలుచుకుంటుంటే భయమేస్తోందంటోంది. మీరేమంటారో నని హడలిపోతోంది...'

'అట్లాగా...' అంటూ గభాలున గదిలోకి వెళ్ళాడు.

'విశాలాక్షి నిలబడి ప్రక్కకు తిరిగి పమిటకొంగు నోటికి అడ్డం పెట్టుకుంది.

'అమ్మాయి...' అంటూ ఎంతో ప్రేమగానూ ఆప్యాయంగానూ పిలిచి తల నిమురుతూ దగ్గరకు వెళ్ళాడు.

బావురుమని ఏడుస్తూ 'అన్నయ్యా' అంటూ శ్రీధర్ పాదాలకు నమస్కారం చేసింది విశాలాక్షి.

'నేను నిన్ను ఏమంటానమ్మా. నేను చేయలేనిది నువ్వు చేశావు. పీటలమీద కూర్చుని కన్యాదానం చేసే అదృష్టం నాకు లేదు...' చెల్లెల్ని దగ్గరకు తీసుకున్నాడు.

'గంగాధరరావుగారూ! మీరు నన్ను క్షమించాలి...' శ్రీధర్ ఆయన రెండు చేతులు పట్టుకున్నాడు.

'ఆ ముక్క నేననాలి...మీ చెల్లెన్ని...గంగాధరరావు ఏదో అనబోతుంటే.

'మీరు పెద్దవారు మీరు అట్లా అనకూడదు. మీరు చేసింది మంచిపనేకాని చెడుదేంకాదు. ఆనాటి రాత్రిమాత్రం చాలా ఆందోళన పడ్డాను. విశాలాక్షి యింతసాహసం చేస్తుందంటే నమ్మలేకపోయాను. ఆ ఒక్కరాత్రే తర్వాత నిజం తెలిసినతర్వాత, నేను చాలా సంతోషించాను. మనస్సులో మీకు ఎన్నో సార్లు కృతజ్ఞతలు చెప్పాను. హరిబాబు రాలేదా ?...'

'ఈ సాయంత్రమే వస్తాడు..ఇంతకీ ఆ పార్వతమ్మగారి మొండిపట్టుదల యింతవరకు తెచ్చిపెట్టింది. తన అన్నకూతుర్ని చేసుకోవాలని, వచ్చిన సంబంధాలను ఏదో నెపంతో చెడకొడుతోందట. ఏమైనాగాని హరిబాబు తెగించక పోతే నేను ఒక్కడ్ని ఏమీచేసేవాన్నిగాదు. పాపం అమాయకురాలు విశాలాక్షి నేను చెప్పినట్టల్లా నడుచుకుంది. చివరికి కొండమీదకు వెళ్ళి పెళ్ళిచేసుకు వచ్చారు...' గంగాధరరావు జరిగినదంతా టూకీగా చెప్పాడు.

'అమ్మాయ్ ఏడవకు కళ్ళు తుడుచుకో. అదుగో వదిన పిలుస్తోంది ఎందుకో వెళ్ళు...'

అనాడల్లా శ్రీధర్‌కుఒళ్లూపై తెలియటంలేదు.తన్మయత్వంలోమునిగిపోయాడు.

చెల్లెలూ, బావమరిదీ యింటికి వచ్చారు. ఓ మూల తాను పీటల మీద కూర్చుని సుచేత వివాహం జరిపించబోతున్నాడు. ఈ రెండూకూడా అయన్ను ఉక్కిరి బిక్కిరి చేసేసినాయి.

తబ్బిబ్బులాడిపోతున్నాడు. ఏ పనీ చెయ్యబుద్ధి పుట్టటంలేదు. ఎవరితోనూ కేసులవిషయాలు మాట్లాడబుద్ధిపుట్టటంలేదు.

వచ్చినవాళ్ళకు యేదోరకంగా సమాధానంచెప్పి పంపించేస్తున్నారు.

'ఇవ్వాళ ఆయన చెల్లెలు, బావమరిది వచ్చారు. నీకు తెలుసుగా చెల్లెలు చెప్పకండా, యింట్లోంచి వెళ్ళిపోయి పెళ్ళిచేసుకు వచ్చిందట....'

'అసలు విషయం అదికాదు. గంగాధరరావుగారు వేసిన ప్లానుట. ఆయనే శ్రీధర్‌గారికి తెలీకుండా యీ పెళ్ళి గుట్టుచప్పుడుకాకుండా జరిపించారట. ఆ పెళ్ళికొడుకు తల్లి కట్నం యిస్తేగాని వీల్లేదు అని పట్టుపట్టిందట. ఆమె గారి కొడుకు తల్లిని కాదని, చాటుగా పెళ్ళిచేసుకున్నాడట!.... నన్ను కూడా రేపే రమ్మన్నారు.

'అసలు యివ్వాళ ఆయనను పలకరించేటట్టుందా?....చెల్లెలు, బావమరిది యింటికొచ్చారనే సంబరంలోనే వున్నాడు.

ఆ రోజు అట్లా గడిచిపోయింది.

మర్నాడు ఉదయమే వరదరాజు, ఆంజనేయులు, అశోక్ యింకా ఇద్దరు కలిసి వచ్చేశారు.

ఇంకా శ్రీధర్ తన రూమ్‌లోకి రానేలేదు. వీళ్ళు వచ్చి ముందు కూర్చు న్నారు.

'మీ సిస్టర్ వచ్చిందటగా!....'




'అవునయ్యా, యిద్దరూ వచ్చారు. ఒక ప్రాబ్లమ్ సాల్వ్ అయింది.'తృప్తిగా నవ్వాడు శ్రీధర్.

అంతకుమించి దాన్ని గురించి యెవ్వరూ ప్రస్తావించలేదు.

'మన నోటీసుకు యేమన్నా సమాధానం వచ్చిందా?....'

'ఇంకా రాలేదండి. వన్ వీక్ అయిపోయిందిగా....' ఆంజనేయులు అందుకున్నాడు

"మేనేజింగ్ డైరెక్టరు రేపు ఆదివారం అమెరికా వెళుతున్నాట్టగా...." తెలిసీ తెలియనట్టుగా అన్నాడు శ్రీధర్.

"అవును నేనూ విన్నాను" అన్నాడు అశోక్.

"ఇది అందరికీ తెలిసిన విషయమే; అయినా దానికీ దీనికీ సంబంధం యేమిటి; ఫ్యాక్టరీ నడవటం లేదా; మిగతా పనులు కావటంలేదా నా నోటీసుకు సమాధానం ఇచ్చే టైము లేదా;...." వరదరాజు తన ఆరాటాన్ని తెలియపర్చాడు.

"అవును...."

"వాళ్ళు సమాధానం యివ్వకపోతే మనం ఏం చెయ్యాలండి....?" సూటిగా ప్రశ్నించాడు వరదరాజు.

"ఇంప్లిమెంటేషన్...అంతే;...."

"అదేదో మీరు త్వరగా చేసెయ్యండి....అవార్డ్ పబ్లిష్ అయిన నెలరోజుల్నుంచి అమలులోకి వస్తుందన్నారుగా....ఇహ వాళ్ళ సమాధానంకోసం ఎదురు చూడక్కర్లేదు"....వరదరాజు తన నిర్ణయాన్ని చెప్పేసాడు.

"దానికి ఖర్చులు వగైరాలకు యిది ఉంచండి...." అంటూ రెండు వంద రూపాయలనోట్లు కూడా శ్రీధర్‌కు అందించాడు.

శ్రీధర్ యేమీ మాట్లాడలేకపోయాడు.

"బోనస్ 20% యివ్వలేదుగదా మరి దానికేం చెయ్యాలి. గ్రేడ్స్ ఇంక్రిమెంట్స్ కూడా ట్రిబ్యునల్ సరిగా యివ్వలేదు....ఏంచేద్దామంటారు, అన్నాడు యింకో వ్యక్తి.

"అయితే ఓసారి మనం యూనియన్ జనరల్‌బాడీ మీటింగ్ పిలుద్దాం. వారికి యివన్నీ చెప్పి ముందు కార్యక్రమం యేమిటో నిర్ణయించుకుందాం.... ఇది నీ దగ్గరుంచు ప్రస్తుతం...." అంటూ శ్రీధర్ తిరిగి వరదరాజుకు డబ్బివ్వబోయాడు.

"నా కేసుకు డిమాండ్స్‌కు యేమీ సంబంధం లేదండీ. ఇది నాకు సంబంధించినది. మీరు ఆ ఇంప్లిమెంటేషన్ యేమిటో చేసెయ్యండి....వరదరాజును మళ్ళీ ఫ్యాక్టరీలోకి అడుగు పెట్టనీమని, ట్రిబ్యునల్ అవార్డ్ యివ్వంగానే సరిపోయిందా, హైకోర్టుకు వెళతామని అంటున్నారట.

'వాళ్ళు హైకోర్టుకువెళితే మనం సుప్రీంకోర్టుకు వెళదాం.ఎంతడబ్బు ఖర్చైనా సరే యిది వదలకూడదండీ. ఇది నా ప్రిస్టేజి క్వశ్చెన్. నా ప్రిస్టేజే కాదు ఆ మాటకొస్తే, యూనియన్‌దీ మీదీ కూడాను'....చాలా ఆవేశంగా అనేసి వస్తాను శలవు అంటూ వాకిట్లోకి నడిచాడు వరదరాజు.

అతనివెంట వచ్చినవాళ్ళు కూడా మారుమాటాడకుండా వరదరాజును అనుసరించారు.

శ్రీధర్‌కు ఏమీ తోచటంలేదు. చాలా ఇరకాటంలో పడిపోయాడు. ఎలాంటి నిర్ణయం తీసుకుంటే ఎలాంటి పరిణామాలు వస్తాయో అర్థంకావటంలేదు. కాని ఏదో ఒక నిర్ణయం తీసుకోవలసిన సమయం వస్తోందని మాత్రం గుర్తించాడు. ఈ నిర్ణయంవలన తన భవిష్యత్తులో అనుకోని మార్పులు రావచ్చు. తన జీవితంలో యిదొక మలుపు. దీనికి ధైర్యం, గుండె నిబ్బరం, ఆత్మవిశ్వాసం కావాలి ఇవన్నీ శ్రీధర్‌కు పుష్కలంగానే వున్నాయి.

కాని ఎంతమంది నా నిర్ణయాన్ని హర్షించగలుగుతారు! ఎంతమంది సమయానికి అదుకుని, అండగా నిలవగలుగుతారు? ఈ ప్రశ్నకు తృప్తికరమైన సమాధానం దొరకటంలేదు. అందుకనే సతమతమయిపోతున్నాడు.

ఎన్నడూ కోమలితో యీ విషయాలు చెప్పలేదు. అయినా చాటుగా మాటుగా వింటూ అన్నీ తెలుసుకుంటూ వుంటుంది. ఆకళింపు యెక్కువ. యావ, విషయాలు తెలుసుకోవాలనే కుతూహలం, కోమలికి చాలా యెక్కువ.

ఇప్పుడు ఎదురవుతున్న సమస్య యే యితరులతోనూ చర్చించతగిందికాదు, అందువలన కోమలితో అన్నీ వివరంగా చెప్పి, ఎట్లా చేస్తే బాగుంటుందో తోచటంలేదు అని తన నిస్సహాయతను వెళ్ళబుచ్చాడు

ఆమెకు ఏమీ పాలుపోవటంలేదు.

ఆమె మనస్సు పరిపరివిధాల పోతోంది

ఇంట్లో సమస్య సమసిపోయింది గదా అనుకుంటే, బయటి సమస్య మహా ప్రళయంగా కనిపిస్తోంది.

తీరా సుచేత పెళ్ళినాడు ఏం రభస అవుతుందో! వరదరాజుకు అసలే రౌడీ అని పేరు. అతని మాట కాదంటే, అతనేం చేస్తాడో! ఎంత నిజాయితీగా మాట్లాడినా, చివరకు ఏదైనా అయితే తన భర్తను నిందిస్తారు. అసలు విషయం తెలుసుకోవటానికి ప్రయత్నించరు. ఏం చెయ్యాలి అని కోమలి కూడా మధనపడుతోంది.

ఇంటిదగ్గర యిచ్చిన టైముకు వుండకుండానూ, లేబర్ ఆఫీసుకు వెళ్ళి వెళ్ళకుండాను, కోర్టుకు వెళ్లటం అసలే మానేసి, చాలా చిరాకుగాను, విసుగ్గాను గడుపుతున్నాడు రోజు రోజుకు శ్రీధర్.

మేనేజింగ్ డైరెక్టరు నందగోపాల్ విమానంలో యెక్కినప్పటినుంచి, శ్రీధర్ కి బరువుతో కూడిన బాధ్యత బండరాయిలాగ నెత్తిమీద కూర్చుంది.

మొదట్లో సుచేత పెళ్ళి విషయం వినగానే, తనకు కలిగిన ఉత్సాహం, సంతోషం అన్నీ మటుమాయమయిపోయినయ్.

నిరుత్సాహం నిస్పృహ, ఆవేదన, ఆందోళన యివే మిగిలిపోయినాయి.

చివరిదాకా ఎవ్వరికీ చెప్పకుండా, ఈ పెళ్ళి తాను జరిపితే తనమీద ఎలాంటి అభాండాలు వస్తాయో యిపుడు ఊహించలేకుండా వున్నాడు.

ఇలాంటి ముఖ్యవిషయం తన ఆంతరంగికులతో కూడా చెప్పకుండా జరిపించా డంటే, తనకు ఆంతరంగికులంటూ యెవ్వరూ లేకుండాపోతారు. చివరకు మిస్టర్ కిశోర్ తనకు కాన్ఫిడెంట్ అవుతాడు. ఈ విషయం యెవరికైనా తెలిస్తే, నన్ను యింక నమ్ముతారా!

నిజం చెప్పి యెవరైనా నమ్మించగలనా ! అందుకని అబద్ధం ఆడటమా ! అబ్సర్డ్ ! కాని మిస్టర్ కిశోర్ ప్రమాణం చేసి మరీ చెప్పాడు. చివ్వరి గడియ వరకు యీ పెళ్ళి విషయం యెవ్వరికీ తెలియకూడదని. దానికి తాను పూర్తిగా అంగీకరించి మాట యిచ్చాడు. ఇప్పుడు దాన్ని తప్పించుకోవటం ఎట్లా ! తాను పెళ్ళిపీటలమీద కూర్చోపోతే ! అదెట్లా సాధ్యం ! తాను కన్యాదానం చెయ్యటానికి అనుమతివ్వమని కోరినప్పుడు ఆయన వెనకా ముందూ ఆలోచించకుండా సరే అన్నాడు. ఈ విషయమే సుచేతకూడా చెప్పాను. ఇప్పుడు వెనక్కి పోవటం యెట్లా !

అంతా అయోమయంగా వుంది.

కాని పధ్నాలుగో తారీఖు మీదకొచ్చి పడతానని బెదిరిస్తోంది. కాలగమనం పదకొండో తారీఖును గూడా వెనక్కి నెట్టేసింది.

పన్నెండవ తారీఖు సాయంత్రం అయిదు గంటలకు జనరల్ బాడీ మీటింగ్ యేర్పాటయింది. యూనియన్ వైస్ ప్రెసిడెంట్ గిరిధర్ సమావేశానికి అధ్యక్షత వహించాడు. యూనియన్ మెంబర్లు దాదాపు అందరూ వచ్చేశారు. ఇద్దరు వూళ్ళోలేక, ఇద్దరు వంట్లో బాగలేక రాలేదు. సుస్తీకారణంగా రాని వాళ్ళిద్దర్లో సుచేత ఒక మెంబరు.

ఎట్లాగయినా ఆమెగారు రావాలి. యిది చాలా ముఖ్యమైన మీటింగ్ అని ఆమె యింటికి వెళ్ళివచ్చారు. తల మీద పట్టీవేసుకుని పడుకునివున్న సుచేతను చూసి, నిజంగా వళ్ళు బాగులేదని తిరిగి వచ్చేశారు.

నిర్మొహమాటంగా యిష్టంవచ్చినట్టు నలుగురూ ఆ అవార్డ్‌ను గురించి చర్చించారు.

డిమాండ్స్ విషయంలో ట్రిబ్యునల్ వారు యిచ్చిన తీర్పు పూర్తిగా అసంతృప్తిగా వున్నదని, కేవలం దొంగ అకౌంట్స్ ఆధారంగా, మేనేజ్‌మెంట్ వారికి ఆర్థిక స్తోమతలేదు కాబట్టి, ఏడాదికి అయిదు రూపాయల ఇంక్రిమెంట్ ఇవ్వటం అక్రమం, అన్యాయమని అందరూ అభిప్రాయాన్ని వెలుబుచ్చారు.

వరదరాజును ఉద్యోగంలోకి తీసుకుని పూర్తి జీతం యివ్వాల్సిందే. దీని విషయంలో మనం యెంతవరకైనా సరే వెళ్ళి తీరాలని ఏకగ్రీవంగా ముక్త కంఠంతో అందరూ తమ అభిప్రాయాల్ని తెలియజేశారు.

ఇహ మీ అభిప్రాయం యేమిటి అని శ్రీధర్‌ను ప్రశ్నించినప్పుడు, 'వ్యక్తి




గత అభిప్రాయంతో ప్రమేయం యేమీ లేదు. మీరంతా చెప్పిన ప్రకారమే చేద్దాం.' అన్నాడు ముక్తసరిగా.

'అట్లాకాదు. మాకు లీగల్ కాంప్లికేషన్స్ తెలియవు. ఈ పరిస్థితుల్లో మీ అభిప్రాయం యేమిటో మాకు చెప్పండి మాది తప్పవుతే మార్చుకుంటాం. మీరు మాకు సలహాదారులు. పెద్దవారు. అన్నీ తెలిసినవారు మమ్మల్ని సరియైన మార్గంలో నడిపించాల్సిన బాధ్యత మీమీద వుంది ' అని అందులో ఒకతను లేచి నొక్కి నొక్కి మరీ చెప్పాడు.

శ్రీధర్ యేమీ మాట్లాడలేదు.

'మీ అభిప్రాయం యేమిటో చెప్పండి' అని సభలోంచి కేకలు వినపడ్డాయి.

'ఏ విషయాన్నైనా సావధానంగా నిదానంగా ఆలోచిస్తే మనకు కలిగే భావన ఒక రకంగా వుంటుంది. ఉద్రేకంగానూ, ఆవేశంగానూ ఆలోచిస్తే మన నిర్ణయాలు యింకో రకంగా వుంటాయి....'

'ఈ సభలో ఆవేశాలు ఉద్రేకాలు యెవ్వరికీ లేవండి ...'

'ఇప్పుడు మేము ఆవేశపడిం దేముంది?'

'అవును ట్రిబ్యునల్ అవార్డ్‌ను అమలుపరిచి వరదరాజుగార్ని నౌకర్లోకి తీసుకోమంటున్నాం....'

'మాకిచ్చిన ఇంక్రిమెంట్సూ మిగతా బెనిఫిట్సూ చాలాతక్కువగా వున్నాయని హైకోర్టుకు అప్పీలు చేయమంటున్నాం....'

'హైకోర్టు కూడా దాన్నే ఖాయం చేస్తే....'

'సుప్రీంకోర్టుకు వెళతాం....'

'సుప్రీంకోర్టుకు వెళ్ళటం మాటలా యేమిటి. ఊరికే అనంగానే సరిపోలా'

'ఈ కోర్టులకు వెళ్ళి ఏళ్ళ తరబడి మనం పోట్లాడలేం.... మనం యిక్కడే తేల్చుకోవాలి ...'

'మేనేజిమెంట్ వారితో ముఖాముఖి చర్చలకు దిగటం, మన డిమాండ్స్ అంగీకరించకపోతే మళ్ళీ స్ట్రయిక్, పికెటింగ్....'

'అవసరమయితే ఆమరణ సత్యాగ్రహం చెయ్యటానికూడా సిద్ధంగా వున్నాను....'

'ఈ కోర్టుల చుట్టూ తిరగటం మా కిష్టంలేదు. ఈ కోర్టుల్లో న్యాయం జరుగుతుందనే విశ్వాసం మాకు లేదు....'

తలొకరకంగా మాట్లాడేస్తున్నారు. 'నిదానించండి, అయితే యిప్పుడు తేలింది రెండు విషయాలు. మన హక్కులకోసం కోర్టులకు వెళ్ళి వాదించటమా? ఇక్కడే ప్రత్యక్షచర్య తీసుకుని హక్కులను సాధించటమా! .... ఇదే గదా!'

'అవునండి.... ముందర యీ విషయం తేల్చండి...'

'దానికి సీక్రెట్ బాలెట్ కావాల్సిందే!' అందులో ఒకతను గొంతెత్తి అరిచాడు.

దీనికి అందరూ అంగీకరించారు.

'మళ్ళీ రేపే మీటింగ్ పెట్టాలి. దాంట్లో యీ విషయం తేలిపోయిన తర్వాత ఆ నిర్ణయం ప్రకారం అమలు చెయ్యాల్సిందే. ..'

అందరూ లేచారు.

శ్రీధర్ దగ్గరకు గ్రూపులు గ్రూపులుగా వచ్చి మంతనాలు చేస్తున్నారు. ఎవరికి తోచినట్టు వాళ్ళు చెపుతున్నారు.

అన్నీ వింటున్నాడే గాని శ్రీధర్ తన మనస్సులో మాటను మాత్రం బైట పెట్టలేద .

మంతనాలు చాలా చురుకుగా సాగినాయి.

శ్రీధర్ దగ్గరకు వచ్చి సలహా అడిగినవాళ్ళందరికీ మీకు యేది తోస్తే అది చెయ్యండి అని చెపుతున్నాడే గాని అంతరంగికులతో మాత్రం డైరెక్ట్ ఏక్షన్ వద్దు, హైకోర్టుకు అప్పీలు చేద్దాం అని చెపుతున్నాడు.

దీనివలన అప్పుడే ఆ యూనియన్ రెండు గ్రూపులుగా చీలిపోయింది. ఒకరు స్ట్రయిక్ చెయ్యాలని డైరెక్ట్ ఏక్షన్‌లోకి దిగాలని, మరో గ్రూపు కోర్టుల్లోనే తేల్చుకోవాలని, యీ విధంగా ప్రచారం బాహాటంగానే చేస్తున్నారు.

పదమూడవ తారీఖు సాయంత్రం సమావేశానికి శ్రీధర్ హాజరుకాలేదు

'నాకు వేరే అర్జంటు పనుంది. మీ సీక్రెట్ బాలెట్ రిజల్టు చెప్పండి. తర్వాత దాని ప్రకారం చేద్దాం. యివ్వాళ ఉపన్యాసాలు యేమీ వుండవు. ఇష్యూస్ రెండూ స్పష్టంగా తెలిసినవేగా అన్నాడు.

మీరు వస్తే ఆ ఎఫెక్ట్ వేరు అని కొంతమంది బలవంతం చేశారు.

కాని శ్రీధర్ రాలేదు. ఓ మూల పద్నాలుగవ తారీఖున జరగాల్సిన తతంగానికి సారధ్యం వహించాలి. ఆ ప్రయత్నాల్లో మునిగిపోయాడు.

శాంతియుతంగానే ఎక్కువ ఘర్షణ లేకుండానే వోటింగ్ అయిపోయింది.

గిరిధర్ చీట్లన్నీ విడివిడిగా పెట్టించి లెక్కపెడుతున్నాడు. అందరూ చూస్తుండగానే డైరెక్ట్ ఏక్షన్‌వైపే మొగ్గు కనిపిస్తూన్నట్టు తెలుస్తోంది.

డెబ్బై అయిదు డైరెక్ట్ ఏక్షన్ కావాలని, ఇరవైతొమ్మిది మంది, కోర్టుల ద్వారా పరిష్కారం చేయాలని వోటింగ్‌వలన తెలిసింది

పెద్దపెట్టున అరుపులు, గంతులు, కేకలతో ఆ హాలంతా మారుమోగిపోయింది.

వరదరాజు జిందాబాద్ అనే నినాదం బాగా వినిపిస్తోంది.

శ్రీధర్ తరపు మనుషులు ఆదరాబాదరాగా ఆయనింటికి వెళ్లారు.

ఆయనక్కడ లేడు.

"ఎక్కడికి వెళ్ళారో తెలీదు. ఎప్పుడు వస్తారో తెలీదు."....ఇదే సమాధానం కోమలి నోటివెంబడి వస్తోంది.

సుచేత ఇంటికి వెళితే, ఆమె యిల్లు తాళంవేసి వుంది.

ఆయన కనిపించటంలేదు. ఆమె కనిపించటంలేదు. చిత్రంగా వుందే అని కొంతమంది ఆశ్చర్యపోతున్నారు.

రాత్రి పదకొండుగంటలదాకా రాకపోయేటప్పటికి వాళ్ళ అనుమానాలు బలాన్ని పుంజుకుంటున్నాయి.

ఛళ్లున తెల్లారింది.

ఇంకా చీకటి మసకమసకగా వుంటున్నా కూడా అప్పటికప్పుడే యిద్దరు శ్రీధర్ యింటికి వచ్చి తలుపు తట్టారు.

"ఆయాసపడుతూ మీకోసం రాత్రి చాలాసేపటిదాకా చూశాము. మీరు రాలేదు....వరదరాజు రాత్రే గోడలమీద అన్నీ చెడ్డ మాటలు రాయించేశాడు. మీకూ, సుచేతకు అక్రమ సంబంధం వున్నట్టు తీవ్ర ప్రచారం చేస్తున్నాడు. ఇవ్వాళ పెద్ద ఊరేగింపుతో జనరల్ మేనేజరు కిశోర్ యింటికి వెళ్ళి ధర్నా చేస్తారట. పరిస్థితుల్నిబట్టి ఘెరావ్ చేద్దామనుకుంటున్నారు పరిస్థితి తీవ్రంగా అయేటట్టుంది. అట్టలమీద రాయించి ఊరేగింపు తీసుకువస్తారట... అంటూ యేమేమిటో చెపుతున్నాడు..

శ్రీధర్ తాపీగా అన్నీ వింటున్నాడు.

'అదుగో వరదరాజు మనుషులు వస్తున్నారండీ' అంటూ భయంగా లోపలికి వచ్చారు. శ్రీధర్ బయటకు ఒక అడుగు వేశాడు.

వరదరాజుగారు, ఆయన కేసు ఫైలు యిప్పించుకు రమ్మన్నారండి' అన్నారు మర్యాదగానే.

"అట్లాగా" అంటూ ఆ ఫైలును వాళ్ళకు యిచ్చేశాడు, ఇంకోమాట మాట్లాడకుండా.

"నమస్తే" అంటూ వెళ్ళిపోయారు.

ఆనాడు సాయంత్రం ఆరుగంటలకు పెళ్ళి ముహూర్తం. అదే టైముకు వరదరాజు వర్గం పెద్ద ఊరేగింపుతో నినాదాల్తో కిశోర్ యింటికి వస్తారు. సరిగ్గా పెళ్ళి కూడా అక్కడే జరగబోతోంది.

శ్రీధర్ కాసేపు తికమకపడ్డాడు. కాని గంభీరంగానే ప్రవర్తిస్తూ, లోపలికి వెళ్ళి, 'అన్ని ఎరేంజ్‌మెంట్స్ సక్రమంగానే సాగిపోతున్నాయి. ఇపుడు మన వాళ్లు వచ్చి చెప్పారు' అన్నాడు.

కోమలి, సుచేత ముసిముసి నవ్వులతో మురిసిపోతున్నారు.

తన యింటికివచ్చి యేదైనా ఆగం చేస్తారేమొ అన్నట్లు శ్రీధర్ ఇంటిపట్టునే వుండిపోయాడు. అక్కడ పెళ్ళి యేర్పాట్లు అన్నీ పూర్తయిపోయినాయి. తాను పెళ్ళికూతుర్ని సరిగ్గా ఓ గంట ముందుగా అక్కడికి తీసుకువెళ్ళటమే తన పనల్లా.

సుచేత పెళ్ళికూతురుగా ముస్తాబయి తయారుగా వుంది.

మధ్యాహ్నం పన్నెండుగంటలపుతుండగా, ఒక గుంపు ఊరేగింపుగా వచ్చి, కిశోర్ ముర్దాబాద్, యూనియన్ జిందాబాద్ అని అరుచుకుంటూ శ్రీధర్ యింటిముందు నుంచి వెళ్ళిపోయారు.




అరుపులు వినంగానే యేమిటా అని కోమలి వాకిట్లోకి వచ్చేటప్పటికే ఆ జీపు మలుపు తిరిగింది.

ఒక్కొక్క నిముషం ఒక్కొక్క యుగంలాగ గడుపుతున్నాడు శ్రీధర్.

సాయంత్రం నాలుగూ నాలుగున్నర అవుతూండగా ఓ కారు తన యింటి ముందు ఆగింది.

అనుకున్న ప్రకారం నలుగురూ దాంట్లో యెక్కారు. వెనక సీట్లో కోమలి, సుచేత, శ్రీధర్ కూర్చున్నారు. ముందు పిల్లల్ని కూర్చోబెట్టారు. వెనక వాళ్ళు కనపడకుండా నల్లద్దాల గ్లాస్‌డోర్స్ వేసేశారు.

సూటిగా కిశోర్ ఇంటికి వెళ్ళారు.

కారు దిగుతూవుండగానే కోమలికి గోడమీద కొట్టొచ్చినట్టు అక్షరాలు కనిపించినాయి.

శ్రీధర్ - సుచేత, కిశోర్ ముర్దాబాద్....ఈ రెండూ చదివి, 'ఏవండీ' అంటూ ఆయాసపడింది.

శ్రీధర్ పసికట్టి, 'ముందర అటువైపు వెళ్ళు, తర్వాత మాట్లాడదాం' అని పెళ్ళి మండపంవైపు చూపించాడు.

సుచేత నిజంగా పెళ్ళికూతురయింది. వంచిన తల ఎత్తకుండా పొంకంగా మండపంవైపు నడిచింది.

పెళ్ళిపీటలమీద శ్రీధర్ కోమలి కూర్చున్నారు. మధ్యలో సుచేత కూర్చుంది.

మంత్రాలు మైక్‌లోంచి జోరుగా వినిపిస్తున్నాయి. సరిగ్గా ఆరుగంటలకు బెల్లం జీలకర్ర వధూవరుల తలలమీద వుంచారు. వీడని బంధం అయిపో యింది. కిశోర్ లేచి నిలబడి సుచేత మెళ్ళో మంగళసూత్రధారణ చేస్తున్న సమయంలో పెద్ద పెద్ద కేకలు, అరుపులు వినిపించినాయి పెళ్ళి పందిట్లో. కూర్చున్న పదిమంది చప్పున అటువైపు తిరిగారు.

విసురుగా జనం తమవైపే వస్తున్నట్లు గ్రహించి హడలిపోయి లేచి నిల బడ్డారు వధూవరులు, శ్రీధర్‌నూ.

మంత్రాలు, సన్నాయి, బ్యాండ్ మేళం వినిపించేటప్పటికి ఆ గుంపులో హడావిడి చప్పున తగ్గింది.

వరదరాజు నాయకత్వంలో వస్తున్న ఊరేగింపులో అట్టలమీద వ్రాసి అతికించి వుంచిన బోర్డ్స్, కొంతమంది చేతుల్లో లారీలు అన్నీ స్పష్టంగా కనపడ్డాయి.

అంతా ఒక్కసారిగా దగ్గరకు వచ్చేశారు.

కిశోర్, సుచేత మెళ్ళో మూడో ముడి వేస్తున్నాడు అంతా విస్తుపోయి కొయ్యవారిపోయారు.

కిశోర్ చప్పున వంగి శ్రీధర్ పాదాలకు నమస్కారం చెయ్యబోతుంటే అతని రెండుచేతులు పట్టుకుని వారించాడు. సుచేత మాత్రం మనసారా శ్రీధర్ కాళ్ళను కళ్ళకు అద్దుకుంది.

వధూవరుల శిరస్సులమీద అక్షింతలు చల్లి మౌనంగా ఆశీర్వదించాడు శ్రీధర్.

దౌర్జన్యానికి సిద్ధపడివచ్చినవాళ్ళంతా ఒకరి మొహం ఒకరు చూసుకుంటూ, బొమ్మల్లాగా నిలబడిపోయారు.

సుచేత, కిశోర్‌లు యిద్దరూ కూడా చేతులెత్తి అక్కడికి వచ్చినవాళ్ళందరికీ వినయపూర్వకంగా నమస్కారం చేశారు.

కిశోర్ ఒక అడుగు ముందుకు వేసి చిరునవ్వుతో పలకరిస్తూ మీ అందరికీ యిదే నా ఆహ్వానం. రండి లోపలికి అన్నాడు.

"నాకు వర్కింగ్ క్లాసుమీద అపారమైన గౌరవం, అభిమానం. మీ అందరి సహాయం సహకారం లేకపోతే నాకు యెంత డబ్బున్నప్పటికీ నేనేమీ చెయ్య లేను. నేను ఊరికే ఉపన్యాసాలు చెప్పి మిమ్మల్ని మభ్యపెట్టటం నా కిష్టం లేదు. అందువలనే చేతలతో నా హృదయాన్ని మీకు తెలియపరిచాను. మీలో

ఒకరైన సుచేతను పెళ్ళిచేసుకున్నాను. ఈ నిర్ణయానికి మీ అందరి మద్దతు అండదండలు వుంటాయని నాకు తెలుసు. నన్ను మీరు యేదో చేద్దామని ఆవేశంగా వచ్చారు. నేను మీకు విరోధస్తుణ్ణి కాదు. మీ అందరి శ్రేయోభిలాషిని. మీరు కోరిన డిమాండ్స్ అన్నింటినీ యిచ్చేస్తాను. మా నాన్నగారు ఏమాత్రం అంగీకరించరని తెలిసే రెండునెలలపాటు అమెరికా బిజినెస్ టూర్ మీద పంపించాను. వరదరాజుమీద నాకే విధమైన ద్వేషంలేదు. అతని బలం, యూనియన్ ఐకమత్యం నేను గ్రహించాను. అతన్ని ఉద్యోగంలో తీసుకోవటంలో నాకేమీ అభ్యంతరంలేదు. యీ ఫ్యాక్టరీని యింకా యెక్కువ అభివృద్ధి చేయాలని, ఫ్యాక్టరీలో పనిచేసే ప్రతి కార్మికుడు సగర్వంగా అన్ని విధాలా సంతృప్తి పడాలని, వాళ్ళకు అన్ని సౌకర్యాలు కలిగించాలని నా ఆకాంక్ష. దీనిని పూర్తిచేయటానికి మీ అందరి సహాయం అభ్యర్థిస్తున్నాను... ఇంకా కిశోర్ చెప్పబోతుండగానే వరదరాజు పెదిమలు తడబడ్డాయి.

పెద్దపెట్టున అరుస్తూ "అయ్యగారూ నన్ను క్షమించండి... నేను చాలా పొరపాటు చేశాను. చాలా తొందరపడ్డాను. మీనాన్నగారిని... ఇహ ఎన్నడూ అలాంటి ఆలోచన నా మనస్సులోకి రాదు. అమ్మా, సుచేతా, నువ్వు మాతో వున్నన్నాళ్ళు మాకు ఆదర్శంగా నిలిచావు. ఇవ్వాళ మా యజమానురాలివయినావు. అయినా కూడా ముందు ముందు మాకు ఆదర్శంగానే వుంటావని మాకు తెలుసు. మీరు మనస్సులో యేమీ వుంచుకోకండి....వరదరాజు, కిశోర్ చేతులు గట్టిగా పట్టుకున్నాడు.

కిశోర్ జిందాబాద్ అనే కేకలు పెద్ద పెట్టున వినిపించినాయి.

"కిశోర్ జిందాబాద్" వరదరాజు గొంతెత్తి అరిచాడు.

సుచేత, యిదంతా చూస్తూ బొమ్మలాగా నిలబడిపోయింది.

"వరదరాజూ నువ్వు చాలా గొప్పవాడివోయ్, అతని వెన్ను చరుస్తూ, శ్రీధర్ వరదరాజును దగ్గరకు తీసుకున్నాడు.

---



# ధర్మం చేసిన చెయ్యి

గన్నంరాజు సుందరరావు

వైశాఖ మాసం. ఎండ తీక్షణంగా వుంది.

ఉండుండి వడగాడుపు రివ్వు రివ్వున వీస్తోంది. దుమారం చెలరేగి విచ్చల విడిగా ఎగురుతోంది.

ఎండ ! గాడుపు ! ఎండ !

సమస్త జీవరాసులూ తల్లడిల్లి పోతున్నాయి ! అల్లల్లాడి పోతున్నాయి! ఎండలో కాస్తే కాలిపోతున్నాయి.

కాలుస్తున్న ఎండలో కరిగి నిగ నిగ లాడుతోంది తారురోడ్డు. ఆ రోడ్డుకు అటువైపు -

విశాలమైన కాంపౌండులో, మెయిన్ గేటుకి సుమారు వంద గజాల దూరంలో ఠీవిగా నిలబడి, మండుటెండలో వెండి కొండలా వెలిగిపోతోంది మూడంతస్తుల భవనం.

ఆ భవనం పేరు 'అన్నపూర్ణ నిలయం'

ఊరికి కాస్త దూరంగా ఏకాంత స్థలంలో, సర్వాంగ సుందరంగా నిర్మించబడింది.

రెండున్నర దశాబ్దాల క్రితం -

ఆ భవనంలో నిజంగా అన్నపూర్ణ నిలయమని ప్రఖ్యాతి గాంచింది. ఆ పేరును సార్థకం చేసుకుంది.

ఆ భవనంలో ఎక్కడ చూసినా శ్రీ మహాలక్ష్మి తాండవించేది। అక్కడ నిరతాన్నదానాలూ, వస్త్రదానాలూ జరిగేవి। అనేక సత్కార్యాలకూ, అనాధ శరణాలయాలకూ, దేవాలయాల నిర్మాణానికీ, భూరి విరాళా లివ్వబడేవి। పేద కన్యల కళ్యాణాలు జరిగేవి। బీద విద్యార్థుల చదువు సంధ్యలు సాగేవి। అనుదినంఅర్చనలూ, భజనలూ, వ్రతాలూ జరిగేవి। ప్రతిరోజూ ఒక పండగలా, పర్వదినంలా గడిచేది। ఎల్లవేళలా ఆ భవనం కళకళ లాడుతూండేది।

ఆ అధ్యాయం ముగిసింది. ఆ కాలం గతించింది.

ఆ రోజులు మారాయి. మనుషులూ మారారు.

దేవతలు వసించిన భవనం రాక్షసుల వశమైంది।

ఆ నాటినుంచీ - పట్టెడు మెతుకులు కాని, పిడికెడు గింజలు కాని, పైసా డబ్బులు కాని ధర్మం రూపేణా భవన సింహద్వారం దాటి రావడం లేదు। ముష్టి చిప్పల్లో రాలడంలేదు।

వర్తమానంలో అది పేరుకు మాత్రం అన్నపూర్ణ నిలయం.

మెతుకుపోతే బ్రతుకు పోతుంది. పైసా పోతే ప్రాణం పోతుంది - అను కొనే మానవులున్నా రక్కడ।

అక్కడ ధనలక్ష్మి భూస్థాపితం చేయబడుతూ, నల్లబడి పోతోంది ప్రస్తుతం -

సర్వాంగసుందరంగా అలంకరించ బడి, కళకళ లాడుతోంది ఆ భవనం। మూడో అంతస్తులో అమర్చబడిన మైకు లోంచి శ్రావ్యమైన పాటలు వినిపి స్తున్నాయి. భవన ప్రాంగణంలో ఆకాశ మంత పందిరి వేశారు. భూదేవంత అరుగు కట్టారు. పందిరిని పచ్చటి తోరణాలతో, రంగు రంగుల కాగితం పువ్వులతో, లతలతో అందంగా అలంక రించారు. పందిరంతా ఆహ్వానితులతో నిండి సందడిగా వుంది. పెళ్ళి మంత్రాలూ అవసరం వచ్చినప్పుడు బేండు మేళం సందడిగా వినిపిస్తున్నాయి. ఆ భవనం యజమాని తన రెండోకూతురు పెళ్ళి వైభవోపేతంగా జరిపిస్తున్నాడు.

భవనం లోపలా, బయటా, చాలా కోలాహలంగా వుంది. ఎక్కడ చూసినా ఆనందం వెల్లివిరుస్తోంది।

ఆ భవనానికి ఎదురుగా, తారు రోడ్డుకి ఇటు వైపు -

ఎత్తుగా పెరిగి, శాఖోపశాఖలుగా విస్తరించి వుంది మర్రిచెట్టు. ఆ చెట్టు కింద చుట్టూ విశాలమైన సిమెంటు అరుగు వుంది. అన్నపూర్ణ నిలయం నిర్మించబడిన తర్వాత ఆ భవనాధిపతి బాటసారుల సౌకర్యం కోసం ఆ అరుగును కట్టించారు.

ఆ అరుగుమీద -

వికలాంగులూ, కుష్టురోగులూ, కళ్ళు లేని కబోదులూ, ముసిలివాళ్ళూ, దిక్కుమాలిన పిల్లలూ, దిక్కున్నా తిండికి మొహంవాచిన పిల్లలూ ఎక్కడెక్కడి నుంచో వచ్చి వున్నారు. పెళ్ళింట్లోంచి ఏమైనా వచ్చి తమ కడుపుల్లో పడుతుందనే ఆశతో నిరీక్షిస్తున్నారు.

వాళ్ళ కడుపులు నిప్పుల మీద కాలేసిన కాళీ కుండల్లా సెగలు కక్కుతున్నాయి. వెన్నుకి అంటుకుపోయాయి.

ఆకలి.... ఆకలి!.... కడుపునిండా ఆకలి!.... నీరసం.... ప్రాణ సంకటం! వాళ్ళకి కావలసినవి పట్టెడు మెతుకులు. కనీసం పారేసిన ఆకుల్లో మిగిలిన ఎంగిలి మెతుకులు! ఏవైనా ఫర్వాలేదు. ఏది దొరికినా చాలు. తృప్తిగా అరగిద్దామనే ఆశతో వేచివున్నారు.

కొందరు నీరసంగా దొర్లుతున్నారు. కొందరు నేలకి అంటుకుపోయారు. కొందరు కూర్చుని కునికిపాట్లు పడుతున్నారు. మరికొందరు ఏవేవో మాట్లాడుకుంటున్నారు. అందరూ ఆకలి మంట భరించలేక ఆక్రోశిస్తున్నారు.

ఆ భవనం - స్వర్గలోకం! అక్కడ ఆనందం!

ఈ అరుగు - నరకలోకం! ఇక్కడ ఆక్రోశం!

సర్వాంతర్యామిసృష్టిలోనివ్యత్యాసం, పక్షపాత బుద్ధీ, నిమ్నోన్నతాలూ, ఆ తారురోడ్డుకి ఇరుప్రక్కలా ప్రత్యక్షంగా గోచరమవుతున్నాయి!

మధ్యాహ్నం ఒంటిగంట దాటింది. ఎండ మండిపోతోంది! నిప్పుల వర్షం కురిపిస్తోంది!

భవనంలో భోజనాల కార్యక్రమం ముగిసింది. అందమైన కార్లు చిన్నవి, పెద్దవి మెయిన్ గేటులోంచి వొయ్యారంగా బయటకు వచ్చి, తారురోడ్డు మీదుగా తమ తమ గమ్యాలకేసి దూసుకుపోతున్నాయి.

భవనప్రాంగణం, తారురోడ్డు చాలా కోలాహలంగా వున్నాయి.

"ఎంగిలాకులు ఇంటెనకాల ఇసిరేతున్నారర్రా....బేగి పార్రెండి"పరుగు పరుగున అరుగు దగ్గరకొచ్చి అరిచి, మళ్ళీ భవనం వెనకవైపుకు దూసుకుపోయాడు ముష్టికుర్రాడు.

ముష్టి జనంలో చైతన్యం వచ్చింది. ఆరాటం వచ్చింది. హడావుడిగా లేచారు. చిప్పలూ, జోలెలూ, వూతకర్రలూ, చేతి

బధ్ధకస్తులు:

ఏవండోయ్ మీ యింటివెనుక వైపుతగులబడుతోంది

సర్లెలేవయ్యా ఇటువైపుదాకా రానియ్యి




కర్రలూ పట్టుకుని, జోగిపోతూ తూలి పోతూ గమ్యంకేసి సాగిపోతున్నారు.

అందరూ వెళ్ళిపోతున్నారు. క్రమ క్రమంగా అరుగు ఖాళీ అయిపోయింది. అన్నపూర్ణమ్మ హృదయం గిల గిల లాడిపోతోంది!

"....ప్చ్.... ఆ మహారాజు అస్త మించక ముందే నన్ను భగవంతుడు తీసుకుపోయుండాల్సింది .... అలా అయితే ఎంత బాగుండేది!.... కాని ఆ అదృష్టం అందరికీ వుంటుందా? అలాంటి చావుకి పూర్వజన్మ సుకృతం ఉండాలేమో!.... వారు పుణ్యాత్ములు. అందుకే ఈ పాడులోకం నుంచి అంత తొందరగా నిష్క్రమించారు....నేను పాపిని గనుక.... ఇలాంటి వన్నీ చూడ్డానికి మిగిలిపోయాను. ఇంకా ఎన్నాళ్ళో ఈ కఠినశిక్ష.... ఇదంతా చేసుకున్న కర్మ.... అనుభవించక తప్పదు...." ఆవేదనగా అనుకుంది అన్నపూర్ణమ్మ.

ఆమె ముఖంలో దైన్యం.... అంత రంగంలో అంతులేని వ్యధ.... కళ్ళలో నీరు! క్రమ క్రమంగా దూరమవుతున్న ముష్టివాళ్ళ వంక జాలిగా చూస్తోంది. కన్నీటి పొరల్లో ముందు కాస్తస్పష్టంగా, తర్వాత మసక మసగ్గా కనిపిస్తూ, చివ రకు కనుమరుగైపోయారు వాళ్ళు.

అరుగుమీద మర్రిచెట్టుకి ఆనుకొని కూర్చుని వుంది అన్నపూర్ణమ్మ. ఆమెకి అరవై అయిదేళ్ళు నిండి, మూడు నెలలు గడిచాయి. జుట్టు ముగ్గుబుట్టలా నెరిసింది. చర్మం ముడతలు పడి వ్రేలాడుతోంది. కంటిచూపు మందగించింది. జీవితంలో వూహించని దెబ్బ తిని విరక్తిగా బ్రతుకుతూ, భగవంతుడి పిలుపు కోసం ఆదుర్దాగా ఎదురు చూస్తోంది!

"....ప్చ్.... నాలుగు ఎంగిలి మెతుకుల కోసం - ఆకులు నాకి ఆకలి తీర్చుకోవడం కోసం ఎంత ఆదుర్దాగా పరుగెడుతున్నారు!.... ఆకులు నాకితే కడుపు నిండుతుందా? ....ఆకలి మంట చల్లారుతుందా?....అయినా ఎంగిలాకుల్లో ఏం మిగులుతుంది?.... ఏదో దొరుకుతుంది, ఆకలి తీరుతుంది అనుకోడం భ్రమ.... అంతా ఒట్టి భ్రమ....

అక్కడ వాళ్ళూ, కుక్కలూ, కాకులూ, ఆకులకోసం పోటీ పడుతుంటా రీపాటికి .... పాపం వాళ్ళని ఆదరించి అన్నం పెట్టేవారెవరు? అంతమందికి, అన్ని జీవాలకి - అన్నంపెట్టే దాతలేవీ? అన్నపూర్ణ నిలయంలో ఎవరున్నారు? నా దేవుడే బ్రతికుంటే - నా కొడుకే వుంటే.... నేను అన్నపూర్ణ నిలయంలో ఉంటే....నాకు కొడుకు పెళ్ళి ఎంత ఘనంగా జరిగివుండేది!...ఈ నిర్భాగ్యులు ఎంగిలాకులు నాకవలసివచ్చేదా? ప్చ్... నాచేతులు ఎంతో పాపం చేసుకున్నాయి. ఆర్తులకి అన్నం పెట్టే అవకాశం దూరమైంది. హఠాత్తుగా అదృష్టం చేజారిపోయింది. జీవితంలో జారిపోయిన అవకాశాలు మళ్ళీమళ్ళీ వస్తాయా? కాలచక్రం వెనక్కి తిరుగుతుందా? ఈ చేతులు విరిగిపోయాయి. వీటిలో మిగిలింది శూన్యం....ఒట్టి శూన్యం"....

అరిచేతులవంక చూసుకుంది.

అరవిచ్చిన అరవిందల్లా వుండేవి! ముంజేతులు గలగలలాడే గాజులతో, రవ్వలు పొదిగిన కంకణాలతో కళకళలాడేవి! మేను మేలిమి బంగారంలా మెరిసిపోయేది! ఏడువారాల నగలు ధరించేది! పట్టుపీతాంబరాలు కట్టుకొనేది! వదనంలో లక్ష్మీకళ వుట్టిపడేది! అదొక వైభవం! మహారాణీయోగం! ఆ వైభవం నశించింది... ఆ యోగం మారింది.. ఔన్నత్యం నేలపాలయింది. శిఖరాగ్రం విరిగి అగాధంలో పడిపోయింది.

అప్పటినుంచీ-అంధకారం అంతులేని పరితాపం....అర్థంలేని జీవితం. బొట్టు బొట్టుగా కన్నీరు కుష్కించి, కళావిహీనంగా వున్న అరిచేతుల్లో పడింది. దుఃఖంతో కుమిలిపోయింది అన్నపూర్ణమ్మ.

"ఇంక బాధపడనవసరంలేదు. అయిపోయింది. తన కథ ముగింపుకి వచ్చేస్తోంది. చివరి అధ్యాయం గడుస్తోంది. మొదటిఅధ్యాయం ఒక కల...రెండవది...

మధుర స్వప్నం .... చివరి అధ్యాయం ఒక పీడకల... అంతే - అలాగే గడిచింది.... ఇలాగే ముగుస్తుంది....ఇంక ఎంతోకాలం పట్టదు. శరీరం శాశ్వత విశ్రాంతి కోసం ఆరాటపడుతోంది. మట్టిలో లీనమవడానికి ఉరకలు వేస్తోంది. ఏదో ఒకరోజు, ఏ సమయంలోనో, ఏ అవస్తలోనూ....ఏ క్షణంలోనో జీవి దేహంనుంచి విముక్తి పొంది, అనంత విశ్వంలోకి ఎగిరిపోతుంది. తదనంతరం ఈ దుఃఖం, బాధలూ వుండవు. ఈలోకం వుండదు. శరీరం మిగలదు." గాఢంగా నిట్టూర్చి, అరిచేతులు తుడుచుకొని ముందుకు చూసింది. భవనం గేటూ, ప్రహరీగోడా, మసక మసగ్గా కనిపిస్తున్నాయి. ఆ వెనుక దృశ్యం చెదిరిపోతోంది

గేటుకి దగ్గరగా పందిట్లో ఎవరో బిగ్గరగా మాట్లాడుకుంటున్నారు. మధ్య మధ్య నవ్వుకుంటున్నారు. నవ్వులూ, మాటలూ వినిపిస్తున్నాయి కాని మనుషులు స్పష్టంగా కనిపించటంలేదు. భవనంలో మైకు విశ్రాంతి తీసుకుంటోంది

ఊరకుక్కలు రెండు తారురోడ్డుమీద పరిగెడుతూ వచ్చి, రోడ్డు మధ్య ఆగి, ఎటు పోవాలో తెలియనట్టు అటూ ఇటూ చూశాయి తర్వాత మర్రిచెట్టు నీడలో కొచ్చి పడుకుని, నాలుకలు బయటకు జాపి జాపోయసాగాయి.

మర్రిచెట్టుమీద కాకి ఎందుకో అదే పనిగా అరుస్తోంది.

వడగాలి రివ్వున వీచింది. గలగలమని గోలపెడుతూ ఆకులు రాల్చింది మర్రిచెట్టు. దుమారం రేగి సుడులు తిరుగుతూ ఎగిరి అరుగుమీద విరుచుకు పడింది. ఉక్కిరిబిక్కిరవుతూ కళ్ళు గట్టిగా మూసుకుంది అన్నపూర్ణమ్మ. మగత కమ్మినట్టు కొద్దిసేపు అలా వుండిపోయింది.

ఆమెకి నీరసంగా వుంది ఆకలిగా వుంది. ఏమైనా తినాలని తహతహగా వుంది

"ఏముంది తినడానికి? ఎవరైనా దయతల్చి పెడితే తినాలి. లేకపోతే అంతే. పెళ్ళింట్లో పనసకాయ కూర, గుమ్మడికాయ కూర చేస్తారు. పులిహోర బూరెలూ, లాడూలూ, ఇంకా ఎన్నెన్నో చేస్తారు. పనసకాయకూర, పులిహోర, తినాలని వుంది. కాని ఎవరు పెడతారు నాకు?" గుటకలు మింగుతూ, కళ్ళు తెరిచి భవనం మెయిన్ గేటువైపు ఆశగా చూసింది

అక్కడ ఎవరూ లేరు. మాటలూ, నవ్వులూ వినిపించడంలేదు.

దీర్ఘంగా నిట్టూర్చి, కళ్ళు గట్టిగా మూసి తెరిచింది అన్నపూర్ణమ్మ. నీరసంగా లేచి నిలబడి చుట్టూ చూసింది. చూపు అనినంతమేరకు ఎక్కడా జనసంచారం లేదు; పక్షులు కూడా నీడపట్టు వదిలి బయటకు రావడంలేదు; ఎండ తీవ్రత తగ్గలేదు. అగ్నిగుండంలో

వున్నట్టుంది! అంతకంతకు ఆకలి విజృంభిస్తోంది. నీరసించిన శరీరం సన్నగా కంపిస్తోంది. కళ్ళు చీకట్లు కమ్ముతున్నట్టయింది. నిలబడలేక చతికిలబడి, చెట్టుకి జారగిలబడిపోయింది.

నీరసం...ఆకలి... దాహం ... నాలుక పిడచకట్టుకుపోతోంది.

మాసిన గుడ్డ సంచీలోంచి నీళ్ళసీసా తీసింది. కాసిని నీళ్ళు మొహానికి రాసు కుంది నీళ్లు వెచ్చగా వున్నాయి. మరి కొన్ని నీళ్ళు మొహంమీద జల్లుకొని మిగిలినవన్నీ తాగేసింది. కొంగుతో మొహం తుడుచుకుంది.

నీళ్ళు పడ్డాక ఆకలిమంట కాస్త చల్లారినట్టయింది. కాళ్ళు చాపుకొని, చేతులు ఒళ్ళోపెట్టుకుంది. తల పక్కకు వాల్చి కళ్ళు మూసుకుంది.

అనుకోకుండా గతం గుర్తుకొస్తోంది ఏవేవో దృశ్యాలు మనసులో కదిలి కలవర పెడుతున్నాయి. తీవ్ర పరితాపా నికి గురిచేస్తున్నాయి.

గతాన్ని గుర్తుకు తెచ్చుకోవాలనిపిం చదు. అందుగురించి ఆలోచించాలని వుండదు. అయినా ఆ స్మృతులు విడ నాడడంలేదు. అనుక్షణం అన్నీ కాక పోయినా కొన్నయినా జ్ఞాపకాలు వెన్నా డక మానడంలేదు దృశ్యాలు మనసు లోంచి జారిపోవడంలేదు.

'... అదీవేసవికాలమే .. ఆరోజు.... ఆదివారమా? సోమవారమా?....అనాథ శరణాలయంలో చిన్నపిల్లలకి అన్నం పెడుతున్నారు. తనూ, లక్ష్మి, సీతా, పిల్లలు మారాం చేస్తూంటే బుజ్జగించి, బ్రతిమాలి తినిపిస్తున్నారు.

పిల్లల్లో నాగరాజంటే తనకెంతో అభిమానం. తెల్లగా, బొద్దుగా అమాయ కంగా, ముద్దొస్తూ వుండేవాడు. పుట్టిన నాటినుంచీ వాడికి తల్లీ, తండ్రీ తనే అయి సాకింది. వాడి తండ్రి ఎవర్నో ఖూనీచేసి యావజ్జీవ కారాగార శిక్షకు గురిఅయాడు. తల్లికి మారుగతిలేక శరణాలయంలో చేరి వాణ్ణి కన్నది. ఆ తల్లి వాణ్ణి సరిగా చూసేదికాదు! ఎప్పుడూ విరక్తిగా కనిపించేది! తనే వాడికి నీళ్ళు పోసి, పాలుపోసి పెంచింది. వాడికి అయిదో నెల వచ్చాక ఆతల్లి ఎందుకో ఆత్మహత్య చేసుకుంది! శరణాలయం అధికారిణి అనసూయమ్మగారు నాగ రాజుని తనకే అప్పగించింది. ఆనాటి నుంచీ ఎంతో అపురూపంగా వాణ్ని సాకింది తను. వాడిమీద ఈగ వాలితే చాలు తన ప్రాణం గిలగిల లాడి పోయేది! అలా మూడేళ్ళు గడిచాయి. తనకి పద్దెనిమిదేళ్ళు నిండాయి. యధా ప్రకారం ఆ రోజు కూడా నాగరాజుకి అన్నం తినిపిస్తోంది తను.

అంతలో—అనసూయమ్మగారి వెంట అక్కడికి వచ్చారు అతను. అతను మహారాజు బిడ్డలా వున్నారు. ఆజాను బాహువు. ఆ హుందాతనం, స్ఫుర

బద్ధకస్తులు:




ద్రూపం, అందమైన విగ్రహం ఎవరికీ ఉండవేమో అనిపించింది. తనూ, లక్ష్మి, సీతా, వినయంగానే లేచి తలలు వంచి నిల్చున్నారు. అనసూయమ్మ గారు శరణాలయం విషయాలేమిటో చెబుతున్నారాయనతో. కొద్ది క్షణాల తర్వాత వారిద్దరూ అక్కణ్ణుంచి వెళ్ళి పోయారు. అతను వెళుతూ తనవంక ఒకసారి చూశారు అలా చూసి అతను వెళ్ళిపోతూంటే, తన మనసెందుకో విలవిలలాడింది. అతన్ని మళ్ళీ మళ్ళీ చూడాలనిపించింది. వారు తనని...ఆశలేవో అంకురించాయి. కాని స్థితిమంతుల్లా వున్నారు. వారు గగనసీమలో విహరించే అందాల చందమామ...తానొక గడ్డిపువ్వు ...ఎంతో వ్యత్యాసం వుంది. ఆశలు అణుచుకొని, ఆలోచనలు తెంచుకొని తన పనిలో నిమగ్నమైంది.

సుమారు నెలరోజుల తర్వాత, వారు తమ తల్లితో కలిసి మళ్ళీ వచ్చారు. ఆమె ఎంతో ఆప్యాయంగా మాట్లాడింది: తన ఆశలూ, ఆశయాలూ, చదువూ ఏమిటేమిటో తెలుసుకుంది. ఆ తరువాత 'మా చక్రవర్తికి నువ్వు బాగా నచ్చావుట. ఇన్నాళ్ళకి వాడికి పెళ్ళిచేసుకోవాలని బుద్ధి పుట్టింది. నిన్ను చేసుకోవాలని ఆరాటపడుతున్నాడు. నీకు అంగీకారమైతే...' అన్నారామె ఆప్యాయంగా తన వీపు నిమురుతూ.

తనలో - ఆశ్చర్యం, ఆనందం,

దుఃఖం ఒక్కసారిగా పెల్లుబికాయి. కలగాపులగమై కళ్ళలో నీటిని నింపాయి. మాట్లాడ్డానికి అవకాశం ఇవ్వకుండా గొంతును నొక్కేశాయి. కొద్ది క్షణాలకు తేరుకొని తన అంగీకారాన్ని తెలియ జేసింది. ఆమె వదనం పూర్ణ చంద్ర బింబంలా వెలిగింది! తమ పెళ్ళి వైభవంగా జరిగింది! తను చక్రవర్తిగారి అర్ధాంగి అయింది!

వారు కోటీశ్వరులు. తరతరాల వరకూ తరగని ఐశ్వర్యం వారిది! దయార్ద్రహృదయులు, ధర్మదాతః తనని ఎంతో అపురూపంగా చూసుకొనే వారు. అత్తగారు తనని కన్నబిడ్డలా ఆదరించేవారు. ఆమెకు అందరూ బిడ్డలే! అభిమానులే! ఆమెది విశాల హృదయం! అది ఆమెకు దేవుడిచ్చిన వరం! పెళ్ళయిన నెలరోజులనుంచీ, తన మనసు నాగరాజుకోసం కొట్టుమిట్టాడ సాగింది. ఎంతో దిగులుగా వుండేది. వాడిని చూడాలనీ, అన్నం తినిపించాలనీ తహతహగా వుండేది. తను అన్యమనస్కంగా, దిగులుగా వుండడం గమనించి వారు ఎన్నోసార్లు కారణం అడిగారు. చెబితే ఏమనుకుంటారో అని భయపడి చెప్పలేకపోయింది. ఎలా పసిగట్టారో శరణాలయానికి వెళ్ళి వాకబు చేశారో.... తెలీదు కాని, ఓ రోజు మధ్యాహ్నం పరుగు పరుగున వచ్చి తన వడిలో వాలి, మెడని చేతులతో చుట్టేశాడు నాగరాజు!

తన కళ్ళు వర్షించాయి. ఆనందం హద్దులు మీరింది. తన ప్రేమమూర్తి ఔదార్యానికి మురిసిపోయింది. ఆయన నిజంగా దేవుడే అనే నిశ్చయానికొచ్చేసింది.

ఆనాటినుంచీ నాగరాజు ఆ ఇంటికి యువరాజయాడు. తమకు తనయుడూ, అత్తగారికి మనవడూ అయాడు. అల్లారు ముద్దుగా పెంచసాగారు. వాడు క్షణం కనిపించకపోతే తమ హృదయాలు తల్లడిల్లిపోయేవి!

పెళ్ళయి మూడేళ్ళు గడిచినా తన కడుపు పండలేదనీ, మనవడిని ఎత్తుకొనే అదృష్టం లేకపోయిందనీ అత్తగారు విచారించేవారు. తనచేత ఎన్నెన్నో నోములు నోయించారు. పూజలూ, వ్రతాలూ చేయించారు. నిరంతరం నిరుపేదలకు అన్నదానం చేయించారు. కాని ఫలితం శూన్యం. తుది క్షణంవరకూ దిగులుపడుతూనే ఆమె దివంగతులయారు.

తల్లిపోయిన ఇంట్లో మసలలేక వారు అన్నపూర్ణ నిలయం కట్టించారు. అందులో ప్రవేశించిన నెల రోజులకు నాగరాజు పదవ జన్మదినోత్సవం అట్టహాసంగా జరిగింది! తమ ఆస్తికి వారసుడు లేడనీ, వంశోద్ధారకుడు లేడనీ, వారు అప్పుడప్పుడు విచారిస్తూండేవారు. 'ఈ సంపదంతా ఎందుకు? ఎవరికోసం దాచాలి?' అంటూ దానధర్మాలు విరివిగా చేయ

సాగారు. పేదపిల్లల పెళ్ళిళ్ళు చేయిం చారు. ఎందరికో ఆర్థిక సహాయం చేస్తూ చదువులు చెప్పించారు. త న చే త నిరంతరం అన్నదానాలూ, వస్త్రదానాలూ చేయించారు. చేతులకు ధర్మంచెయ్యడం అలవాటుగా మారిపోయింది! కనీసం పదిమందికైనా అన్నదానం చెయ్యకుండా భోజనం చెయ్యడానికి మనసొప్పేది కాదు! నాగరాజు ఇరవై ఏళ్ళవాడయ్యాడు. భగవదనుగ్రహంవల్ల తన కడుపు పండి దివాకర్ పుట్టాడు!

వారి ఆనందానికి అంతులేకుండా పోయింది! ఆకాశాన్ని అందుకున్నారు! అర్చనలూ, వ్రతాలూ, పూజలూ అట్ట హాసంగా జరిగాయి! ధన ధాన్య వస్త్ర దానాలు జరిగాయి! బీదలకి అన్న దానాలూ, సంతర్పణలూ ఎడతెరిపి లేకుండా జరిగాయి! నెలరోజులు ఉత్స వంలా గడిచాయి! ఆ రోజుల్లో ఎందుకో నాగరాజు విసుక్కొనేవాడు! దానధర్మాలు చెయ్యొద్దనేవాడు! తమకి త ర గ ని ఐశ్వర్యం వుందనీ, కలిగినదాంట్లో కాస్త దానంచెయ్యడంవల్ల నష్టంలేదనీ, అలా అనడం తప్పనీ, తను బుద్ధి చెప్పేది. వాడు రుసరుసలాడేవాడు.

ఉండుండి ఒకనాడు 'ఇలా దానాలూ, ధర్మాలూ, పూజా పునస్కారాలూ చేస్తూ కూచుంటే ఇల్లు గుల్లయిపోతుంది. చివరికి నాన్నగారి చేతికి చిప్ప వస్తుంది. తర్వాత మనకీ అదే మిగులుతుంది,' అన్నాడు కోపంతో చిందులుతొక్కుతూ నాగరాజు! తనలో కోపం తారస్థాయిని అందుకుంది. అంతటి మహనీయుణ్ణి, మహాలక్ష్మి పుత్రుణ్ణి అంత మాట అంటాడా !? కోపం పట్టలేక చెయ్యి నొప్పెట్టేవరకూ వాడి చెంపలు వాయిం చేసింది. 'దిక్కుమాలిన వెధవని తెచ్చి, అల్లారుముద్దుగా పెంచి, ప్రయోజకుణ్ణి చేస్తున్నందుకు కారుకూతలు కూస్తావా? కృతఘ్నుడా....ఛీ ఛీ....ఇక నీ మొహం నాకు చూపించకు .... పో .... వెళ్ళు' అంటూ బిగ్గరగా అరిచింది తను. వాడు కుమిలి కుమిలి ఏడ్చాడు. కొంతసేపటికి తేరుకొని 'మీరు నా తల్లితండ్రులు కారా?' అన్నాడు దీనంగా. కాదని తను తల అడ్డంగా వూపేసింది. తర్వాత దుఃఖంతో కుమిలిపోయింది.

అప్పటినుంచీ నాగరాజులో మార్పు వచ్చింది! ముభావంగా, నిర్లిప్తంగా వుండేవాడు! తను జాలిపడి 'కోపంలో అలా అన్నాను....నువ్వు నిజంగా మా బిడ్డవే - నా పెద్దకొడుకువి' అంటూ బుజ్జగించేది. కాని వాడి ధోరణిలో మార్పులేదు!

దివాకర్‌కి మూడేళ్ళు నిండాక తాము తీర్థయాత్రలకి వెళ్ళారు. ఒక పుణ్య స్థలంలో దైవదర్శనం వగైరాలు ముగించుకొని, ఆ రాత్రి వసతిగృహంలో ఆదమరిచి నిద్రపోయారు. ఉదయం లేచేసరికి దివాకర్ లేడు!

వారూ, నాగరాజూ, నౌకరూ, హడా వుడిగా పరుగులు తీశారు. వూరంతా గాలించారు. పోలీసులకి తెలియజేశారు. ఎన్నాళ్ళు ఎన్ని విధాల ప్రయత్నించినా దివాకర్ జాడ తెలియలేదు! తాము గుండెలు బ్రద్దలయేలా రోదించారు. తమ లోకంలో దివాకరుడు శాశ్వతంగా అస్తమించాడు. గాఢాంధకారం అలుము కుంది. విఘాతంనుండి వారు తట్టుకోలేక పోయారు. గుండె జబ్బూ, మనోవ్యాధీ కృంగదీసేశాయి. వ్యవహారాలన్నీ నాగ రాజుకి అప్పగించేశారు. దివాకర్ కోసం కుమిలిపోవడం తప్ప వారికి వేరొక ధ్యాసే లేకుండా పోయింది! అనుక్షణం దుఃఖించడం తప్ప తనకి మరొక పనే లేకుండాపోయింది ....' కళ్ళు తెరిచి గాఢంగానిట్టూర్చింది అన్నపూర్ణమ్మ కొద్ది క్షణాలు దుఃఖంతో కుమిలిపోయింది. కళ్ళొత్తుకుంటూ తలవంచుకొని మళ్ళీ గట్టిగా కళ్ళు మూసుకుంది.

'ఆ రోజు....జీవితంలో మరపురాని దుర్దినం....

వారి పరిస్థితి విషమించింది. విపరీ తంగా బాధపడుతున్నారు డాక్టర్లు దేవుడి మీద భారం వేసేశారు. ఇక లాభం లేదని వారు వకీలుని పిలిపించి విల్లు రాయించేశారు. ఆ కాగితాలు నాగరాజు కిచ్చి సరిగా వుందో లేదో చూడ మన్నారు. వాడు చదివి 'అంతా సవ్యం గానే వుంది. చదివి వినిపించమంటారా?' అన్నాడు వినయంగా. వారు వద్దని వారించి సంతకాలు చేసేశారు. పేదవాళ్ళనీ, ముష్టివాళ్ళనీ పిలిపించారు. 'అన్నపూర్ణా! డబ్బు తీసుకురా' అని ఆజ్ఞాపించారు. వచ్చిన బీదసాదలకు ధర్మం చేస్తూ సూర్యాస్తమయ సమయంలో ఆ చెయ్యి స్తంభించిపోయింది. సూర్య భగవానుడితోబాటు ఆ మహానుభావుడు అస్తమించారు. సూర్యుడు మళ్ళీ ఉద యించి లోకాన్ని వెలుగుతో నింపుతాడు కాని, తన దైవం శాశ్వతంగా తనని అంధకార జగత్తులో వదిలేసి నిష్క్ర మించారు. తను జీవచ్ఛవంగా మిగిలి పోయింది.

ఆరునెలలు అయోమయంగా దొర్లి పోయాయి.

నాగరాజు జాగ్రత్తగా మెసులు కుంటూ వ్యవహారాలు చూడసాగాడు. వాడి అండ చూసుకొని తను ధైర్యాన్ని కూడదీసుకోసాగింది. కాని దుఃఖం తనని విడనాడలేదు

తీర్థయాత్రలు చేస్తే మనశ్శాంతి చిక్కుతుందనీ, కాశీ, గయ, బదరీనాథ్ యాత్రలు చేసి వద్దామనీ పట్టుబట్టి తీసు కెళ్ళాడు నాగరాజు. ప్రయాణానికిముందు తన ఒంటిమీద నగలన్నీ తీయించేసి భద్రపరిచాడు. కలకత్తా చేరుకొనేవరకూ ఆదరంగా చూసి, తర్వాత కనుమరు గయ్యాడు!!

తనకి దిక్కుతోచలేదు. కలకత్తా



నగరం మరో లోకంలా వుంది! అక్కడెవర్నీ తెలియదు. ఆ భాష అర్థం కాలేదు. 'నాగరాజు ఎక్కడికి పోయాడు? ఏమయ్యాడు? ఎవరైనా చంపేశారా?' మధనపడుతూ అష్టకష్టాలు పడి తను తిరిగి వచ్చేసరికి .... స్థితిగతులు మారి పోయాయి! విల్లు రాయించినప్పుడు కుట్ర జరిగిందవి విశదమైంది. తను అగాధంలోకి, అధఃపాతాళంలోకి నిర్దాక్షిణ్యంగా త్రోసివేయబడిందవి తెలుసుకున్న క్షణంలో....

నిలువునా కంపించిపోయింది.

'తనయుడ' నుకున్నవాడు 'తక్షకుడయాడు! కక్ష పెట్టుకొని కఠిన శిక్ష విధించాడు. పాము కాటువేశాక పాలు పొయ్యడం పొరబాటయిందని రోదిస్తే ఏం లాభం ?? ...కాలసర్పం కాటువేశాక సంభవించేది ఏమిటి??? ...అంతం .... సర్వనాశనం....తను మరెవర్నీ నమ్మలేక పోయింది....అంతే .... వెళ్ళిపోయింది. తెగిన గాలిపటానికి గమ్యం వుంటుందా? ఎక్కడుంటుంది? ఎక్కడ! ఎక్కడ? ఎక్కడ? ఎక్కడెక్కడో తిరిగింది.... దిక్కుమాలిన బ్రతుకు బ్రతుకింది....నీతి నియమాలు తప్పలేదు. ఎవరైనా ఆదరించి అన్నం పెడితే తిన్నది. లేకపోతే ఉపవాసమే గతి. దొరికినది తినేముందు కాస్త మూగజీవాలకో, ముష్టి జనాలకో

పెట్టుకుని తింది. ధర్మం చెయ్యడానికి అలవాటుపడిన తన చెయ్యి .... దానికి చిక్కిన ముద్దలో కాస్త మరో జీవికి పెట్టకుండా, తన నోటివరకూ ఎన్నడూ తీసుకురాలేదు....రాబోదు. అలా తిన డానికి తన నోరూ ఒప్పలేదు. ఈ చర మాంకంలో తన దేవుడు – ఆ ధర్మ ప్రభువు కట్టించిన ఈ అరుగుమీద కలిగినదాంట్లో కాస్త ఎవరికైనా ధర్మం చేస్తూ, శాశ్వతనిద్రలోకి జారిపోవాలి.అదే తన ధ్యేయం. ఆశయం....ఆశ...యం' ఆలోచనలు కరిగిపోయాయి. దృశ్యాలు చెదిరి అలుక్కుపోయి, అగుపించడం మానేశాయి. అన్నపూర్ణమ్మ నిద్రలోకి జారుకుంది.

*   *   *

సుధాకర్ మనసు దెబ్బతిన్న పక్షిలా గిలగిల కొట్టుకుంటోంది. గత రెండేళ్ళుగా అంతంత మాత్రంగా వున్న దిగులు ఆ వృదయంనుంచి రెట్టింపు అయింది. ఏకాంత స్థలంలోకి పోయి బిగ్గరగా ఏడవాలనిపిస్తోంది. పెళ్ళివారి ఆనందంలో పాలుపంచుకోలేక పోయాడు మధ్యాహ్నం భోజనం సరిగా చెయ్యలేకపోయాడు.

ఒక్క దగ్గర కూర్చోవాలని లేదు. నిద్రకూడా పట్టడంలేదు. ఆలోచనలు తల పగిలిపోతోంది. ఆవేదన మనసు .... కుళ్ళిపోతోంది.

అతను రెండురోజులక్రితం ఆ భవనంలో అడుగు పెట్టాడు. పెళ్ళి కొడుక్కి ప్రాణమిత్రుడు. మగ పెళ్ళి వారి బంధు మిత్రుల్లో కొందరికి భవనం మూడో అంతస్తులో వసతి ఏర్పాటు చేయబడింది. వారిలో సుధాకర్ ఒకడు.

తన గదిలో కిటికీ దగ్గర నిల్చుని భవనానికి ఎదురుగా వున్న మర్రిచెట్టు కేసి తదేకంగా చూస్తున్నాడు సుధాకర్.

'తన కేవిధమైన లోటు లేదు . . . ఆస్తి లక్షల విలువ చేస్తుంది. అంద మైన, గుణవంతురాలైన భార్యా, ఆణి ముత్యాల్లాంటి ఇద్దరు పిల్లలూ వున్నారు. ఇంద్రభవనంలాంటి ఇల్లుంది .... తన ఫ్యాక్టరీలో అనేకమందికి ఉపాధి కల్పించాడు. అడిగినవారికి లేదనకుండా అంతో, ఇంతో ఆర్థిక సహాయం చేస్తు న్నాడు. దానధర్మాలు చేస్తున్నాడు . . . దైవభక్తి, పాపభీతీ వున్నాయి. అంతు లేని తృప్తి వుంది.... అన్నీ వున్నాయి. కాని ఒక్కటే లోపం... ఒక్క విష యంలో తప్ప తను మరి దేనికీ బాధ పడనవసరం లేదు....

తన అసలు తల్లితండ్రు లెవరు?.... ఎక్కడ వున్నారు?.... ఎన్నాళ్ళు – ఇంకా ఎన్నేళ్ళు? ఎంత కాలం తను ఇలా అన్వేషించాలి?... పరితపించాలి! నిరీక్షించాలి? వారి దర్శనం దొరికే వరకూ తనకి మనశ్శాంతి లేదు . . .

అయిదేళ్ళక్రితం– ఆస్తి పాస్తులన్నీ

అప్పగించేసి... తనని పెంచిన తండ్రి పోయాడు. రెండేళ్ళ క్రితం తల్లీ పోయింది. చివరి క్షణంలో ఆమె 'బాబూ నేను కూడా వెళ్ళిపోతున్నాను. నిన్నూ, నీ భార్యా బిడ్డలనీ కలకాలం ఆ దేవుడు చల్లగా చూడాలి. చూడు బాబూ... నిన్ను సక్రమంగా తీర్చి దిద్దడం కోసం కొన్నిసార్లు మేము నీ మనసు నొప్పించాము. అందుకు నువ్వు అన్యధా భావించకు. పిల్లలు అసలే కలగని మావంటి పాపాత్ములకు ఆ భగవంతుడు నిన్ను ప్రసాదించాడు. మేము నీ కన్న తల్లిదండ్రులం కాక పోయినా అంతకన్న అపురూపంగా పెంచామనే భావిస్తున్నాను. ఆశ్చర్య పడకు. ఆ రోజు అర్ధరాత్రి కంపార్ట్ మెంట్‌లో నువ్వు ఏడుస్తూ ..." అంటూ కన్ను మూసేసింది తన గుండెలు బ్రద్దలయ్యాయి. మనసు చిందరవంద రయింది. అప్పటినుంచీ దిగులు. అంతు లేని అన్వేషణ.

అయితే ఈ రోజు ఎందుకిలా వుందీ? తలవని తలంపుగా ఎందుకిలా దుఃఖం వచ్చేస్తోందీ?... ఏమిటి కారణం?....' భారంగా కదిలి భవనం లోంచి బయటపడి తారురోడ్డు మీదకి వచ్చి అటూ ఇటూ చూశాడు. తర్వాత మర్రిచెట్టు వేపు నడిచి అరుగుమీద ఓ వారకి కూర్చున్నాడు. టైము చూశాడు మూడు కావస్తోంది!

సిగరెట్ వెలిగించి నిదానంగా కాలుస్తూ, దీర్ఘాలోచనలో పడిపోయాడు సుధాకర్. నిమిషాలు దొర్లిపోతున్నాయి.

* * *

మర్రిచెట్టు మీద కాకులు ఎందుకో ఒక్కసారిగా గొల్లుమన్నాయి.

లారీ ఒకటి తారురోడ్డుమీద రొద చేసుకుంటూ శీఘ్రగమనంతో సాగి పోయింది.

అన్నపూర్ణమ్మకి నిద్రాభంగమైంది. కళ్ళు తెరిచి ఎడం చేతి వేపు చూసింది.

కుక్క తల విసురుతూ ఈగలు తోలుకుంటోంది.

కుడివేపు చూసింది అన్నపూర్ణమ్మ.

'ఎవరో ఇక్కడ కూర్చున్నారు.... పెళ్ళివారి తాలూకు కాబోలు' అనుకుంది. ఆకలి విపరీతంగా వుంది. ఏదైనా తినాలనే ఆదుర్దా పెచ్చుమీరుతోంది. నిగ్రహించుకోలేక పోయింది.

"బాబూ... ఇదుగో అబ్బాయ్" అంది నీరసంగా.

ఉలిక్కిపడి సుధాకర్ ఆమె వైపు చూశాడు. కన్నార్పకుండా కొద్ది క్షణాలు అలా చూస్తూ వుండిపోయాడు. ఏదో అనుబంధం, ఆత్మీయత పెనవేసుకో సాగింది. 'తనని పెంచిన తల్లి ఇలాగే పిలిచేది! అచ్చం ఇలాగే ప్రేమగా— ఆదరంగా—చల్లగా తన తల్లివుంటే ఇలాగే వుండాలి. కాని ఇలా వుండ

కూడదు. ఈ స్థితిలో ఆమెను తను చూడలేదు. ఆమెకు ఇటువంటి దుర్గతి పట్టకూడదు. తల్లీ, తండ్రీ కాని లేక ఇద్దరిలో ఏ ఒక్కరు కనిపించినా తనకి కొంత మనశ్శాంతి చిక్కుతుంది...."

"బాబూ! ఆకలి విపరీతంగా వుంది. నిన్నరాత్రి కూడా ఏం తినలేదు. కాస్త పుణ్యం కట్టుకో తండ్రీ. కళ్ళు తిరిగి పోతున్నాయి. ముసలి ప్రాణం కొట్టుకు పోతోంది. మాయదారి జ్వరం నాలుగు రోజులు పీడించి, మూడు రోజులక్రితం వదిలింది. జిహ్వ చచ్చిపోయింది. నీ చేత్తో రెండు మెతుకులు పడేస్తే తింటాను," అంది అన్నపూర్ణమ్మ దీనంగా.

సుధాకర్ గుండె తరుక్కుపోయింది. కళ్ళు చెమ్మగిల్లాయి. లేచి నిలబడి, ఆమెవంక జాలిగా చూశాడు. 'ఎలాగైనా ఈమెకి అన్నం తెచ్చిపెట్టాలి' అను కున్నాడు. రుమాలుతో కళ్ళు అద్దు కున్నాడు.

"కాస్త ఓపిక పట్టండి....లోపలికెళ్ళి అన్నం తెస్తాను," అంటూ నిష్క్ర మించాడు. పదిహేను నిమిషాల్లో తిరిగి వచ్చాడు సుధాకర్. అన్నపూర్ణమ్మ దగ్గర కూర్చుని తువ్వాలు మూటవిప్పి ఆమె ముందు పరిచాడు. ఆకుల పొట్లం విప్పాడు. "ఇవ్వన్నీ కడుపునిండా భోం చెయ్యండి" అన్నాడు ఆప్యాయంగా చూస్తూ.

అన్నపూర్ణమ్మ అదుర్దాగా విస్తరి లోకి చూసింది. పదార్థాలు ఘుమ ఘుమ లాడుతున్నాయి. అన్నీ ఆమె కిష్ట మైనవే, కోరుకున్నవే కనిపించాయి. ఆనందం పట్టలేకపోయింది. దుఃఖం పొంగి పొరలింది.

"మా నాయనే.. నా తండ్రే.... ఏ పుణ్యాత్ములు కన్నారో నిన్ను... బిడ్డా పాపలతో ఆయురారోగ్య ఐశ్వర్యాలతో చల్లగా బ్రతకాలి నువ్వు..." అంది కళ్ళు తుడుచుకుంటూ.

"మీరు బ్రాహ్మణులా ?..." అన్నాడు సుధాకర్ అనుమానం వచ్చి.

"అవును బాబూ... అదంతా ఇప్పుడు గుర్తుచెయ్యకు... మనసు ముక్కలవు తుంది మళ్ళీ..." అంటూ నీళ్ళసీసా అందుకుంది. అది ఎండిపోయి వుంది.

"నాయనా నీళ్ళు లేవు... ఎలా ?... కాస్త తెచ్చిపెట్టవా బాబూ. . నీకు చాలా శ్రమ కలిగిస్తున్నాను ..." అంది బిడియంగా.

"అయ్యో . . . మరిచిపోయాను... తెస్తానుండండి" అంటూ వడివడిగా వెళ్ళిపోయాడు సుధాకర్.

అన్నపూర్ణమ్మ మళ్ళీ విస్తరిలోకి చూసింది. నాలుగు బూరెలు తీసి సంచీలో పడేసింది ముష్టిపిల్లల కిద్దామనే వుద్దే శంతో. చెయ్యి తుడుచుకొని గబగబ పప్పూ అన్నం కలిపింది. ఆకు చింపి రెండు ముక్కలు చేసి, పప్పూ అన్నం










ముద్దలుచేసి ఆకుల్లో వేసింది. ఒక ఆకు పట్టుకొని ఒంగివడుస్తూ, అరుగు చివరకి వెళ్ళి కుక్కని పిలిచి కింద పడేసింది. మరొక ఆకును చెట్టువెనక పెట్టింది కాకుల కోసం.

తిరిగివచ్చి నీరసంగా విస్తరిముందు చతికిలబడింది. ఆకలికి తట్టుకోలేక అన్నంలో పనసకాయకూర కలిపింది. అన్నం పొడిగా వుంది, మెతుకులు మేకుల్లా వున్నాయి. కలిపిన అన్నం చేతివిండా తీసుకొని ఆవురావురంటూ నోట్లో పెట్టుకుంది. వెంటనే మరికొంత కుక్కుకొని, మళ్ళీ చేతివిండా అన్నం పట్టుకుంది. మింగిన ముద్ద మింగుడు పడడంలేదు. ఎడంచేత్తో గుండెలమీద గొంతుమీదా రాసుకుంది. తల మీద కొట్టుకుంది. అడ్డంగా పడిన ముద్ద లోనికి జారడంలేదు. బయటకి రావడం లేదు. ఊపిరి సలపడంలేదు. కళ్ళల్లోంచి నీళ్ళొచ్చేస్తున్నాయి. నవనాడులూ లాగేస్తున్నాయి. ఉక్కిరి బిక్కిరవుతూ భవనం గేటుకేసి చూసింది.

వడగాలి విసిరి కొట్టింది. ధూళి విస్తారంగా రేగింది. అరుగుమీద కల్లోలం చెలరేగింది. గిలగిల కొట్టుకుంటోంది అన్నపూర్ణమ్మ. 'నేను చచ్చిపోతానా ?

నేను చచ్చి... పోతానా?' అనుకుంది భయంగా. ఎదురుచూసిన క్షణం దగ్గిర పడిందేమో అనే ఆలోచన వచ్చేసరికి భయంతో గుండె బ్రద్ధలయింది. 'అయ్యయ్యో ... శ్వాస రావడంలేదు... చచ్చిపోతున్నాను...చచ్చిపోతున్నాను... నారాయణ....నా రా య ణ.'

నీళ్ళ చెంబుతో తిరిగి వచ్చాడు సుధాకర్. అతని వెంట నలుగురు పిల్లలు కూడా వచ్చారు అరుగు దగ్గరకు.

అరుగుమీద దృశ్యం చూసి నిర్ఘాంత పోయాడు సుధాకర్. నీళ్ళచెంబు జారి పడింది. నీళ్ళు నేలలో ఇంకిపోయాయి. విస్తరి దగ్గర వెల్లకిలా పడివుంది అన్నపూర్ణమ్మ! ఆమె చేతిలో అన్నం అలాగే వుంది! ఆమె కళ్ళు విస్తరికేసి చూస్తున్నట్టుగా వున్నాయి! ఆమెలో చలనం లేదు! విస్తరిలో అన్నాన్ని కుక్క తినేస్తోంది. దూర దూరంగా కాకులు వాలి, అన్నపూర్ణమ్మ చేతిలోని అన్నాన్ని అందుకోవడానికి చిందులేస్తున్నాయి.

పిల్లలు బెదిరి, భవనంలోకి పారిపోయారు. సుధాకర్ దృష్టి అన్నపూర్ణమ్మ దేహంమీద నిలిచిపోయింది. కళ్ళలో నీటిపొరలు కమ్ముకుంటున్నాయి. కబురు తెలిసి భవనం యజమాని నాగరాజు, మరికొందరూ హడావుడిగా వచ్చి రోడ్డుమీద నిలబడ్డారు.

రోడ్డు దిగి కాస్త ముందుకువెళ్ళి నడుంమీద చేతులుంచుకొని నిల్చొని అరుగువేపు చూశాడు నాగరాజు.

ఆకులోని అన్నమంతా తినేసి, మనుషుల్ని చూసి గబగబ అరుగు దిగిపోయింది కుక్క, అన్నపూర్ణమ్మ చేతిలోని అన్నాన్ని అందుకోగలిగాయి కాకులు. బెదురు బెదురుగా వెళ్ళి, అందినంత అన్నాన్ని ముక్కులతో తీసుకొని, దూరంగా పోయి తింటున్నాయి. అక్కడ పడివున్నది అన్నపూర్ణమ్మని గుర్తించాడు నాగరాజు. క్షణకాలం మనసు గిలగిలలాడింది. 'అమ్మ... అమ్మ' అనుకున్నాడు. అంతలోనే మనసు శిలగా మారింది...'కాదుకాదు... అన్నపూర్ణమ్మ' అనుకున్నాడు. ముఖం జేవురించింది. కళ్ళు ఎర్రబారాయి. 'చచ్చిన తర్వాత కూడా నీ చేతిలోని అన్నాన్ని మూగ జీవాలకి తినిపిస్తున్నావే!' అనుకున్నాడు కసిగా.

"దానికి అన్నం ఎవరు పెట్టారు?" అన్నాడు నొసలు చిట్లించి సుధాకర్ వంక అనుమానంగా చూస్తూ నాగరాజు.

"నేనే." అనేసి మళ్ళీ అన్నపూర్ణమ్మ దేహంకేసి దిగులుగా చూస్తూండిపోయాడు సుధాకర్. అతని కుడి చెవి వెనక చింత పిక్కంత పుట్టుమచ్చ అదే రంగులో వుంది. అప్రయత్నంగా నాగరాజు దృష్టి దానిమీద పడింది.

'వాడే వీడు! దివాకర్‌గాడు!!....ఆ ముఖంలో అన్నపూర్ణమ్మ పోలికలు! ఆ విగ్రహం చక్రవర్తిది! నిశ్చయంగా వీడు దివాకర్‌గాడే! తనింతవరకూ హడావిడిలో గమనించలేదు ఆ రోజు ఈ వెధవని తప్పించేయబట్టి క్రమేణా తన బాట సుగమమైంది. ఈనాడు తను ఉచ్ఛస్థితిలో వుండ గలిగాడు. లేకపోతే డబ్బంతా దాన ధర్మాల కోసం తగలబడి పోయేది! తను కూడా దౌర్భాగ్య జీవితం గడిపి, దీనిలాగే దిక్కుమాలిన చావు చావవలసి వచ్చేది! వీడికీ అలాంటి పోయేకాలం బుద్ధులే అలవడి నట్టున్నాయి. అందుకే దానికి అన్నం వేశాడు వెధవ...' పళ్ళు కొరు క్కున్నాడు నాగరాజు.

మరుక్షణంలో -

"ఒరే వెంకన్నా వెళ్ళి ప్రేమ సమాజంవాళ్ళకి చెప్పు — దీన్నిక్కడ్నుంచి తొందరగా తీయించు. శుభమా అంటూ పిల్లకి పెళ్ళి చేసుకుంటూంటే గుమ్మాని కెదురుగా వచ్చి మరీ చచ్చింది దౌర్భాగ్యురాలు. వెళ్ళు త్వరగా" బిగ్గరగా అరిచి వడివడిగా వెళ్ళిపోయాడు నాగరాజు. తలో మాటా అంటూ మిగిలిన వాళ్ళు అతన్ని అనుసరించారు.

అక్కడ సుధాకర్, నౌఖరు వెంకన్నా మిగిలారు.

"ఏమయిందో పాపం. పెట్టిన అన్నం తినకుండానే పోయింది... ప్చ్...!" అంటూ అడుగు ముందుకేశాడు వెంకన్న.

"ఆగు వెంకన్నా... ఈమె దేహాన్ని సమాజం వాళ్ళకి అప్పగించొద్దు... అంత్యక్రియలు నేను జరిపిస్తాను. తల కొరివి నేను పెడతాను. నా కెందుకో అవన్నీ చెయ్యాలనిపిస్తోంది! ఎంత ఖర్చయినా ఫరవాలేదు. ఏర్పాట్లు ఘనంగా చేయించు." గంభీరంగా అని, కళ్ళు తుడుచుకొని, జేబులోంచి డబ్బు తీసి ఇచ్చాడు సుధాకర్.

ఆశ్చర్యంగా చూస్తూ డబ్బందుకున్నాడు వెంకన్న.

"అలాగే బాబూ అలాగే... తప్పకుండా చేస్తాను. నేను కూడా తమకి సాయం చేస్తాను...ఈ తల్లిని చూస్తుంటే నా గుండె తరుక్కుపోతోంది." అంటూ అన్నపూర్ణమ్మ కేసి చూశాడు వెంకన్న చెమ్మగిల్లిన కళ్ళతో.

అన్నపూర్ణమ్మ చేతి వేళ్ళ సందుల్లో ఇరుక్కుపోయిన మెతుకుల్ని కాకి ఏరుకుంటోంది! ఆ చెయ్యి కొద్దికొద్దిగా చలిస్తూ దానికి అన్నం తినిపిస్తున్నట్టుగా కనిపిస్తోంది!

అది ధర్మం చేసిన చెయ్యి!

———

సి.యస్.రావు సీరియల్

# కాంచన కుటీరం



ఆరోజు రాత్రి బయటి వాతావరణం కాస్త చలిగా వుంది చైతన్య తన గదిలో ఫైర్ ప్లేస్ పక్కన వాలు కుర్చీలో కూర్చుని విస్కీ తాగుతూ పైప్ పీలుస్తున్నాడు. ఏదో పుస్తకం అతని చేతిలో వుందిగానీ, మనస్సు దానిమీదకు పోవడంలేదు. అనుకోకుండా ఎన్నాళ్ళనుంచో కల్సుకోవాలని ఎదురు చూస్తోన్న క్రాంతిని కలవడం చైతన్య కేదో వింత అనుభూతినిచ్చింది. దాదాపు ఇరవై ఏడు సంవత్సరాల క్రితం తన వదినగారు స్రవంతి చేత చెంపదెబ్బ తిని కాంచనకుటీరం నుంచి బయటి కొచ్చాడు. తనదీ అనుకున్న స్రవంతి

తన అన్న భార్యకావడంతో మనిషి తల్లక్రిందులై తాగుడికీ తిరుగుడికీ అలవాటుపడ్డాడు. మత్తెక్కిన తుమ్మెదలా జీవితాన్ని గడిపాడు. కాంచన కుటీరం వదిలి వచ్చాక కూడా కొంత కాలం అలాగే జీవితాన్ని వింత రంగుల విన్యాసంగా గడిపాడు అట్లాంటి పరిస్థితిలో దివాన్జీ చైతన్యను వెతికి పట్టుకొని కాంచన కుటీరం తాలూకు వూటీలో ఎస్టేట్ ఉండడంతో అక్కడ పెట్టాడు. ఉండటానికి కావల్సిన ఏర్పాట్లన్నీ చేశాడు. ఆ తర్వాత శ్రావణిని వెతికి తెచ్చి చైతన్యకు అప్పగించాడు. కల్యాణిని కూడా తెచ్చి శ్రావణికీ, చైతన్యకూ అప్పగించాడు.

కాంచన కుటీరం మూలంగా దెబ్బ తిన్న చైతన్యనూ, శ్రావణినీ, కల్యాణినీ ఒక చోటుకుచేర్చి ఆశ్రయం కల్పించినా- ఆ విషయం రాజా రాజశేఖరానికిగానీ, స్రవంతికిగానీ కాంచన కుటీరంలోని మరెవ్వరికిగానీ తెలియనివ్వలేదు దివాన్జీ. ఎందుకింత బాధ్యత దివాన్జీ నెత్తిన వేసుకున్నాడో ఎంత ఆలోచించినా చైతన్యకు అంతుబట్టడంలేదు.

ఇన్నేళ్ళ తర్వాత తన అన్న కొడుకు క్రాంతీ, తనూ కలవడం, క్రాంతి భారతిని ప్రేమించడం, వాళ్ళ ప్రేమ ఫలించడం కోసం తనని తిరిగి కాంచన కుటీరానికి వెళ్ళి వదిన స్రవంతితో మాట్లాడమని దివాన్జీ సలహా యివ్వడం తలుచుకుంటే అంతా చిత్రంగా వుంది చైతన్యకు. భూమిలాగే జీవితం కూడా గుండ్రమని పించింది అతనికి.

అలా గతం నుంచి ప్రస్తుతానికి ఆలోచనల విచ్చెనమీద ఎగబాకుతూ మరో పెగ్గు విస్కీ పోసుకున్నాడు గ్లాసులో.

"నిద్రపోలేదా చైతన్య బాబూ!" అంటూ దివాన్జీ వచ్చాడు.

"రావడంలేదు."

"కార్యభారం నెత్తిన పెట్టుకున్నప్పుడు నిద్రరాదు మరి."

"ఎటువంటి భారాన్నయినా భరించగల పెద్దలు మీరుండగా నాకేం భయంలేదు దివాన్జీ. కాకపోతే కాంచన కుటీరానికి తిరిగి వెళ్ళాలంటే మనస్కరించడంలేదు. మా వదినగారితో మీరే మాట్లాడొచ్చుగా."

"మాట్లాడ కూడదని కాదు బాబూ! మాట్లాడినా ప్రయోజనం వుండదేమోనని అనుమానం."

"తన కొడుకు సుఖాన్నే కావంటుం దంటారా?"

"అనవచ్చునని నా నమ్మకం. ఎందు కంటే - ఒక సామాన్య కుటుంబంలోంచి కాంచన కుటీరానికి కోడలిగా వచ్చిం దామె అలా రావడంవల్ల ఏం పోగొట్టుకుందో మీకూ తెలుసు; నాకూ తెలుసు అటువంటి స్థితిలో నాన్నగారు ఆమె చేతికి తాళాలిచ్చారు. పెత్తనం అప్పజెప్పారు. ఆ నాటినుంచీ ఆమె

గుండె రాయి చేసుకొని కాంచన కుటీరం పరువు ప్రతిష్ఠలకోసం మనిషి రూపంలో వున్న మరబొమ్మలా బ్రతుకుతోంది. ఇప్పుడు ఆ వంశానికి వారసుడైన క్రాంతి భారతిలాంటి పిల్లను ప్రేమించాను, పెళ్ళి చేసుకుంటాను అంటే ఆమె తప్పకుండా తిరస్కరిస్తుందని నా నమ్మకం. మనిషి నెత్తురు తాగమరిగిన పులి శాఖాహారం ముట్టదు గదా బాబూ!" అంటూ తన మనస్సులోని మాటల్ని వివరించాడు రాఘవయ్య. ఆ వివరణలో కాంచన కుటీరానికి వెళ్ళి చైతన్య స్రవంతితో మాట్లాడక తప్పదన్న ధ్వని కూడా ఉంది.

పౌరుషంగల చైతన్య తన మనస్సుకు తాను ఎంత నచ్చజెప్పుకున్నా, ఎందుకనో స్రవంతి కంటబడటానికి అంగీకరించలేకపోతున్నాడు. కాని భారతి మొహంచూస్తే వెళ్ళక తప్పదని పిస్తుంది.

* * *

అ మరుసటి రోజున దివాన్జీ సలహా ప్రకారం చైతన్య కాంచన కుటీరానికి బయల్దేరాడు.

దివాన్జీ, క్రాంతి పూటీలోనే ఉన్నారు. దివాన్జీ అలాంటి ఏర్పాటు చేయడానికి కారణం చైతన్యా స్రవంతీ ముఖాముఖీ మాట్లాడుకొనే అవకాశం కల్పించడానికే.

చైతన్య కారు కాంచన కుటీరం పోర్టికోలో ఆగింది. చైతన్య కారు దిగి కాంచన కుటీరం హాలులో ఇరవై ఏడు సంవత్సరాల తర్వాత అడుగుపెట్టాడు. కారు చప్పుడు విన్న రాజీఅయా అప్పటికే హాలులోకి వచ్చింది. హాలులో నిలబడిన చైతన్యని చూసి క్షణంలో గుర్తు పట్టింది. తల నెరిసి పండులా వున్న రాజీ అయాను చైతన్య కూడా గుర్తుపట్టాడు.

రాముడ్ని చూసిన శబరిలా రాజీ అయా తాను పెంచి పెద్దచేసిన చైతన్య చూసి ఉబ్బి తబ్బిబ్బు అయిపోయింది. పెంచిన మమకారం అలాంటిది. ముందుగానే అతని రాక తెలిస్తే ఏమేమి ఏర్పాట్లు చేసి వుండేదో! అనుకోకుండా అతను రావడంతో కలలాంటి నిజం కళ్ళ ముందు కనబడటంతో శ్రీరాముని ఆగమనాన్ని గురించి చుట్టూ వున్న పూలకు, ఆకులకు, మొక్కలకు శబరి చెప్పుతున్నట్టు రాజీ అయా కాంచన కుటీరంలోని ప్రతి వస్తువుకూ, ప్రతి మనిషికీ, 'చైతన్య బాబు వచ్చాడు, చైతన్య బాబు వచ్చాడు' అని గెంతుతూ అరుస్తూ, వెర్రి ఆనందంతో చాటించింది.

నౌకర్లందరూ బయటికొచ్చారు.

ఎన్నో ఏళ్ళక్రితం తప్పిపోయిన బిడ్డ తిరిగి ఇంటికొచ్చినంతగా ఆనందించింది కాంచన కుటీరం పరివారం.

ఆ అలజడికి స్రవంతి తన గదిలోంచి బయటికొచ్చి మేడమెట్లమీదనే నిలబడి, వచ్చిన చైతన్యనూ, పరివారం యొక్క

ఆనందాన్ని ఒక్క క్షణం గమనించింది. చైతన్య ఆమెనూ చూశాడు. తప్పుచేసిన దానిలా తలవంచుకుంది ప్రవంతి మరుక్షణంలోనే తన ఠీవినీ, హోదానూ పుంజుకుని "చిన్న జమీందారుగారి సామాను వారి గదిలో పెట్టించు రాజీ ఆయా! కావల్సిన ఏర్పాట్లన్నీ జాగ్రత్తగా చూసుకోండి." అని పనివారిని ఆదేశించి, తిరిగి తన గదిలోకి వెళ్ళిపోయింది ప్రవంతి

ఆ క్షణాన తన వదినగారు ప్రవంతిలో తన తండ్రి రాజా రాజశేఖరంగారిలో వుండే హుందాను, ఠీవినీ చూశాడు చైతన్య. ఒకనాడు తన కారు ఎక్కమంటే ఎక్కనన్న కాలేజీ రోజుల్లోని ప్రవంతికీ ఈనాటి ప్రవంతికీ నక్కకూ, నాగలోకానికి వున్నంత తేడా కనిపించింది చైతన్యకు. దివాన్జీ చెప్పిన మాట నిజమే అనుకున్నాడు. తాను వచ్చిన పని ఆమెకు ఎలా వివరించాలా అన్న ఆలోచనలో పడ్డాడు.

"పైకి పదండి బాబూ!" అంటూ రాజీఆయా చైతన్య గదికి దారితీసింది.

చైతన్య తన గదిలోకి అడుగుపెట్టి గదినంతా కలియజూశాడు. గది శుభ్రంగానే వుంది గానీ తాను కాంచన కుటీరాన్ని వొదిలి వెళ్ళబోయేముందు ఆ గదిలోని వస్తువులన్నీ ఎక్కడున్నాయో అక్కడే వున్నాయి. తాను వెళ్ళంతర్వాత ఆ గది నెవ్వరూ వినియోగించలేదను కున్నాడు. తన జ్ఞాపకంగా ఆ గదిని భద్రంగా వుంచారనుకున్నాడు. గది వెనుకవున్న నత్తగుల్ల మెట్ల వైపు వెళ్ళాడు. కొంచెంసేపు వరండాలో నిలబడి ఆ ప్రక్కంతా కలియజూశాడు. ఎక్కడా ఏదీ మార్పులేదు. ఈలోగా రాజీ ఆయా నౌకర్లచేత గదిని సర్దించింది. కాఫీ తెప్పించి యిచ్చింది.

నౌకర్లూ, రాజీ ఆయా బయటకు వెళ్ళిపోయారు.

చైతన్య తన గదిలో ఒంటరిగా వున్నాడు. తాను మాట్లాడాల్సిన పని వుందని ప్రవంతికి కబురు పెడదామను కున్నాడు. మళ్ళీ తొందరపడడం దేనికి లెమ్మని అనుకున్నాడు. ఇన్నేళ్ళతర్వాత వచ్చిన తనని ఆమె తప్పకుండా పలకరిస్తుంది, అప్పుడే మాట్లాడవచ్చు ననుకున్నాడు.

ఇంతలో రాజీఆయా తిరిగి అతని గదిలోకి వచ్చింది. ఆమె చేతిలోని తాళాల గుత్తిని అతని ముందున్న టీపాయ్ మీద వుంచుతూ— "ఇవన్నీబీ తాళాలు బాబూ! అమ్మాజీ మీకిమ్మన్నారు." అని చెప్పింది.

"ఈ తాళాలతో నాకిప్పుడేం పని లేదు. వదినగారితో నేనో ముఖ్యమైన విషయం మాట్లాడాలి. ఎప్పుడు పిలవు తుందో కనుక్కొని చెప్పు." అన్నాడు చైతన్య.

"సరే బాబూ!" అని చెప్పి రాజీ అయ్యా స్రవంతి గదికెళ్ళింది.

ఇన్నేళ్ళ తర్వాత తాను వచ్చినా మాటల్లో ఆదరణ అంతగా కనబర్చక పోయినా చేతల్లో స్రవంతి చూపుతున్న ఆదరణకు ఆమెపట్ల గౌరవం పెరిగింది చైతన్యకు. కాని ఇంతకూ తాను వచ్చిన పని ఏమౌతుందోనన్న మీమాంస మనసును పీకుతూనే ఉంది.

* * *

ఆరోజు సాయంత్రం ఆరుబైట లాన్‌లో స్రవంతి కూర్చుని చైతన్యకు కబురుచేసింది.

చైతన్య వచ్చాడు

ఆమెను ఎలా పలకరించాలో, ఏమని సంబోధించాలో అతనికి అర్థంకాలేదు.

అతను రాగానే "రండి చైతన్యా! కూర్చోండి," అంటూ తాను లేచి కుర్చీ చూపించింది స్రవంతి.

చైతన్య కూర్చున్నాడు. సూటిగా ఆమెమొహంలోకిచూడలేకపోతున్నాడు. తాను తన అన్న రాజేష్ పోయినప్పుడు రాలేదు; తండ్రిపోయినప్పుడు రాలేదు. కాంచన కుటీరంలో జరిగిన ప్రతి సంఘటనా అతనికి తెలుసు. రాఘవయ్య ఎప్పటికప్పుడు అన్ని విషయాలూ తనకు తెలియపరుస్తూనే ఉన్నాడు. అయినా తాను పెంచుకున్న పట్టుదలా, ఒక ఆడదానిచేత చెంపదెబ్బ తినడంతో దెబ్బ తిన్న అహమూ అతన్ని కాంచన కుటీరానికి రానివ్వలేదు. తాను లేకపోయినా మొగదిక్కులేని లోటును కనబడనివ్వకుండా ఇన్నేళ్ళూ స్రవంతి క్రాంతిని పెంచుతూ కాంచన కుటీరం గౌరవ ప్రతిష్ఠల్ని కంటికి రెప్పలా కాచుకుంటూ ఆమె బాధ్యత ఆమె నిర్వర్తించింది. అందుకనే ఆమె ముందు తలెత్తి మాట్లాడలేకపోతున్నాడు.

"టీ తీసుకోండి చైతన్య బాబూ!" అంటూ టీ కప్పు అందించింది.

చైతన్య ఆ కప్పు అందుకున్నాడు. నెమ్మదిగా సిప్‌చేస్తున్నాడు.

"ఏదో ముఖ్యమైన విషయం మాట్లాడాలన్నారట!" అంది స్రవంతి.

"అవును"

"మీ జాడ తెలియక క్రాంతి మేజరైన తర్వాత ఎదిగిన మగవాళ్ళ వుండగా ఆడదాని పెత్తనమేమిటని పదిమంది పెద్దల ముందూ పెత్తనం క్రాంతికి అప్పగించాను. నా లోటులేదు. దివాన్జీకి ఎప్పటికప్పుడు మీ జాడ తెలుసుకోమని జ్ఞాపకం చేస్తూనే ఉన్నాను. ఇన్నాళ్ళకు మీ అంతట మీరే వచ్చారు. క్రాంతినీ కాంచనకుటీరాన్ని ఇహ మీరు జాగ్రత్తగా చూసుకుంటే నేను కాస్త విశ్రాంతి తీసుకోవచ్చు." అని గతాన్ని గురించి క్లుప్తంగా వివరించింది స్రవంతి. అది ఒక విధమైన సంజాయిషీ.

ఆమె చెప్పిందంతా విని కూడా చైతన్య ఏమీ మాట్లాడలేదు.

"మీ రొక్కరే వచ్చారేమిటి? మా చెల్లెల్నీ పిల్లల్నీ తీసుకురాలేదేం?" అని అర్థయుక్తంగా అతన్ని గురించి తెలుసుకోవాలని అడిగింది.

"నేను ఈనాటికీ ఒంటరివాడ్ని. ఏనాటికీ ఒంటరిగానే వుండాలనుకుంటున్నాను."

ఆ మాట వినగానే స్రవంతి మనస్సు చివుక్కుమంది. అనుకోకుండా కళ్ళ నీళ్ళు తిరిగాయి. ఒకనాడు చైతన్య తనను ప్రేమించిన పాపానికి మిగిలిన శాపమేమో ఈ ఒంటరితనం అతనికి అనుకుంది. ఒక క్షణం ఏమీ మాట్లాడలేకపోయింది.

"నా కారణంగా మీ జీవితం ఇలా అవుతుందని అనుకోలేదు."

"నా అన్నవాళ్ళు లేనివాళ్ళకు చాల మంది వుంటారు."

"అయితే మీరు ఇప్పటికీ ఆ పాత జీవితాన్ని వొదిలిపెట్టలేదన్నమాట."

చైతన్య నవ్వాడు.

"కొండలమీద నుంచి జాలువారేటప్పుడే సెలయేర్లు విచ్చలవిడిగా పరుగులుదీస్తాయి. నదిలోకిప్రవహించిన తర్వాత కట్టల మధ్య గంభీరంగానే ప్రవహిస్తాయి. ఆ పాత జీవితం ఎప్పుడో ముగిసిపోయింది."

"పోనీలెండి. ఓ చల్లని మాట చెప్పారు. ఇహనుంచైనా కాంచన కుటీరాన్ని వొదిలి వెళ్ళకుండా, వారి బాధ్యత మీరు నిర్వహించండి."

"ఇక్కడి బాధ్యతలు నిర్వహించడానికి రాలేదు వొదినగారూ!"

"ఈ పిలుపు నీ నోట వింటానని కలలోకూడా అనుకోలేదు. ఇన్నాళ్ళకు విన్నాను. క్రాంతి నన్ను 'అమ్మ' అని పిలిచినంత ఆనందంగా వుంది. చెప్పండి. మీరుగాక ఎవరు స్వీకరిస్తారు ఈ బాధ్యత మీరు వచ్చాక కూడా."

"నా బాధ్యతలు నాకున్నాయి, నేను ఒంటరివాడ్నే అయినా.నన్నే నమ్ముకున్న వాళ్ళు కొంతమంది వున్నారు. నిజానికి వాళ్ళు మనందరికీ అయినవాళ్ళే అయినా మీ అందరికీ కానివాళ్ళు నాకు మాత్రమే అయినవాళ్ళుగా మిగిలిపోయినవాళ్ళు"

"మీరు చెప్పేది నాకర్థంకావడంలేదు. మీవాళ్ళు మనవాళ్ళు కాకుండా ఎలా వుంటారు? మీరు ఎవరినైనా పోషించవచ్చు. మీ మాట కెదురేముంది ఈ ఇంట్లో."

"వాళ్ళకు కావల్సింది పోషణకాదు. ఆదరణ. అభిమానం. గుర్తింపు. బంధం. కల్యాణి అని నాకొక చెల్లెలుంది. ఆమె కూతురు పేరు భారతి. ఆమె నా మేనకోడలు. ఆమె క్రాంతిని ప్రేమించింది. క్రాంతి ఆమెనూ ప్రేమించాడు. ఆ విషయమై మీ అంగీకారాన్ని కోరడాని కొచ్చాను," అని వచ్చినపని చెప్పాడు చైతన్య.

"కల్యాణి మీ ఒక్కరికేనా చెల్లెలు. లేక మీ అన్నగారికేనా చెల్లెలు? అని వ్యంగ్యంగా అడిగింది స్రవంతి.

"అదేం ప్రశ్న. నా చెల్లెలు మా అన్నగారికి చెల్లెలు కాదా? కల్యాణిని నేను చూడకపోయినా కల్యాణి గురించి విన్నాను. కల్యాణి చిత్రపటాన్ని నేను చూస్తూనేవున్నాను. మీరు ఆమెను చెల్లెలిగా భావించినా మీ అన్నగారు ఆమెను చెల్లెలిగా భావించలేదని నా నమ్మకం."

"మా అన్న ఆమెను చెల్లెలిగా భావించడం అతని తప్పు కాదు. కల్యాణి మా చెల్లెలూ అని చెప్పకపోవడం మా నాన్న చేసిన తప్పు. ఏది ఏమైనా కల్యాణి మమ్మల్ని ఇద్దరినీ అన్నలుగా నే చూసుకుంది."

"ఆమె చూసుకోవచ్చు. మీ నాన్న గారు కల్యాణి మీ చెల్లెలేనని ఎందుకు చెప్పలేదు."

"శ్రావణికీ అయనకూవున్న అక్రమ సంబంధం కారణంగా కల్యాణి పుట్టడం చేత చెప్పలేదనుకుంటాను."

ఆ సమాధానికి స్రవంతి నవ్వింది.

"అలాంటి అక్రమ సంబంధం కారణంగా పుట్టిన కల్యాణి కూతుర్ని క్రాంతి పెళ్ళాడటానికి నేను అంగీకరించ లేను. ఇంత ఉన్నత వంశానికి వారసుడు ఈ కాంచన కుటీరం పరువు ప్రతిష్ఠల్ని నిలబెట్టవలసిన బాధ్యుడూ అయిన క్రాంతి జన్మతహః కళంకంతో పుట్టిన ఒక తల్లి బిడ్డను పెళ్ళడటానికి వీల్లేదు. మీరు ఈ ఇంటినుంచి ఏనాడో వెళ్ళిపోయారు ఆ నాటి నుంచీ మామగారు నా కప్పగించిన ఈ వంశ ప్రతిష్ఠనూ, గౌరవాన్నీ కంటికి రెప్పలా కాచుకుంటూ వచ్చాను. నా బాధ్యతను నేను నిర్వర్తించడంలో నన్ను నేను మర్చిపోయాను. నా పుట్టింటికి దూరమయ్యాను. నా కొర్కెలను చంపు కున్నాను. బాధ్యతా నిర్వహణకోసమే పుట్టినట్టు బ్రతికాను. ఈనాడు ఏ వంశ ప్రతిష్ఠకోసమూ నేను ఇన్నాళ్ళూ ఇలా జీవించానో ఆ వంశ ప్రతిష్ఠనే నా కొడుకూ ఈ వంశానికి వారసుడూఅయిన క్రాంతి భారతిని కట్టుకోవడం మూలంగా మంటగలపడానికి నే నొప్పుకోను" అని చైతన్య మారు మాట చెప్పడానికి అవకాశమివ్వకుండా అక్కడ నుంచి లేచి లోపలకు వెళ్ళిపోయింది స్రవంతి.

పరువూ ప్రతిష్ఠల మత్తులో మానవత్వపు విలువలనే మర్చిపోయి మట్టిబొమ్మలా బతికే స్రవంతికి ఎలా నచ్చజెప్పాలో చైతన్యకు అర్థంకాలేదు. ఆమె అలా చివాలునలేచి వెళ్ళిపోవడం అతనికి సభ్యత అనిపించలేదు. అతని మనస్సు నొచ్చుకుంది. మరుక్షణంలోనే అతను కాంచన కుటీరాన్ని వొదిలి పూటీకి బయలుదేరాడు.

ప్రయాణంలో చైతన్య మనసు పరి పరివిధాలపోయింది. తన ప్రేమవిఫలమైం

తర్వాత తాను కాంచన కుటీరాన్ని వదిలే కాడు. అనాటి నుంచి యీనాటి వరకూ ఏ సమస్యలూ లేకుండా నిశ్చింతగా బ్రతికాడు ఇప్పుడు తాను పెంచి పెద్ద చేసిన భారతి పెళ్ళి ఒక పెద్ద సమస్య అయింది భారతి మాట తాను ఎన్నడూ కాదనలేదు. ఆమె కోరుకున్నట్టు క్రాంతితో ఆమె పెళ్ళి జరగకపోతే భారతి చాల బాధపడుతుంది. ఆమె బాధ పడటం అతను సహించలేడు. సమస్యకు పరిష్కారమేమిటో అర్థంగాని స్థితిలో వూటీకి చేరుకున్నాడు చైతన్య.

దివాన్జీ క్రాంతి, భారతీ ఇంట్లో అందరూ అతను తెచ్చే శుభవార్తకోసం ఎదురుచూస్తున్నారు. కాని చైతన్య చాల గంభీరంగా అగుపించాడు. తన కోసం ఎదురుచూస్తున్న ఎవ్వర్నీ పలకరించకుండా అతను సరాసరి మేడ మీదున్న తన గదిలోకి వెళ్ళిపోయాడు. అతనికి మనఃస్థిమితం లేదు. గ్లాసులో ఓ పెగ్గు విస్కీ పోసుకుని సిప్‌చేస్తూ బోనులోని సింహంలా ఇటూ అటూ పచార్లు చేస్తున్నాడు. ముఖ్యంగా తన కళ్ళముందు అల్లారుముద్దుగా పెరిగిన భారతి కోర్కెను తీర్చలేకపోతున్నాననే బాధ అతన్ని వేధిస్తోంది.

చైతన్య ముఖకవళికలను బట్టి, ప్రవర్తనను బట్టి దివాన్జీ రాఘవయ్య చైతన్య వెళ్ళిన పని బెడిసికొట్టిందని గ్రహించాడు. కార్యదక్షత, నేర్పు, ఓర్పు గల మనిషి కాబట్టి ఎక్కడా చలించ లేదు రాఘవయ్య. అతని మనస్సులోని పట్టుదల కూడా చైతన్య మనస్సులోని పట్టుదలలాంటిదే. ఏ విధంగానైనా కాంచన కుటీరంవల్ల అన్యాయం జరిగిన వాళ్ళకు న్యాయాన్ని చేకూర్చాలన్నదే రాఘవయ్య దీక్ష. అతనికి లేనిది స్వార్థం, ఉన్నది త్యాగం. తెలిసింది అనుకున్నది సాధించడం. తెలియనిది ఓటమి.

రాఘవయ్య వెళ్ళి చైతన్యను కలిశాడు. ఇద్దరూ చాలాసేపు మాట్లాడుకున్నారు. జరిగిన సంగతంతా చైతన్య రాఘవయ్యకు వివరించాడు. స్రవంతి పట్టుదలను అసహ్యించుకున్నాడు

"ఆమె పట్టుదల నాకు తెలియడం చేతనే స్వయంగా మిమ్మల్నే వెళ్ళమన్నాను." అన్నాడు రాఘవయ్య.

"నేను వెళ్ళకుండా వుంటేనే బావుండేది" అన్నాడు కాస్త బాధగా చైతన్య.

"అలా ఎందు కనుకోవాలి? దాదాపు ఇరవై ఏడేళ్ళ తర్వాత మీరు కాంచన కుటీరంలోకి అడుగుపెట్టి కోరకకోరక ఒక చిన్నకోరిక స్రవంతిదేవిని కోరారు. ఆమె కాదన్నారు. కాదని అన్నారే కాని మిమ్మల్ని కాదన్నాననే బాధతో ఆమె కూడా మనశ్శాంతిలేకుండా పరితపిస్తూనే వుంటారు. ఎందుకనో మనందరం అవునన్నా కాదన్నా, జరగాల్సింది జరక్క

మానదనే నమ్మకం నాకున్నది," అన్నాడు రాఘవయ్య.

"అనుకున్న పని జరగనప్పుడు ప్రతి మనిషీ చెప్పే వేదాంతమే ఇది దివాన్జీ!"

"ఈ విషయం గురించి మీరింక ఆలోచించకండి. నేను చెబుతానుగా," అని దివాన్జీ మేడదిగి కింది కొచ్చేశాడు.

క్రాంతిని పిల్చి "బాబూ! నువ్వు చదువుకున్న వాడివి. లోకజ్ఞానం తెల్సిన వాడివి. కొన్ని సమస్యలు పెద్దవాళ్ళం పరిష్కరించడంకంటె పిన్నలే సవ్యంగా పరిష్కరించుకో గలరని నా నమ్మకం. నాకోసం అమ్మాజీ ఎదురు చూస్తూ వుంటారు. ఇహ నేను కాంచన కుటీరానికి బయలుదేరుతున్నాను." అని అందరి దగ్గరా సెలవు తీసుకొని భారతిని మనసారా ఆహ్వానించి వెళ్ళిపోయాడు.

ఆ తర్వాత క్రాంతి ఎంతో చనువుగా శ్రావణితోటీ, తన పినతండ్రి చైతన్యతోటీ చాలా విషయాలు మాట్లాడాడు. దివాన్జీ ద్వారా తన తాతముత్తాతల గురించీ, కాంచన కుటీరం గురించీ వినని కొన్ని విషయాలు శ్రావణి ద్వారా విన్నాడు. ఆ క్షణంనుంచీ దివాన్జీ మీద అతనికెంతో గౌరవం పెరిగింది. తన తల్లిమీద జాలి కలిగింది. శ్రావణీ, కళ్యాణీ, భారతుల మీద అంతులేని అభిమానం పెంచుకున్నాడు.

*　　　*　　　*

ఆ రోజు విజయదశమి.

కాంచన కుటీరంలో పూజలు అప్పుడే ముగిశాయి.

దివాన్జీ పర్యవేక్షణలో స్రవంతీదేవి చేతుల మీదుగా పేదసాదలకు దానధర్మాలు జరుగుతున్నాయి. ఆ శుభసమయంలో క్రాంతి వుండివుంటే బావుండుననుకుంది స్రవంతి. క్రాంతి రాదగిన శుభవేళ అని భావించాడు దివాన్జీ.

ఓ కారు వచ్చి పోర్టికోలో ఆగింది.

పసుపు బట్టల్లో వున్న నూతన దంపతులు కారు దిగారు. వారు క్రాంతి, భారతి.

స్రవంతి తన కళ్ళను తాను నమ్మలేకపోయింది.

దివాన్జీ కళ్ళు ఆనందాశ్రువులతో చెమ్మగిల్లి మిలమిల మెరుస్తున్నాయి.

అక్కడచేరిన పేదాసాదావారిరువుర్నీ చూసి మనస్సుల్లోనే ఆనందించారు.

ఆ సంఘటనను తట్టుకోలేని స్రవంతి చేస్తూన్న దానధర్మాలను ఆపి చరచరా మేడమీదకు వెళ్ళిపోయింది.

కార్యక్రమానికి అంతరాయం కావడంతో కొద్దిసేపట్లో జనం సద్దుమణిగారు.

దివాన్జీ, రాజీఅయా భారతినీ, క్రాంతినీ కాంచన కుటీరంలోకి తీసుకొచ్చారు. హారతులిప్పించారు. క్రాంతి తనవెంటనున్న భారతితో హాలులోనే నిలబడిపోయాడు.

అదే సమయానికి క్రాంతి, భారతుల




పెళ్ళి సంగతి తెలుసుకున్న చైతన్య ఏం గొడవ జరుగుతుందోనని శ్రావణినీ, కల్యాణినీ వెంటబెట్టుకొని కాంచన కుటీరానికి చేర్చుకున్నాడు.

క్రాంతి హాలులోనే నిలబడి — "అమ్మాజీ!" అని బిగ్గరగా పిల్చాడు. ఆ పిలుపుతో కాంచన కుటీరం ప్రతిధ్వనించింది

నిప్పులు చిమ్ముతూన్న కళ్ళతో, గంభీర వదనంతో, మాటలకందని అవమానంతో కుతకుత వుడికిపోతూన్న స్రవంతి తన గదిలోంచి బయటికొచ్చి మేడమెట్లమీద నిలబడింది. ఎదురుగా హాలులోవున్న జనాన్ని చూసింది. తరతరాల వంశ ప్రతిష్ఠ స్రవంతి రూపంలో నిలబడినట్టు అనిపించింది హాలులోని అందరికీ.

నిశ్శబ్దం ఆవరించింది క్షణంపాటు.

"కాంచన కుటీరం యజమాని పిలుపు వినబడింది ఆదేశమేమిటో వివరిస్తే శిరసావహిస్తాను." అంది స్రవంతి క్రాంతి మొహంలోకి తీక్షణంగా చూస్తూ.

"నేను ఆదేశించడానికి రాలేదమ్మా! నీ ఆశీర్వాదంకోసం వచ్చాను." అన్నాడు క్రాంతి.

"ఆశీర్వాదం మనస్పూర్తిగా ఇవ్వవలసింది. అర్థిస్తే ఇచ్చేది ఆశీర్వాదం కాదు!"

అర్థించే అలవాటు నాకూ లేదు. నీ కొడుకును గాబట్టి నీ ఆశీర్వాదంకోస మొచ్చాను. ఇవ్వడానికి మీ మనస్సు అంగీకరించకపోతే, బలవంతం లేదు. కాని నేను చెప్పే మాటలు విని నిర్ణయం తీసుకోండి."

"ఏమిటా మాటలు ?"

"నేను కాంచన కుటీరం యజమానిననీ మీరే అన్నారు. బాబాయి కూడా తన ఆస్తికి నన్నే యజమానిని చేశాడు."

"అందుకని ఈ పెళ్ళి నచ్చనివాళ్ళను కాంచనకుటీరం వొదిలి బయటకు వెళ్ళమనా ఆదేశం!"

"కాదమ్మా!ఎవరు కాంచన కుటీరంలో వుండాలో ఎవరు వుండతగినవారో నే చెప్పేది విన్న తర్వాత మీకే తెలుస్తుంది. నేను చెప్పేది మీకు కూడా తెలియని విషయాలు. దివాన్జీ రాఘవయ్య ఎవరో మీకు తెలియదు. ఎందుకు ఇలా బ్రహ్మచారిగా వుండి ఈ కాంచన కుటీరానికి తనని తానే అర్పించుకున్నాడో మీకు తెలియదు. మా ముత్తాతగారికి జనమందరికీ తెలిసిన ఏకైక పుత్రుడు మా తాతగారు రాజారాజశేఖరంగారు.

కాని మా ముత్తాతగారికి మరో కొడుకున్నాడు. ఆయనే దివాన్జీ రాఘవయ్య."

పరివారంలో కలకలం బయలుదేరింది.

క్రాంతి మళ్ళీ మొదలు పెట్టాడు.

"ఎవ్వరూ ఆశ్చర్యపోనక్కరలేదు. ఇది నిజం. ఈ నిజం రాణీ ఆయాకు తెలుసు. దివాన్జీకి తెలుసు. దివంగతులైన మా తాతగారికి తెలుసు. మా తాతగారు చెప్పగా విన్న శ్రావణికి తెలుసు. మా తాతగారు రాజా రాజశేఖరంగారు మా ముత్తాత తాళికట్టిన భార్యకు పుడితే, దివాన్జీ రాణీ ఆయా పెద్దతల్లికి మా ముత్తాతగారి కారణంగా పుట్టారు. ఆమె దివాన్జీని కనగానే మరణించింది. దివాన్జీ తల్లి పోవడంతో కళ్ళముందు తండ్రి వున్నా దిక్కులేని వాడయ్యాడు. కాని మా ముత్తాతగారు నోరువిప్పి దివాన్జీని 'బాబూ' అని పిలవకపోయినా మనస్సులో ఏదోమూల కాస్త మృదుత్వం మిగిలి వుండటంచేత కొడుకుగా కాకపోయినా ఒక అనాధను పెంచినట్టు పెంచాడు. కాని మా తాతగారు మనస్సు మంచిదికావడం చేత దివాన్జీని ఎంతో ప్రేమగా తోడబుట్టిన వాడుగా చూసుకున్నాడు. తమ్ముడని పిలవకపోయినా తమ్ముడిగా చూసుకున్నాడు. ఆస్నేహం, ఆ మమకారం దివాన్జీని కట్టివేశాయి. తాను పెళ్ళిచేసుకొని ఒక ఇంటివాడైతే కాంచన కుటీరానికి మా తాతగారు రాజా రాజశేఖరం ఎక్కడ దూరం కావాల్సి వస్తుందోనని దివాన్జీ పెళ్ళి సంగతే మర్చిపోయాడు ఎంతో నిస్వార్థంగా తానే కాంచన కుటీరం, కాంచనకుటీరమే తానుగా ఈ వంశాన్నీ, ఈ వంశ ప్రతిష్ఠనూ కంటికి రెప్పలా కాచుకుంటూ తల నెరసిన ఈ వయస్సుదాకా బ్రతికాడు. ఈ కాంచన కుటీరం వంశీకులవల్ల రాఘవయ్యగారే కాకుండా రాఘవయ్యలాంటి మరికొందరు అనాధలు సృష్టించబడ్డారు. వారిలో శ్రావణి

ఒకతె. ఆమె మా తాతగారి మూలంగా తయారైన పతిత. ఆమెకుపుట్టిన కల్యాణి కళ్ళముందే తండ్రి వున్నా 'నాన్నా' అని పిలవలేకపోయిన అనాధ. ఇక నీ సంగతమ్మా! ఎవరు మీ మెడలో తాళి గట్టబోతున్నారో మీకు తెలియనివ్వ కుండా మీ పెళ్ళి జరిపించారు మా తాత గారు. ఆ తర్వాత ఏంపోగొట్టుకున్నారో మీకు తెలుసు. మీ బాధను మరిపించ డానికి కాంచన కుటీరం పెత్తనం మీ కప్పగించారు మా తాతగారు. ఇంత పెద్ద యింటి పెత్తనం మీ చేతికి రావడంతో మీ మనస్సును చంపుకొని యంత్రంలా బ్రతికారు. ఈ వంశ ప్రతిష్ఠను కాపాడ టానికే పుట్టినా, మరబొమ్మలా జీవిం చారు. మీ జీవితం పొడుగునా బాధ్యతా నిర్వహానే కాని సుఖశాంతులు మీరు చవిచూడలేదని నాకు తెలుసు. అలా మీకూ అన్యాయం చేసింది ఈ వంశం.

ఈ వంశంవల్లా, ఈ వంశీకుల వల్లా, మనకు తెలిసి అన్యాయం జరిగిన వారు మీరు. మనకెవరికీ తెలియకుండా ఇంకా ఎంతమందికి అన్యాయం జరిగిందో ఇంకా ఎందరు అనాధలు సృష్టించ బడ్డారో నాకు తెలియదు. అందుకే నేనొక నిర్ణయానికొచ్చాను. ఈ యావ దాస్తినీ అనాధల పరంచేస్తున్నాను. ఇహ నుంచి కాంచనకుటీరంఒకఅనాధాశ్రమం. దీనికి ధర్మకర్తలు మీరూ, శ్రావణీ, బాబాయి, మా తాతగారు దివాన్జీ రాఘ వయ్య. నా బ్రతుకు నేను బ్రతగ్గలను. నేను చదువుకున్నాను. భారతి చదువు కుంది. ఈ సాంప్రదాయం, వంశ ప్రతిష్ఠ, పరువు అనే సంకెళ్ళమధ్య ఖైదీగా బ్రతకడం నా కిష్టంలేదు. రాజులు పోయారు. రాజ్యాలు పోయాయి. జమీందార్లు పోయారు. జమీలు పోయాయి. అందరూ జనంతో కల్సి జనంలో జనంగా కలిసి భారతీ, నేనూ మా కాళ్ళమీద బ్రతకదల్చు కున్నాం. పెద్దలు కనక దివాన్జీని, కన్న తల్లివి కనక నిన్నూ, నన్ను చూసిన మరుక్షణం నుంచీ కన్నబిడ్డకంటే మిన్నగా నన్ను ప్రేమించిన బాబాయినీ, మనవడిగా ముద్దాడిన ము నాయనమ్మ శ్రావణినీ ఆశీర్వదించమని కోరు తున్నాను. మనసుంటే ఆశీర్వదించండి. సెలవు." అని క్రాంతి భారతిని వెంట దీసుకొని కాంచన కుటీరం సింహద్వారం ఆఖరిసారిగా దాటాడు.

(సమాప్తం)






పన్నెండు సంవత్సరాల తర్వాత రాజమండ్రి వెళ్తున్నాను. కిటికీ దగ్గరే కూర్చున్నాను పరిసరాలు చూద్దామని. విజయవాడ — కాకినాడ పాసింజరు గుణదల స్టేషన్ చేరేటప్పటికి వేసవికాలం లోని లేత సూర్యుడు తన కిరణాల్ని పదును పెడుతున్నాడు. ఆ కిరణాలు రైలు బోగీలలోనికి ఏటవాలుగా పడుతున్నాయ్.

జొన్న కంకులు కోసి, ఆ జొన్న

చొప్పను గూళ్ళలాగా వేస్తే అవి మూరానికి గుడిసెల్లా కనబడుతున్నవి. ఆ జొన్న మోళ్ళు, భూదేవికి గగుర్పొడిచిన దేహంపైన వెంట్రుకల్లా అనిపిస్తున్నవి. అక్కడక్కడ ధనియాల కంప, సెనగకంప కళ్లాల వద్ద చిందరవందరగా పడి ఉంది. రైలుబండి తనకేమీ పట్టనట్లుగా కొండచిలువలా సాగిపోతున్నది. వచ్చిన స్టేషన్లను కబళించి ముందుముందుకు సాగుతున్నది.

జనం ఎక్కుతున్నారు; దిగుతున్నారు హడావుడిగా. జనంతోపాటు తాటి తోపులు, తుమ్మ పికెలు, మామిడి తోటలు, ఇంగ్లీష్ తుమ్మ పొదలు, ఇంకా ఏవో చెట్లు, గుట్టలు, పుట్టలు - బండితోపాటు పరుగెత్తి మాయమైపోతున్నవి. పరిణామ శీలమైన లోకంలో మానవుడికి, మానవుడికీ మధ్యఉన్న సంబంధం రైలుబండికి, దానితో పరుగెత్తుతున్న ప్రకృతికి ఉన్న సంబంధంలా అనిపించింది నాకు

వయసొచ్చిన సూర్యకిరణాలు చెట్ల ఆకులపైన, చరచరా వస్తువుల పైన పారాడుతుంటే, వాటివాటి తత్త్వాన్నిబట్టి అవి ప్రకాశిస్తున్నవి.

తాటి ముంజలు ముంగాల్లో వేసి అమ్మేవాళ్ళు, పేరుబాదమ్ అంటూ వేరుసెనగపప్పు పాకాన్ని అమ్మేవాళ్లు, కాలక్షేప బఠానీలు అని అరచేవాళ్ళు, చల్లని నిమ్మకాయ్ మజ్జిగ అని గ్లాసులు లొడలొడ మనిపించేవాళ్ళు ఒకళ్ళ తర్వాత ఒకళ్ళు అన్ని కంపార్ట్‌మెంట్లలోకి వస్తూ పోతూ ప్రయాణీకుల మనస్సుల్లో సంచలనం కలిగిస్తున్నారు.

రైలుబండి ఏలూరు చేరుకొన్నది. జనం కెరటాల్లా విరుచుకపడి కంపార్టుమెంటుల్లో క్రిక్కిరిసిపోయారు. నేను ఎక్కిన బోగిలో కూడా జనం నిండిపోయారు. ఎండలో ఎక్కిన ప్రయాణీకులు వేసవిని విమర్శిస్తున్నారు. నలుగురితోపాటు నేనూ వేసవి ఉక్కదనాన్ని భరించలేక, జేబురుమాలుతో విసురుకొంటూ, తుడుచుకొంటూ, నానా కష్టాలు పడుతున్నప్పుడు నా ఎదురు సీట్లో కూర్చొని నన్ను తదేకంగా పరిశీలించే వ్యక్తి సైజం ఆశ్చర్యం కల్గించింది. ఎప్పుడో పరిచయమున్నవాడిలా ఆ క్రొత్తమనిషి నన్ను చూస్తున్నాడు. నేను నా తలను గాలించాను. ఆ మనిషి ఎప్పుడైనా, ఎక్కడైనా తటస్థ పడ్డాడా అని. కానీ ఏనాడూ అటువంటి మనిషిని చూసిన జ్ఞప్తి కల్గనేలేదు.

అతని వయస్సు నలభై ఐదు, ఏభై మధ్య ఉండవచ్చు. మనిషి పొడగరి. అతనిజుట్టు దువ్వేనకులొంగని స్వతంత్ర ప్రవృత్తిని చాటుతున్నది. నుదుటిమీద మూడు గీతలు స్పష్టంగా కనబడుతున్నవి కళ్ళల్లో తేనె పొడలుఉండడం వల్ల పిల్లి కళ్ళలా కనబడుతున్నవి. జీవితంలో ధక్కామొక్కీలు తిన్న

ఘటంలా అవిపిస్తున్నాడు. వేసుకున్న పంచె, లాల్చీ తెలుపువే గాని, కొంచెం నలిగిపోయి, చాలా దూరం ప్రయాణిం చిన పరిస్థితిని తెలియజేస్తున్నవి. అయితే అతను మాటి మాటికి కాళ్ళు కదిలిస్తు న్నాడు. ప్రతి మనిషిని ఆపాదమస్తకం సాభిప్రాయంగా పరిశీలిస్తున్నాడు. మొత్తం మీద అతని ప్రవృత్తి వింతగా అనిపించి అతణ్ణి పరిశీలనతో వేటాడడం ప్రారంభించాను.

అంతలో బండి కదిలింది బండిలో ఉన్నవాళ్ళం ఊపిరి పీల్చుకున్నాం. బైట ఎండ మిలమిల మెరుస్తున్నది. గాలి తగులుతుంటే చెమటతో తడిసిన శరీరాలు హాయిని అనుభవిస్తున్నవి.

నేను ఒకే విధంగా అంటే ఎక్కువ సేపు కాళ్ళు క్రింద ఉంచి కూర్చొనడం వల్ల సుఖంగా లేక చెప్పుల్లోని కాళ్ళను తీసి సీటుపై ఉంచుకున్నాను. చేతిలో కాళ్ళను ఒత్తుకొంటూ కన్నులు మూసు కొన్నాను.

'ఎక్కడిదాకా మీరు?' అతను ప్రశ్నించాడు.

'నేనా! గోదావరి స్టేషన్లో దిగుతా' అన్నాను.

'సరే! మీ కంటే నేనే కొంచెం దూరం వెళ్లాలన్నమాట .... సామర్ల కోటలో దిగుతా' అని అన్నాడు నేను ప్రశ్నించకముందే.

ఒకటి రెండు నిముషాల తర్వాత మళ్లా ప్రశ్నించాడు.

'మీ కుడికాలు మీద నల్లని మచ్చ లాగా వుందే! రంగు ఏదైనా అయిం దేమిటి?' నా కాలిని, చెప్పుల్ని చూస్తూ అడిగాడు.

నా కుడికాలుబొటనవ్రేలుకు తిన్నగా, దాదాపు రెండంగుళాల పైన అర్ధ రూపాయి పరిమాణంలో నల్లగా ఉన్న పుట్టుమచ్చపైన అతగాడి దృష్టి పడిం దన్నమాట!

'అబ్బే! ఇది రంగు కాదండీ. పుట్టు మచ్చ!' అన్నాను నేను.

'ఓహో! రూపాయంత ఉందే! అదృష్టమే నందోయ్' అన్నాడు.

'నా మొహం.... ఇంతవరకూ అటు వంటిది నా జీవితంలో ఎదురుకాలేదు' అన్నాను.

"అహ.... అలా తేలిగ్గా కొట్టి పారెయ్యకండి. ఒకదాని ఫలితం వెంటనే .. కలుగు తుందంటారా? దేనికైనా సమయం రావాలండీ....సమయం. మీకో సంగతి చెప్పమంటారా? మా ఊళ్ళో నాకు తెలిసిన సంగతి సుమండీ! మా వూళ్ళో పరమానందం అని ఒక జులాయి వెధవ ఉన్నాడండి....అయితేవాడికి వీపు మీద, ఎడంవైపున బారెడు వెడల్పున నేరేడు పండు రంగులా నిగనిగ లాడు తున్న పుట్టుమచ్చ ఉందండి. పుట్టుమచ్చ పరమానందంగాడు అని మేము ఎగ తాళిగా పిల్చేవాళ్ళం అనుకోండి .... వోనాడు మావూరి శాస్త్రులుగారు అడి పుట్టుమచ్చను విదానంగా చూసి, 'వురే

అనందం! నువ్వు మహానుభావుడివి అవ్వుతావురా. అర్జునుడికి కూడా ఇల్లాగే పుట్టుమచ్చ వుండేదట! నీ పురాకృత సుకృత విశేషాన నీకూ అల్లాంటి పుట్టు మచ్చే కల్గిందిరా! నీ జాతకం ఎలా మారుతుందో ఎవరు చెప్పగలరు?' అవి అన్నాడండి' అని నా ముఖం ప్రక్కన ఉన్నవాళ్ళ ముఖాలు చూశాడు.

'మరి జాతకం మారిందేమిట?' అన్నాను నేను.

'ఓ....అటువంటిదే జరిగింది....మా శాస్త్రిలుగారి మాట మజాకా అనుకున్నా రేమిటి? వాడికి సెంటు స్థలంగాని, వింకు పొలంగాని లేదు. కాని అయి దెకరాల సుక్షేత్రం సంపాదించాడు అయి దెకరాలు! ఫస్టాసయిన ఇల్లు కట్టాడు.... ఇంకేం కావాలి' అన్నారు ఆశ్చర్యంగా అందరి ముఖాలు చూస్తూ.

'ఇంతకీ....ఎలా వచ్చిందంటారు? ఏదైనా స్మగుల్డు వ్యాపారంలో దిగా డేమిటి?' నేను ప్రశ్నించాను.

'అబ్బో! మీరు భలేవారే! అటు వంటిదేం లేదండోయ్.... వాడు ఏం చేశాడంటే.... మిలట్రీకి వెళ్ళాడండీ.... అక్కడ పాకిస్థాన్ యుద్ధంలో టపీమని పిట్టల్నికొట్టినట్లుపాకీస్థానోళ్ళవిమానాల్ని కూల్చిపారేశాడంట! వాడి గురిని మెచ్చు కొని గవర్నమెంటువారు అంటే కలెక్టరు గారు సన్మానంచేసి, ఊరేగించి, ఆ పొలం ఇచ్చి ఘనంగా సత్కారంచేసి పారేశారు. ఇంకేం కావాలి!' అన్నాడు.

'ఆ పుట్టుమచ్చ ఉండడానికి, ఆ పొలం రాడానికి ఏం సంబంధం?' అన్నాను నేను

'అమ్మమ్మ! ఎంత మాట! ఎంత మంది మిలిట్రీకి వెళ్ళడంలేదూ? అంత మందీకూడా విమానాల్ని కూల్చేస్తున్నారా చెప్పండి? అర్జునుడిలా వాడికిపుట్టుమచ్చ ఉంది గనక వాడి గురి దేవలోకం వెళ్ళకపోయినా, ఏదో కొంతవరకు ఆకాశంలో విమానాల్ని పడగొట్టగలిగే అదృష్టాన్ని సంపాదించి పెట్టిందన్న మాట! మీరు ఒప్పుకొని తీరాలి. తప్పదు' అన్నాడు కుండ బ్రద్దలుకొట్టినట్లు.

అతడి మాటల్ని అత్యంత శ్రద్ధా సక్తులతో ఆలకిస్తున్న ప్రయాణికులు కూడా అమిత విశ్వాసంతో 'కావచ్చు లెండి; కాదనడానికి వీల్లేదు' అని వారి వారి అభిప్రాయాల్ని ప్రకటించారు. ఇక వాడు ఆ విషయంపై నాకు వాదోప వాదం చేయడానికి అవకాశం పోయింది.

'ఇంతకీ నా కూడా అటువంటి దేదో వర్తిస్తుందన్నమాట!' వెటకారంగా అన్నాను.

'అమ్మా! ఎవరుచెప్పగలరు? లాటరీలో ఓ లక్ష తగలకూడదూ? పోయిన వస్తువు దొరికితే చాలదూ? అకస్మాత్తుగాఅదృష్టం పట్టడానికి ఎంత టైం కావాలండీ?" అన్నాడు నా కాలి పుట్టుమచ్చను చూస్తూ.

అక్కడున్న తోటి ప్రయాణికులు అదే పనిగా నా పుట్టుమచ్చను చూస్తుంటే

నిజం చెప్పాలంటే అదివరకు లేని గర్వం కల్గింది. ఎంతో ప్రేమగా, స్వాతిశయంగా, ఎకౌంటులో డబ్బున్న వ్యక్తిలాగా నా పుట్టుమచ్చను చూసు

అక్కడనుంచి పుట్టుమచ్చల ఉనికి, అవి ఉండే చోటునుబట్టి ఫలితాల్ని గురించి రకరకాలుగా ముచ్చటించుకోడం జరిగింది. తర్వాత లాటరీ వైపు దృష్టి మళ్ళింది. లాటరీ తగిలిన అదృష్టవంతుల్ని గురించి కథలు సాగాయి. ఈ గోష్ఠిలో కొందరు ప్రయాణికులు తమకు తెలిసిన సంఘటల్ని చెబుతూ ఆ లోకాభిరామాయణానికి సంపూర్ణత్వం కల్గించారు.

ఆ తర్వాత అతణ్ణి గురించిన వివరాలు రాబట్టాను. నేను ఊరు, పేరు అడిగితే అతడు సమస్తం చెప్పుకొన్నాడు. చిత్రమైన మనిషిలా అవ్పించాడు.

అతని పేరు చిరంజీవులు. ఏలూరు దగ్గర పాలపురం అతని స్వస్థలం అట! పూర్వం చాలా భాగ్యవంతులేనట గానీ ఆస్తి అంతా తగదాల వల్ల హారతి కర్పూరంలా హరించుకొని పోయిందట! సామర్లకోటలో చిరంజీవులు పచ్చగా ఉన్న రోజుల్లో ఐదు పచ్చ కాగితాలు అప్పుగా పుచ్చుకొన్నాడట ఓ ఆసామి. అది వసూలు చేసుకొనే నిమిత్తం వెళ్తున్నాడట!

కబుర్లు, కాలక్షేపాలతో, క్రాసింగులతో, గూడ్స్‌బండ్ల రాకపోకలతో, సిగ్నల్ ఇవ్వని కారణాలతో పదిన్నర అయ్యేటప్పటికి తాడేపల్లిగూడెం చేరింది మా బండి. కాఫీల కోసం, టిఫెన్ల కోసం జనం దిగుతున్నారు చిరంజీవులు, నేను బండిదిగి కేంటీన్ దగ్గరకు వెళ్ళి టిఫెన్ తిని, కాఫీలు తాగాం. డబ్బులు మాత్రం నేనే ఇచ్చాను, బ్రతికి చెడ్డవాడు కదా అనే సానుభూతితో. కంపార్టుమెంటులోకి ఎక్కిన కాసేపటికి బండి కదిలింది. చల్లటి గాలి వీస్తున్నది. కొంత త్రాణ వచ్చింది కాబట్టి నా కన్నులు మూతపడుతున్నవి. ఇంకో గంటన్నరకో, రెండు గంటలకో గాని నేను దిగవలసిన స్టేషన్ రాదు. చిరంజీవులు నా కంటే దూరం వెళ్తాడు గనుక అంతగా నిద్రపోతే లేపుతాడు అనే ధైర్యంతో నిద్రకు ఉపక్రమించాను. వెంటనే నిద్రలోకి జారిపోయాను.

ఆ నిద్రలోనుంచి మెలకువ వచ్చి లేచింది కొవ్వూరు స్టేషన్‌లోనే. అటూ, ఇటూ చూసి, నా ఎదురు సీటులో చూడగా చిరంజీవులు లేడు. ప్రక్కన ప్రయాణీకులతో అతణ్ణి గురించి వాకబ్ చేస్తే, అతను నిడదవోలులో ఏదో గుర్తువచ్చినట్లు దిగిపోయాడని చెప్పారు. నాకు పరమ ఆశ్చర్యం కలిగింది. నాకు చెప్పకుండా దిగిపోయాడేమిటి? అనుకున్నాను. నా కేదో అనిపించి చేతి

సంచికోసం వెదికాను; అది ఉన్నది. వంగి నా చెప్పులకోసం చూసుకొన్నాను; అవి లేవు. నెల క్రిందటేకొన్న చెప్పులు! ప్రాణం ఉసూరుమన్నది. మరుక్షణంలో వాటిని ఎవరు సంగ్రహించి ఉంటారో నాకు అర్థమైంది. నా చెప్పులు పోయాయి అన్న భావాన్ని నా తోటి ప్రయాణీకుల దగ్గర వ్యక్తం చేయలేదు 'పాపం చిరంజీవులు' అని మనస్సులో అనుకొన్నాను. నా చెప్పులమీద కన్నువేసిన అతని ప్రవర్తన ఇప్పుడు గుర్తుకు వచ్చింది. ఇప్పుడేమి ప్రయోజనం?

రైలుబండి గోదావరి బ్రిడ్జిపై నెమ్మదిగా నడుస్తున్నది కిటికీలోనుండి తొంగి చూశాను. కోసిన రెల్లు దుబ్బులు! ఏపుగా పెరిగిన జిల్లేళ్ళు, ఇంకా ఏవో పేరు తెలియని పచ్చని మొక్కలు! మెరుస్తున్న ఇసుక దిబ్బలు! ఒకనాడు గట్లను ఒరపిడిచేస్తూ, అఖండంగా ప్రవహించిన గౌతమీనది ఈనాడు కృషీభూతమై దాని సంపూర్ణ సౌందర్యం కాలప్రవాహంలో వన్నె తరగడం చూసి కాలమహిమ అని అనుకొన్నాను. కొందరు దానిలో డబ్బులు విసురుతున్నారు. నేను మాత్రం జీవనది, జీవనదాత్రీ అయిన గోదావరికి భక్తి పూర్వకంగా నమస్కరించాను.

గోదావరి స్టేషన్ వచ్చింది. దిగాను. బయటకు వచ్చాను. ఎండ చంద్ర నిప్పులు చెరుగుతున్నది. చెప్పులు లేని కాళ్ళు చుర్రుమంటున్నాయి. ఇక నడిచే ప్రసక్తి లేదు. రిక్షాకోసం చూస్తున్న నాకు, నాకన్నా ముందు దిగిన ప్రయాణీకులకు ఒక్క రిక్షా అంటే ఒక్క రిక్షా కూడా కనిపించలేదు. గుండెలు జారి పోయాయి.

కారణం ఏమిటా అని భోగట్టా చేస్తే రిక్షా వోనర్లకూ, రిక్షా డ్రైవర్లకు రిక్షా బాడుగలమీద ఏర్పడిన విభేదాలవల్ల, రిక్షా డ్రైవర్లు మూకుమ్మడిగా ఆ రోజున రిక్షాలు నడపడంలేదని తెలిసింది. 'ఈ రోజే జరగాలా రిక్షాల సమ్మె' అని మనసులోనే మూలిగాను.

మాడిపోయిన ఆ రోడ్డుమీద నలుగురితో పాటు నడుస్తున్నాను. తారురోడ్లపై చెప్పులులేని కాళ్ళతో నడవడం దుర్భరంగా ఉన్నది. నడుస్తుంటే ప్రాణాలు జివ్వున లాగేస్తున్నట్లనిపిస్తున్నది. పైగా వడగాలి రివ్వున వీస్తున్నది. అక్కడక్కడ నీడల్లో ఆగుతూ, ఆగుతూ నడుస్తున్నాను. వేసవిలో చెప్పులున్న వాళ్ళు మహారాజుల్లా నడుస్తున్నట్లనిపించింది నాకు. చెప్పులు లేని నేను అప్పులున్నవాడిలా బెరుకుబెరుకుగా నడుస్తున్నాను.

ఆ పరిస్థితికి కారకుడైన చిరంజీవులుపై అప్పుడు నాకు పట్టరాని కోపం కలిగింది. అతణ్ణి లోలోపల శపించాను. యమయాతన పడుతూ దేవీచౌకు దాటి, కంబాలచెరువువరకు వచ్చాను. అక్కడ

నుండి నేను ఇంకా నడవవలసింది మైలు దూరం ఉన్నది. అప్పటికే నా పని అయిపోయింది. కాళ్ళు బొబ్బలు ఎక్కాయి. కళ్ళు మండుతున్నాయి. బట్టలు చెమటతో తడిసిపోయాయి అక్కడ కొంచెం సేపు ఆగుదామని నిశ్చయించుకొన్నాను. అక్కడే వున్న పంపుదగ్గరకెళ్ళి ముఖం, కాళ్ళు, చేతులు కడుక్కొని దాహం తీర్చుకొన్నాను ఆ పంపుకు దగ్గర్లో వున్న గంగరావిచెట్టు నీడకువెళ్ళి ప్రాణంవచ్చినట్లు అనుభూతి పొందాను.

ఆ చెట్టుక్రింద కూర్చొని చెప్పులు కుట్టుకొంటున్న చొక్కాలేని పాతికేళ్ళ యువకుడు నా రాకను గమనించీ, గమనించనట్లుగా తన పనిలో నిమగ్నమైపోయాడు నేను 'అబ్బా' అనుకొంటూ చేతిలోని సంచిని చెట్టుమొదలుకు ఆనించి, ఎడమచేత్తో చెట్టుని పట్టుకొని రెండుకాళ్ళను మార్చి మార్చి చూసుకొన్నాను. రెండు కాళ్ళు బొబ్బలెక్కి కందిపోయి ఉన్నాయ్.

'ఏటండీ.. అయ్యగోరు... సూసుకొంటున్నారు?' అన్నాడు ఆ యువకుడు తలెత్తి.

'ఏంలేదు....ఏంలేదు....కాళ్ళు' అని ఏంచెప్పాలో తోచక ఆగిపోయి సరిగా నుంచున్నాను.

'మీ కాళ్ళకేం' అంటూ నా కాళ్ళ వైపు చూశాడు. కుడికాలుమీద పుట్టుమచ్చపైన అతని దృష్టి పడింది.

'భలే పుట్టుమచ్చుందిగదండి కాలిమీద ....నల్లంగా నా జోళ్ళకేసే రంగులా' అంటూ కత్తిని సానరాయిమీద నూరుతున్నాడు పై పెదవితో క్రింద పెదవిని నొక్కుతూ

'ఈ పుట్టుమచ్చే .. నా మచ్చ మాపిందిరా బాబు....అబ్బా!! అని బాధగా కళ్ళు మూసుకొన్నాను. కండువాతో ముఖం తుడుచుకొని కళ్ళు విప్పాను.

'ఏటయిందండీ....' అని ముఖంతిప్పి భుజంమీదుగా నా ముఖాన్ని చూశాడు. తర్వాత పుట్టుమచ్చను చూశాడు ఆ తర్వాత ఒక్క క్షణం ఆగి మళ్ళా నా ముఖం చూశాడు. ఒక నిముషంపాటు పని ఆపుచేసి దీర్ఘంగా యోచించాడు. ఆ యువకుడి తరహా చూస్తే నాకు మళ్ళా చిరంజీవులు ధోరణి గుర్తుకు వచ్చింది. నా కష్ట పరంపరలకు చిరంజీవులు పల్లవిలాంటివాడు అయ్యాడు. ఇక వీడేమౌతాడో!? అనుకొన్నాను.

'అయ్యగోరూ....' అన్నాడు యువకుడు అతి మర్యాదగా.

"ఆఁ .. ఏమిటీ...."అన్నాను అతని గొంతులోని అనుకోని మార్దవానికి ఆశ్చర్యపడి.

"ఏటంటే... తమరు యెప్పుడైనా యిద్యానగర్ కాలనీకాడ ...ఆ మర్రిసెట్టు కాడ....ఎదురుంగా వున్న యింటోగాని వున్నారండి" అన్నాడు గుర్తుకు తెచ్చుకొని చెబుతున్నట్లుగా.




'విద్యానగర్ కాలనీలో మర్రిచెట్టు ఎదురింట్లోనా? అఁ.... అవును.... ఉన్నాను అది పన్నిండేండ్ల క్రిందటి మాట! అయితే నీకెలా తెలుసు?' ఎంతో ఆశ్చర్యంగా అన్నాను. అనాటి నా ఉనికి తెలిసిన మనిషి తటస్థపడ్డాడే అనే సంతోషంతో.

ఎందుకో ఆ యువకుడు చిటికేసి చిరునవ్వు నవ్వుకొన్నాడు. 'రేయ్ సిమ్మాచెలం.... రొండు సోడాలు ... అర్జంట్రోయ్....' అని పెద్దగా ఎదురుగా ఉన్న బడ్డీకొట్టును ఉద్దేశించి కేకవేశాడు. తర్వాత తన కేన్వాసు సంచిలో ఉన్న పట్టెకలు విగించని కొత్త జోడు బయట తీసి బ్రష్ చేశాడు.

....రెండు సోడాలంటున్నాడు. ఒక్కడే రెండూ తాగుతాడేమోలే అనుకొని దుమ్మురేగుతున్న రోడ్డువైపు భయంగా చూస్తున్నాను. అంతలో 'సోడా— తీసోక్కండి సార్' అని పన్నిండేళ్ళ కుర్రోడు అన్నాడు.

'నాకెందుకూ? నేనడిగానా ఏమన్నానా?' అని అటుండగా—

'తీసుకోండయ్యగోరు— సోడాదే ముంది? తాగండి— తర్వాత.... సూద్దాం' అన్నాడు చెప్పుల్ని ఇంకా బ్రష్‌చేస్తూ.

యాంత్రికంగా తీసుకొని, తాగాను. మొత్తానికి నాకు అయోమయంగా ఉంది. నా పాత అడ్రసుఅడిగి తెలుసుకొని, ఈ మర్యాద చేయడంలోగల అంతర్యం వాఁర్థంకాలేదు. పంచి తీసుకొని నాదారిని నేను పోదామనుకునేసరికి ఆ యువకుడే అన్నాడు.

'అయ్యగోరు.... మీకు సెప్పులు లేనట్టుగున్నాయ్ ... మీ సైజు జోళ్ళు నాదగ్గిరున్నాయ్.... ముందేసుకొని సూడండి .... ' పైపెచ్చు నవ్వుతూ అంటున్నాడు.

'ఆహా.... ఇది బిజినెస్ ట్రిక్కన్న మాట ! పది పైసలు సోడా ఇప్పించి, పది రూపాయల చెప్పులు కొనిపించడం గాలంవేసి చేపనులాగడంకాక మరేమిటి? దేశం బాగా మారిపోయింది; అప్పటికీ, ఇప్పటికి' అని మనసులో అనుకొన్నాను

'నా కిప్పుడెందుకోయ్. ఇప్పుడు నా దగ్గర ఎక్కువ డబ్బుల్లేవు కూడాను. జోడు కొనాలని అనుకోడంలేదు' అన్నాను నెమ్మదిగా నచ్చచెబుతున్నట్లుగా

'అయ్యగారూ .... ముందలమేసుకొని సూడండి.... డబ్బులు గొడవ.... తర్వాత' అంటున్నాడు అదే నవ్వుతో.

'ఓరి.... పిడుగా... !' అనుకొన్నాను మనసులో. ఎందుకు నవ్వుతున్నాడో అర్థంకాదు. తేలికగా వాడి మాయలో పడ్డానా ? ఏమైనా నేను మాట్లాడలేదు.

'ఊ.... యేసుకోండి—ఆలోచిత్తానా రేటి ? మీ దగ్గిర డబ్బులు నాకు ముట్టకపోయినప్పుడు గదా !' అని అంటున్నాడు.

'తప్పదురా భగవంతుడా !' అనుకొంటూ నా ముందుంచిన జోళ్ళు తొడుక్కున్నాను అయిష్టంగానే. అయితే ఎంత చిత్రం! ఆ జోళ్ళు అచ్చితంగా సరిపోయాయి ! కాని కొలతలు లేకుండా ఎలా కుటగలిగాడు సరిగ్గా నాకు సరిపోయే చెప్పుల్ని ! ?' అని మనస్సులో ఆశ్చర్య పడ్డాను.

'అయితే ఎంతిమ్మంటావ్' జేబులో చెయ్యిపెట్టి అడిగాను.

'పైసా కూడా ఇవ్వనక్కర్లేదయ్య గోరు' అన్నాడు అదే నవ్వుతో.

'అఁ ! ఎందుకని ?' సంభ్రమంగా అడిగాను.

'అదంతే నయ్యగోరు ! అంతే!' తలగోక్కుంటూ అన్నాడు సిగ్గుగా.

'ఎందుకని ? అని అడుగుతున్నాను. నువ్వు నాకేమైనా రుణమైతే... ఏమో గానీ.... పైసా కూడా అక్కర్లేదంటా వేమిటి ?' అతనివైపు పరిశీలనగా చూస్తూ అడిగాను.

'అవునయ్యగోరు ... మీరన్నట్టు.... నిజంగా.... రుణమే ! మా అయ్య.... ఆడజేసిన పనికి కిట్టా రుణం తీర్చు కొంటున్నాను.' అన్నాడు కన్నులు మెరుస్తుండగా.

'మీ అయ్య ఎవరో ? నువ్వెవరో ? మీ అయ్య చేసిన పనేమిటో ? దానికి నువ్వు రుణం తీర్చుకోడం ఏమిటో ? ఇదంతా నాకు గందరగోళంగా ఉంది. అసలా సంగతి వివరంగా చెప్పరా బాబు !' అన్నాను ఒక విధమైన కుతూహలంతో.

ఆ యువకుడు చెప్పడం ప్రారంభించాడు :

అయ్యగోరూ ! ఇది పన్నిండేళ్ళ కితం సంగతి. నాకూ బాగా గ్యేపకం ఉందది. ఓనాడు, మా అయ్య, నేను యిద్యానగర్ కాలనీలో తిరిగి నాక మీ యింటికాడ కొచ్చాం. మీరప్పుడే ఆఫీసు నుంచి కామాల వొస్తూ, మమ్మల్నిసూసి 'ఎందుకొచ్చర్రా' అన్నారు. అప్పుడు మా వోడు 'సెప్పులు బాగుసేస్తాం; పాలిసు సేస్తాం' అన్నాడు 'అయితే ఈ బూట్లు బాగా పాలీష్ చేసి ఇవ్వండ్రా....' అని మా ఎదురంగా బూట్లు యిప్పి, పావలా గూడా యిచ్చేశారు. అప్పుడే ఈ నల్లని పుట్టు మచ్చని నేను స్విత్రంగా సూశాను.

మీరింటోకి ఎల్లంగానే మా అయ్య యేం జేశాడంటే అక్కణ్ణుంచి ఒకటే లగూ తీశాడు. నాకేమీ తెలవక ఆడెనకాల నేనూ లగెత్తాను. శానా దూరం వోయాక బూట్లు గబగబా పాలీసుచేసి, సూరయ్య సారాకొట్టుకి ఎల్లేడు. అప్పుడన్నాడు నాతో 'వురే ! యెంకటేసులగా ! ఈ వంగతి ఎవురికైనా జెప్పినావంటే పని కత్తితో గొంతు కోస్తా. అటు గూడా యెల్లకు' అన్నాడు. నేను బయ్యంతో తల ఊపాను. అప్పుడు అడు యేం జేశాడంటే— 'సూరయ్యోయి బూట్లు కావాలంటివిగా. ఇయిగో మంచియ్యి దెచ్చినా. అయిదు రూపాయి లియ్యి' అన్నాడు. అప్పుడు సూరయ్య 'అయిదూ లేదు గియిదూలేదు. మూడు గ్లాసులు సారా తాగి వోరా దొంగనాయాల ! అయ్యేడ గొట్టుకొచ్చావో'ని అన్నాడు. 'సర్లే ! కానియ్యి' అని మా వోడు పూటుగా తాగి ఆడే పడివోయ్యాడు. ఆడెప్పుడూ అంతే ! కానీ ఆయాల మా యయ్య జేసిన పని నాకు మంచిది కాదని పిచ్చింది. ఆ అయ్యగార్ని దగాజేసి, పాలిసు డబ్బుచ్చుకొని పాడు పనిజేసి నాడని సాలా బాధపడివోయాను.

'వో నెల తరవాత అనుకుంటా మా అయ్య తాగి, తాగి కక్కుకొని, కక్కుకొని సచ్చిపొయ్యాడు. అదివరకు 'తాగొద్దురా ! అసలే పాణంలేదు నీకు' అంటే బండ బూతులు తిట్టేవోడు. సరే. అన్నీ అయ్యాక మీ యింటికాడకొచ్చాను ఆ సంగతి మీకు సెబ్దామని. మీరు యాడకో బదిలీ అయ్యారని ఆ ఇంటో వోళ్ళు అన్నారు. 'ఎప్పటికైనా కనబడక వోతారా ? మా వోడు జేసిన పనికి ఛమాపణ అడిగి అరి రుణం తీర్చుకోక వోతానా ?' అని మనసులో గట్టిగా అనుకొన్నాను. ఇప్పుడు ఈ పుట్టుమచ్చ మూలంగా గురుతు తగిలింది. ఇట్టాంటి పుట్టుమచ్చ ఎవురికి నేను చూడలేదు. ఓ అయ్యగారు ఈ జోడు కుట్టమని అడవాన్సు యిచ్చాడు. అరికి కుట్టిన సెప్పులే నా అదృష్టంసేత మీకు సమంగా సరిపొయ్యాయి. ఎట్టాగో చివరికి మా అయ్య రుణం తీర్చ

కొన్నాను. నాకు సాలా సంతోసంగా ఉందిప్పుడు. ఇదీ అసలు సంగతి' అన్నాడు వెంకటేశ్వర్లు ఎంతో తృప్తిగా.

నేను ఈ కథనాన్ని ఆశ్చర్య చకితుణ్ణయి విన్నాను. పన్నెండు సంవత్సరాలనాటి అల్ప సంఘటన నా స్మృతిపథంలో మెదిలింది. దానిని అనుసరించిన కథ నన్ను ఉద్వేగపర్చింది.

లోకంలో ఈ మరచిపోనితనం సంభవమా అనిపించింది. లేకపోతే కాల ప్రవాహంతోపాటు గుండెలోనుండి కొట్టుకుపోవలసిన చోట నీతి, నిజాయితీ నిశ్చలంగా దర్శనమిస్తుంటే, మరోచోట అవి మచ్చుకు కనబడ్డమేలేదు! లోకంలో మనిషికి మనిషికి ఎంత వైవిధ్యం! సంపన్న కుటుంబంలో పుట్టాననీ, అన్ని సుఖాలు చవి చూశాననీ, మాటలలో మభ్యపెట్టిన చిరంజీవులువంటి వారిలో మానవత్వం తిరోగమనం సాగిస్తున్నది! ఇందుకు భిన్నంగా కడజాతిలో పుట్టినా, కడగండ్లు అనుభవించినా తండ్రి ఏనాడో చేసిన అకార్యానికి నిష్కృతిగా మంచి నీళ్ళిచ్చి మన్నన ఇచ్చి చెప్పు లిచ్చిన వెంకటేశ్వర్లులో మానవత్వం చిగుర్చుతున్నది. ఉత్తమ సంస్కారం జాతినిబట్టి వరించదన్నమాట!

వయస్సులో నాకంటే చిన్నవాడు కాబట్టి కాని చేతులెత్తి నమస్కారం చేయాలనిపించిది నాకు!

'వెంకటేశ్వర్లూ! ఎంతో పెద్దవాడ వయ్యావనీ, మంచివాడవయ్యావని నాకు పరమానందంగా ఉంది బాబూ! చాలా సేపైంది. వస్తాను'అని సంచి చేతిలోనికి తీసుకొన్నాను.

'ఉంటాను అయ్యగారు.... దండాలు' అని చేతులు జోడించాడు నమ్రతగా. కాని పుట్టుమచ్చవైపు చూసి చిరునవ్వు నవ్వుకొన్నాడు. అప్పుడు రైలుబండిలోని పుట్టుమచ్చల ప్రస్తావన మదిలో మెదిలింది!

కొత్తగా, మెత్తగా ఉన్న పాద రక్షలపై ఎండలో నేను హుందాగా నడుస్తున్నాను చిరంజీవులు చెప్పినట్లు ఈ పుట్టుమచ్చ మూలంగా నాకు దొరికిందేమిటి? ప్రశ్నించుకొన్నాను. 'పోయిన వస్తువు దొరికితే చాలదూ?' అన్నాడు, ఆ పాద రక్షల చోరుడు! 'అవును.... నాకు దొరికింది వస్తువేకాదు! అమూల్యమైన మానవత్వం!'






# రచయిత్రి మొగుడు

**— తిరుమలశ్రీ**

పెళ్ళిచూపులకు వెళ్ళిన రాజారాం, ఆ అమ్మాయి ప్రఖ్యాత రచయిత్రి అహల్య అని తెలియడంతో ఎగిరి గంతేసాడు. ఆమె అందగత్తె కాకపోయినా, అనాకారి మాత్రం కాదు. ఆమెవంక అభిమానంగా చూసాడతను

వాళ్ళ నాన్న కనీసం పదివేలయినా రాబట్టాలని చూస్తూంటే, తనకు కట్నమే అవసరంలేదని ప్రకటించేసి, పెళ్ళికి తన సమ్మతిని తెలియబరిచాడు రాజారాం.

మొదట 'గఁయ్'మన్నా చివరకు ఒప్పుకున్నాడు వాళ్ళ నాన్న. అందుకు రెండు కారణాలు వున్నాయి. మొదటిది — పిల్ల అందమైనదైతే తప్ప పెళ్ళిచూపు

లకు రానసే కొడుకు, ఆమె రచయిత్రి అనగానే కట్నం కూడా వద్దనేంతటి మోజు పెంచుకున్నాడు ఆమె మీద. అందమో అని మొత్తుకునేవాడు కాస్తా, ఆ విషయమే మరిచిపోయినట్లున్నాడు. అటువంటప్పుడు కాదన్నా వినడు వాడు. ఇక రెండవ కారణం — బంగారు గ్రుడ్లు పెట్టే బాతే తమ సొంతమవుతున్నప్పుడు గ్రుడ్ల కోసం దేవుళ్లాడడం అనవసరం అనుకున్నాడు అతను. ఆ పిల్ల పేరున్న రచయిత్రి. బోలెడు డబ్బులు కూడా సంపాదిస్తుంది అటువంటప్పుడు కట్నం కోసం ఆమెను వదులుకోవడం తెలివి తక్కువే అవుతుంది... ఇవన్నీ ఆలోచించి రాజారాం తండ్రి ఆ సంబంధానికి అంగీకరించాడు. కొడుక్కి కట్నం తీసుకోలేదన్న మంచిపేరు కూడా వస్తుందనుకున్నాడు.

రాజారాంను, మిత్రులంతా అభినందించారు — అహల్యవంటి ప్రముఖ రచయిత్రి అతనిభార్య అవుతున్నందుకు. మిత్రులు పొగుడుతూంటే చంద్రమండలానికి హనీమూన్ వెళ్ళినంతగా సంబరపడిపోయాడు అతను.

శోభనం గదిలో ఆతృతగా అహల్య కోసం ఎదురుచూస్తున్నాడు రాజారాం.

అతని మదిలో, అహల్య నవలల్లో వర్ణించే శోభనపురాత్రి, మనోల్లాసాన్ని కలిగించే వధూవరుల డైలాగ్స్ మెదిలాయి. తన అభిమాన రచయిత్రే తన అర్ధాంగి అయినందుకు, ఆ రాత్రి ఆమె పొందులో అనుభవించబోయే సర్వ సౌఖ్యాలను వూహించుకుని ఆనందంతో గాలిలో తేలిపోతున్నాడు. ఎప్పుడెప్పుడు ఆమెను తన బిగి కౌగిట్లో బంధించివేద్దామా అని వువ్విళ్లూరాడు.

కాసేపటికి అమ్మలక్కలంతా అహల్యను గదిలోకి త్రోసి తలుపులు మూసారు.

పాలనురగలాంటి తెల్లని చీరలో, వెన్నెల్లా మెరిసిపోతోంది అహల్య. ఆమె తలలోని మల్లెల సౌరభాలు గదంతా వెదజల్లుతున్నాయి. నునుసిగ్గుతో తల వంచుకుని గుమ్మంవద్దే నిలుచుండిపోయింది అహల్య. ఆమెను ఆ భంగిమలో చూస్తూంటే మరింత అందంగా కనిపించింది రాజారాంకు.

"అహల్యా!...." అన్నాడు మెల్లగా.

ఓరగా అతనివంక చూసి సిగ్గుతో మరింత కిందికి వంచుకుంది శిరస్సు.

నవ్వుకుని ఆమెను సమీపించాడు రాజారాం

మల్లెపూలను ఒకసారి గట్టిగా ఆఘ్రాణించి, ఆమెచుట్టూ చేతులు వేసి తనవైపుకు త్రిప్పుకున్నాడు. సిగ్గుతో మొగ్గే అయింది అహల్య. వంచిన తల ఎత్తకుండానే అతని హృదయానికి హత్తుకుపోయింది.

పాతికేళ్ళ, అహల్య — అవివాహిత అయినా, శోభనపు రాత్రులను గూర్చి

ఎంతో రమణీయంగా చిత్రించే అహల్య తనవరకు వచ్చేసరికి స్త్రీ సహజమైన సిగ్గుతో భర్త గుండెల్లో ముఖం దాచుకోవడం, రాజారాంకు నవ్వు తెప్పించింది, ముచ్చటవేసింది.

మెల్లగా ఆమెను బెడ్‌వద్దకు నడిపించుకు వెళ్ళాడు.

ఆమె సిగ్గును పోగొట్టాలని అతను ప్రయత్నించేకొలది మరింతగా ముకుళించుకు పోతోంది.

"అబ్బ, ప్రఖ్యాత రచయిత్రికి ఇంత సిగ్గయితే ఎలా ?" అంటూనే ఆమె పెదవులపైన చుంబించాడు రాజారాం. స్వీటు సగం కొరికి నోటితోనే ఆమె నోట్లోకి త్రోసాడు. సిగ్గుపడుతూనే స్వీకరించిందామె. కన్నులు మూసుకుని బల్లిలా అతని ఛాతీకి హత్తుకుపోయింది.

ఆమె సిగ్గును పోగొట్టి దారికి తెచ్చుకునేసరికి 'హమ్మయ్య' అనుకున్నాడు రాజారాం, 'ఈ రచయిత్రికి ఎంత సిగ్గు!' అనుకుంటూ.

స్వర్గలోకాలలో విహరిస్తున్న రాజారాం, అహల్య హఠాత్తుగా లేవడంతో ప్రశ్నార్థకంగా చూసాడు. వదిలితే మళ్ళీ చేతికి దొరకదేమోనన్నట్లు, మరింతగా పెనవేసుకుని, ఆమె పెదాలకు తన పెదాలను చేర్చాడు.

"ప్లీజ్...." అందామె.

ఎందుకన్నట్లు కళ్ళతోనే ప్రశ్నించాడు, వదలకుండానే.

"మంచి ఆలోచన ఒకటి వచ్చింది... కథకు ప్లాట్ రాసుకుని వచ్చేస్తాను" అందామె, అతని చేతులు విడిపించుకుంటూ.

ఆశ్చర్యంగా చూశాడు రాజారాం.

"ప్లాటా ?" అన్నాడు.

"వూఁ–" అంది గోముగా.

ఆ క్షణంలో ఆమెని వదలబుద్ధి కావడంలేదు అతనికి. చక్కని మధురానుభూతిలో వుండగా–మధ్య–ఈ ప్లాటేమిటి, పానకంలో పుడకలా అనిపించింది. అసలు తెల్లవారేంతవరకు అహల్యను తన కౌగిట్లోనుండి కదలనివ్వకూడదని వుంది

కాని....

ఏదో మంచి ఆలోచనట....కథకు ప్లాటవుతుందట....

బహుశా, ఈ మధురానుభూతి ఆమెలో మధురోహలను రేపి వుంటుంది. ఆమెలోని రచయిత్రిని మేల్కొలిపి వుంటుంది....అనుకున్నాడు.

అయిష్టంగానే కౌగిలి సడలించాడు.

కాగితమూ, కలమూ ముందే ఆ గదిలో వున్నాయి కాబోలు సిద్ధంగా. టేబిల్ దగ్గర కూర్చుని కొంటెగా అతనివైపో చిరునవ్వు విసిరి, వ్రాతకు వుపక్రమించింది.

ఆమె తలవంచుకుని చకచకా రాసుకుంటూంటే – బెడ్‌పైన పడుకునే, అందంగా కదులుతూన్న ఆమె చేతివంక

ఆమెవంక ఆరాధనగా, ఆప్యాయంగా చూస్తూ వుండిపోయాడు రాజారాం.

అలా ఎంతసేపు వున్నాడో తెలియదు. చూస్తూ చూస్తూనే నిద్రాదేవి వొడిలో వొరిగిపోయాడు.

తెల్లవారాక మెలకువ వచ్చిన రాజారాంకు ప్రక్కలో అహల్య కనిపించ లేదు

రాత్రి అనుభూతులు ఒకొక్కటే గుర్తుకొచ్చాయి. అహల్య రాసుకోవడము, తాను ఆమెను చూస్తూనే నిద్ర పోవడమూ జ్ఞాపకం వచ్చాయి.

అపురూపమయిన మొదటి రాత్రిలో చాలాభాగం వృథా అయిపోయిందే అని పించింది అతనికి.

## 2

తనకు హోటల్ భోజనం పడ లేదంటూ నెల తిరక్కుండానే భార్యను తీసుకొచ్చి కాపురం పెట్టేశాడు రాజారాం, అన్నాళ్ళూ పడిన హోటల్ భోజనం పెళ్ళవగానే పడడం మానేసిందన్నట్లు.

రాజారాం ఏదో కోపరేటివ్ బ్యాంకులో పనిచేస్తున్నాడు.

చిన్నదయినా, చూడ ముచ్చటగా వున్న రెండు గదుల ఇంట్లో భార్యా భర్త లిద్దరే వుంటున్నారు.

రాజారాంకు లోకమంతా ఎవర్ గ్రీన్ గానూ, జీవితం అద్భుతంగానూ కని పిస్తోంది, అహల్య వచ్చినప్పటినుండీను. ఆఫీసు వేళల్లో తప్పితే, ఇతర సమయాల్లో భార్యను ఒక్క నిముషం కూడా విడిచి వుండడం లేదతను.

అహల్యకు వంట ప్రయత్నంలో సాయంచేయడం మొదలు, ఆమె కథలు ఫెయిర్ చేయడంవరకు—సంతోషంగా చేస్తున్నాడు.

అతని మిత్రులు, పరిచయస్తులూ రాజారాంను ఫలానా 'రచయిత్రి భర్త'గా పిలుస్తూంటే ఎంతో గర్వంగా వుండే దతనికి. అహల్య నవల,కథలు ప్రచురణ అయినప్పుడల్లా అంతా అతన్ని అభి నందిస్తూ వుండేవారు. కొందరయితే 'రచయిత్రి భర్త' గా అతని అనుభవా లను గురించి ప్రశ్నిస్తూ వుండేవారు.

మొత్తానికి రాజారాంకు ఏదో థ్రిల్లూ, తెలియని ఆనందమూ కలుగుతూ వుండేవి.

అయితే—

రోజులు ఎప్పుడూ ఒకేలాగునవుంటే జీవితం చేదుగా వుంటుందేమో!

ఏ వస్తువు గాని, విషయం గాని క్రొత్తలో వున్న మోజును, కుతూహలాన్ని చిరకాలం కారీ చేయ లేదు. క్రొత్తమోజులో కనిపించని అవలోపాలు పాతబడేకొద్దీ అనుభవంలో వెలికి వస్తూంటాయి. ఇది సహజం.

అహల్య అవకాశం లభించినప్పుడు మాత్రమేకాక, అహర్నిశలూ - రచనా వ్యాపకంలోనే కూరుకుపోవడంతో రాజారాంకు విసుగు కలుగసాగింది.

ఉదయం లేచేసరికే ఏదో రాసుకుంటూ కూర్చొనేది. వ్రాత అయ్యాక హడావుడిగా వంట ప్రారంభించేది, ఇద్దరూ కలిసిచేసినా ఆఫీసు టైముకు వంట కావడం గగనమయ్యేది. ఒక్కోసారి అన్నం తీసుకు వెళ్ళకుండానే వెళ్ళిపోతూండేవాడు రాజారాం, హోటల్లో తినేస్తాన్లే అంటూ.

సాయంత్రం బ్యాంకు క్లోజు చేయగానే ఇంటికి పరిగెత్తు కొచ్చేవాడు, భార్యతో ఎక్కడికైనా షికారుకుగాని, సినిమాకుగాని వెళ్లాలని అతను వచ్చేటప్పటికి సీరియస్‌గా ఏదో రాసుకుంటూ కూర్చొనేది అహల్య. ఫ్లాస్కులో కాఫీ వుంది పోసుకు త్రాగమనేది, కూర్చున్న చోటినుండి కదలకుండానే!

ఉసూరు మనిపించేది రాజారాంకు.

అతను ఎదురుచూసేది వేరు .... అహల్య నవలల్లోని కథానాయకిలా వుండాలి తన భార్య.

భర్త అలసి సొలసి ఇంటికి వచ్చేసరికి పెదవులపైన చిరునవ్వుతో, చేతిలో కాఫీ కప్పుతో ఎదురువస్తుంది - అహల్య కథానాయిక. అప్పుడతను భార్య ముఖంచూస్తూనే తన శ్రమంతా మరచిపోతాడు. ఆమెను దగ్గరకు తీసుకుని, పెదవులపైన ముద్దులవర్షం కురిపిస్తూ, ఆమె త్రాగిస్తూంటే కాఫీ సిప్ చేస్తాడు. మధ్యమధ్య ఆమెకూ పట్టిస్తాడు ... ఇదీ రాజారాం కలలుకనే భార్య.

కాని—

అహల్య.. !!

ఆ శృంగారాలన్నీ తన నవలల్లోని నాయికలకే పరిమిత మన్నట్లు తన నిజ జీవితంలో ఒక్కనాడూ ప్రదర్శించిన పాపాన పోలేదు. అన్నిటికంటె యీ లోకంలో రచనావ్యాసంగ మొకటే ప్రధానమన్నట్లు ప్రవర్తిస్తుంది.

షికారుకు వెళదామంటే కాళ్ళు నొప్పులూ, టైమ్ వేస్టూ అంటుంది. ఇరవై నాలుగ్గంటలూ రాస్తూకూర్చుంటే చేతులు నొప్పులు పుట్టవు కాబోలు!

సినిమాకు వెళదామంటే తానురైటింగ్ మూడ్‌లో వుందనీ, మరోనాడు వెళదామనీ అంటుంది. దాంతో అతని మూడ్ మారిపోతుంది. ఇక ఎన్నడూ సినిమా వూసే ఎత్తకూడ దనిపిస్తుంది.

సాయంకాలం ఎక్కడికీ రాకపోతే మానింది, పోనీ కాసేపు కూర్చుని సరదాగా కబుర్లు చెప్పుకుందామన్నా వీలుపడదు.

ఫలానా పత్రికకు సీరియల్ రాస్తున్నాను. ఇంకో పాతిక పేజీలు రాస్తే పూర్తయిపోతుంది ... ప్లీజ్! ఈ పూట కాస్త వంటపని మీరే చూసుకోరూ? అంటోంది.

'హతోస్మి!' అనుకుంటూ వంటయింటి ప్రవేశం చేయక తప్పదితనికి. సరదాగా గడపవలసిన ఆ సాయంత్రం అలా సాంబారు, పులుసులతో కుస్తీపట్ట

వలసి వచ్చేసరికి ఎక్కడలేని చికాకూ వచ్చేసేది. అది ఎవరిమీద చూపాలో తెలియక, తప్పేళాలపైన, పోపు డబ్బాల పైనా చూపించేవాడు.

ఒకవేళ వంటపని తప్పితే, నవలో, కథో ఫెయిర్ చేసిపెట్టమని ముందు పడే సేది....పగలంతా ఆఫీసులో పనిచేసి వస్తే, సాయంత్రం కూడా కాగితాలతో కుస్తీ పట్టాలంటే విసుగనిపించేది.

పోనీ, రాత్రికయినా భార్య పక్కలోకి వస్తుందేమోనని ఆశతో ఎదురు చూసేవాడు.

అతని మనసు గ్రహించినదానిలా వచ్చి గాఢంగా ఒక ముద్దిచ్చి, "ప్లీజ్! ఓ పది పేజీలు రాసుకుని వచ్చేస్తాను.... బుద్ధిగా పడుకోరూ!" అంటూ వెళ్ళి పోయేది.

టేబిల్ లాంప్ వెలుతురులో సీరియస్‌గా రాస్తూ కూర్చునే భార్యను చూస్తూ, పురివిప్పుకున్న కోర్కెలతో, సలసల కాగే ఒంటితో నిద్రపట్టక చాలా సేపు బెడ్‌మీదే దొర్లేవాడు అతను. ఆ తర్వాత ఎప్పుడు నిద్రపోయేవాడో తెలిసేదికాదు ...తాను రేగే కోర్కెలతో వేగిపోతున్నప్పుడు ఆమె రాదు. ఆమె ఏ అర్ధరాత్రో ప్రక్కలో చేరేసరికి తాను గాఢనిద్రలో వుంటాడు ..'ఏం జీవితంరా బాబూ' అనుకుని నిట్టూర్చేవాడు.

దాదాపు ప్రతిరోజూ ఇదే చర్య కావడంతో విసుగెత్తిపోయాడు, రాజారాం. ఎప్పటికప్పుడు 'తప్పుతుందా, రచయిత్రి మొగుడాయె తాను!' అని సరిపెట్టుకోజూసేవాడు.

ఆ మధ్య మరో బెంగ పట్టుకుంది అతన్ని.

పెళ్ళికానంతవరకు 'ఫలానా రాజారాంగారు' అంటూ తనను గుర్తించే వాళ్ళంతా పెళ్ళయ్యాక 'ఫలానా రచయిత్రి మొగుడు'గా ముద్రవేసేసారు. తనపేరు మరిచిపోయినట్లు 'ప్రముఖరచయిత్రిగారి హస్బెండు' అంటూ ఆడా, మగా తనను పిలుస్తూంటే-తన ఒరిజినల్ ఐడెంటిటీనీ కోల్పోయినట్లు ఫీలవసాగాడు.

క్రమంగా అహల్య రచనలకు గిరాకీ పెరగడంతో, ఆమెకు చేతినిండా పని కూడా పెరిగిపోతోంది. పత్రికలు, ప్రచురణ సంస్థలు ఆమెను అప్రోచ్ చేయడంతో కమిట్‌మెంట్స్ ఎక్కువయి తీరికలేకుండాపోయిం దామెకు. చివరకు ఇంటిపనులను గూర్చి ఆలోచించే వ్యవధి కూడా లేకుండా పోయింది.

ఇలా వుండగానే, మరో మెంబరు వారి మధ్యకు రావడం జరిగింది.

పాపాయిని చూసుకునయినా తన రచనా వ్యాసంగాన్ని తగ్గించుకుంటుం దేమోనని ఆశించిన రాజారాంకు ఆశా భంగమే అయింది—

రాసుకుంటూంటే, పసిపిల్ల గుక్కపెట్టి ఏడుస్తున్నా తెలిసేదికాదు అహల్యకు. భర్త ఇంటిదగ్గరే వుంటే,



పిల్లను అతని కప్పగించేసేది, పాల సీసాతో సహా. పైగా, తల్లికోసం ఏడుస్తూ చేతుల్లోనుండి జారిపోతున్న చంటిదాన్ని ఎత్తుకోవడం చేతకాక, సత మతమయ్యే భర్తను చూసి కొంటెగా నవ్వేది. ఆమె నవ్వు అతనికి వొళ్లు మండించేది. 'ఇంకా నయం, నావల్ల కాని పనయిందిగాని, లేకుంటే పిల్లను కూడా నన్నే కనమనేదేమో తన బదులు!' అనుకున్నాడు.

భార్య రచనలు చేయడం ఇష్టమే! తన భార్య ఓ సుప్రసిద్ధ రచయిత్రి అని చెప్పు కోవడానికి అతను గర్వపడతాడు. అలా గని, ఇతర విషయాలేవీ పట్టించుకో కుండా భర్తను, పిల్లల్ని సయితం విస్మరించి కేవలం రచనలే లోకంగా, అదే పిచ్చిగా, ఇల్లూ, వొళ్లూ గుల్లచేసు కుని రాయడం మాత్రం అతనికి కిట్టదు. అవసరానికి ఒక్కోసారి రోజుల్తమానం కూర్చుని రాసినా కాదనడు. కాని, అదే దినచర్యగా పెట్టుకుని, తనను, పిల్లను నిర్లక్ష్యంచేస్తూంటే సహించలేక పోయే వాడు.

ఆ విషయమే ఒకసారి ఖచ్చితంగా

చెప్పేసాడు అహల్యతో. అలాగైతే మొత్తానికి రచనలే మాన్పించివేయాల్సి వుంటుందని బెదిరించాడు.

అందువల్ల కొద్దిరోజులు సాయంగా వుంటుందని చెల్లెలు శశిరేఖను రప్పించుకుంది అహల్య.

శశిరేఖ పి.యు.సి తో చదువాపేసింది. ఇక పెళ్ళిచేసి అత్తారింటికి పంపెయ్యాలనుకుంటున్నాడు తండ్రి.

శశిరేఖ అక్కయ్యకంటె అందంగా వుంటుంది. చిన్నపిల్లయినా ఏమాత్రం విసుక్కోకుండా ఇంటిపని, వంటపని అంతా చూసుకునేది. పసిదాన్ని కన్నతల్లిలా సాకేది. బావగారికి ఏ కష్టమూ కలగకుండా ఏమేం కావాలో అన్నీ వేళకు అమర్చిపెట్టేది.

చెల్లెలు రావడంతో పూర్తిగా రాతలో పడిపోయిన అహల్యకు, అన్ని విధాలా చేదోడుగా ఉండేది శశిరేఖ. చంటిది పడుకున్నంతసేపూ అక్కయ్య నవలలు ఫెయిర్ చేసి పెట్టేది.

మరదలి రాకతో ఇతర ఇబ్బందులంటే తప్పాయి కాని, అసలు ఇబ్బంది అలాగే వుంది. అది తీర్చగలది అహల్య ఒక్కతేనాయె!

ఎప్పుడైనా మరీ బోర్ కొడితే అలా బయటకు తిరిగొద్దాం రమ్మనేవాడు రాజారాం, భార్య విషయం తెలుసుండీ.

తాను రాసుకోవలసింది బోలెడు ఉందనో, లేక ఏదో నవలో, కథో ముగింపు ఘట్టంలో వున్నదనో చెప్పేది అహల్య. చెల్లెల్నీ! అతన్నీ వెళ్ళి రమ్మనేది. విసుగెత్తిన రాజారాం మరదలితో కలిసి చంటిదాన్ని తీసుకుని వెళ్ళిపోయేవాడు. ఆ విధంగా ఆ మధ్య శశిరేఖతో సినిమాలకు షికార్లకు వెళ్ళొస్తూనే వున్నాడు. కాని, భార్య ప్రక్కన లేదన్న లోటు, ఏ మూలో ఏదో అసంతృప్తి తేలుకొండిలా పొడుస్తూ వుండేవి.

రాత్రులు భార్య పక్కలోకి రావడం లేదన్న లోటు తప్పితే – ఇతర విషయాలలో మరే లోటూ లేకుండా అతన్ని చూసుకునేది శశిరేఖ. ఆ ఒక్క లోటూ తప్పిస్తే భార్యకంటె ఎక్కువగా చూసుకుంటోంది. ఆ పిల్ల ప్రేమాభిమానాలకు, సిన్సియారిటీకి ముగ్ధుడయ్యేవాడు రాజారాం.

ఇలా వుండగా ఒకసారి అహల్యకు పొరుగూరులోని ఏదో మహిళా మండలి నుండి ఆహ్వానం వచ్చింది – తమ వార్షికోత్సవ సందర్భంగా ఆమెకు సన్మానం జరుపదలుచుకొన్నట్లు. సంతోషంతో పొంగిపోయింది అహల్య.

మరో స్థితిలోనయితే అది రాజారాంకూ సంతోషదాయకంగానే వుండేది. కాని, అప్పటి పరిస్థితి వేరు!....కొద్దిరోజులుగా అతనికి భార్యపైన కోపంగా వుంటోంది. తెలియకుండానే దంపతుల మధ్య దూరం ఏర్పడింది. యవ్వనంలో వుండగానే కోర్కెలను తీర్చుకోలేక

పోతే, ముసలివాళ్ళయ్యాకనా అనిపించే దతనికి. భార్య తెలివితక్కువ కారణంగా తాను కోర్కెలు చంపుకోవలసిరావడం అతనికి చిరాకు తెప్పిస్తోంది.

అందుకే ఆమె తనకూడా రమ్మంటే రానన్నాడు. ఒక్కర్తెనే పంపించాడు.

## 3

అహల్య తిరిగివచ్చేసరికి నాలుగు రోజులు పట్టింది.

ఆమె రాగానే, "మీవాళ్ళు ఇప్పుడే వెళ్ళారు. మీ పుట్టింటికి కాబోలు బయలు దేరారు," అంటూ ప్రక్కింటావిడ వచ్చి ఇంటి తాళంచెవీ, ఓకవరూ అందించింది.

అంత హఠాత్తుగా తన పుట్టింటికి బయలుదేరారనేసరికి ఎవరికెలా ఉన్నదో నన్న భయంతో ఆతృతగా కవరు విప్పింది అహల్య.

"డియర్ అహల్యా!

రచయిత్రులంటే నాకెంత అభిమానమో నీకు తెలుసు. ఆ అభిమానంతోనే నిన్ను కట్నంకూడా తీసుకోకుండా పెళ్ళాడాను....నీకు అవసరమైన ప్రోత్సాహము, చేయూత ఇస్తూ వచ్చాను. కాని, దేనికైనా ఒక హద్దంటూ వుంది. అహల్యా! రచనలు చేయవలసిందే. రచయిత్రిగా పేరు తెచ్చుకోవలసిందే. అలాగని ఇంటిని, సంసారాన్ని నిర్లక్ష్యం చేసి కాదు. కట్టుకున్న భర్తను, కన్న బిడ్డను మరిచిపోయి కాదు....

అహల్యా! నువ్వు రాత్రీ, పగలూ అనకుండా రాసుకుంటూ కూర్చుంటే— పాపం అలసిపోతున్నావు, ఆరోగ్యం చెడగొట్టుకుంటున్నావన్న ఆతృతతో వంటపనిచేయడానికి వెనకాడలేదు నేను. యవ్వనపు కోర్కెలు కాగి చల్లారి పోతున్నా, మన యవ్వనం నిరర్థకమవుతున్నా ఎలాగో సహించాను. కాని, పసిపాప ఏడుస్తూవుంటే మాత్రం నా మనసు అంగీకరించలేకపోతోంది. నీ చర్యలను గర్హిస్తోంది. ఎదురు తిరుగుతోంది.

అహల్యా! నువ్వొక సుప్రసిద్ధ రచయిత్రివి. సంఘంకోసం దేశాభ్యుదయంకోసం నువ్వు కథలు, నవలలూ రాస్తూ వుండొచ్చును. నీ నవలల్లో, కథలలో జీవితసత్యాలెన్నో బోధిస్తూ వుంటావు. కాని, నీ జీవితానికి అవసరమయినదేమిటో తెలుసుకోలేకపోయావు. నీ సంసారాన్ని సుఖమయం చేసుకునే మార్గమేమిటో గ్రహించలేని నువ్వు— ఇతరులకు సందేశాల నివ్వడం ఫన్నీగా లేదూ?

ముఖ్యంగా ఏ స్త్రీ చేయని పొరపాటు చేసావు నువ్వు. ప్రేమానురాగాలను పంచి స్వయంగా సాకవలసిన కన్న బిడ్డనూ, కట్టుకున్న మొగుణ్ణి మరో యువతికి అప్పగించావు. రచనలే జీవితానికి నిర్వచనమన్నట్లుగా ప్రవర్తిస్తున్నావు ఏదైనా మోతాదు మించితే ఏమవుతుందో మరిచిపోయావు. ఫలితంగా

నీలోని రచయిత్రి పట్ల నాకు వున్న గౌరవాభిమానాలను అసూయా ద్వేషాలుగా మార్చివేసావు.

రచయిత్రి భర్తగా ఏమేమో వూహించుకుని మురిసిపోయేవాణ్ణి కొత్తలో. కాని, క్రమంగా అవన్నీ ఎండమావులనీ, రాతలకూ - చేతలకూ నడుమ హస్తిమశకాంతర ముంటుందనీ గ్రహించి నిరుత్సాహం చెందాను....

ఏనాటికైనా నీ పొరపాటు నువ్వు గుర్తిస్తావనీ, మన దాంపత్యం బంగారు పండుగ చేస్తావనీ ఆశించాను. కాని.... ఆ ఆశలన్నీ అడియాసలు చేసావు. నా సహనాన్ని పరాకాష్ఠకు తెచ్చావు....మన మార్గాలు ఎప్పటికయినా కలుస్తాయన్న ఆశ నశించింది.

సో, అహల్యా! బాగా ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చాను....నీకు-నేను, పాప అవసరంలేదు....నీ రచనలే నీ లోకం. అవి వుంటే నిద్రాహారాలు కూడా అవసరంలేదు నీకు....కాని, ఆ జీవితము, మనుషులూ అంతా నాకు కావాలి! పిచ్చి ముదిరిన భార్య మనసు మారేంతవరకూ వోపికతో ఎదురుచూసేంతటి సహనం నాలో చచ్చిపోయింది.

శశిరేఖకు నాపైన అంతులేని ప్రేమానురాగాలు వున్నాయి. నన్ను, పాపను తన కంటిపాపల్లా చూసుకుంటోంది ఆ పిల్ల.

అందుకే వెళ్ళిపోతున్నా నూ అహల్యా! పాపనూ, రేఖనూ తీసుకొని వెళ్ళిపోతున్నాను. నాకేం కావాలో గ్రహించి, వన్నర్థం చేసుకున్న శశిరేఖను వివాహమాడి; నా జీవితం అర్థవంతం చేసుకుంటాను. 'రచయిత్రి భర్త' గా కాక, మరలా నేను-నేనుగా గుర్తింపబడేందుకు ప్రయత్నిస్తాను. పాపను - ఒక రచయిత్రి కూతురుగా కాక, తల్లిదండ్రుల ప్రేమానురాగాలను పంచుకుని పెరిగే అందాల బొమ్మలా పెంచుకుంటాను.

అహల్యా! కడసారిగా నీకు నేనివ్వగలిగిన సలహా ఒక్కటే! నువ్వు ఆచరణలో పెట్టని విషయాలను గురించి రాయడం మానెయ్! రాతలకూ, చేతలకూ అన్వయం కుదిరిననాడే నువ్వు నిజమైన మనిషివవుతావు. లేకుంటే - అది జీవితం కాదు! ఎండిన మోడవుతుంది....

ఇకపైన నీ యిష్టం. ఎంతసేపైనా కూర్చుని రాసుకోవచ్చును. నిన్ను డిస్టర్బ్‌చేసేవాళ్ళుండరు. కాని.... ఏ కీర్తి ప్రతిష్ఠల కోసమైతే నువ్వందరినీ నిర్లక్ష్యంచేస్తున్నావో - అవి లభించిననాడు నీ ఆనందాన్నీ, అనుభూతినీ పంచుకునేందుకు ఆత్మీయులంటూ ఎవరూ మిగలక, అప్పుడు విచారిస్తావు.

అయాం సారీ, అహల్యా! ఎన్నో







కలలతో ఆరంభమయిన మన దాంపత్య జీవితం – ఇలా కలతలతో ఆఖరవుతున్నందుకు విచారిస్తున్నాను. 'ఐ రియల్లీ పిటీ యూ! ఇకనైనా జీవించడం నేర్చుకో....

ఆశీస్సులతో,

రాజారాం."

ఆ వుత్తరం చదువుకున్న అహల్య శిలాప్రతిమే అయింది

అంతలోనే తేరుకుని, "నో నో.... రచనలకోసం భర్తను, పాపను దూరం చేసుకోలేను. వాళ్ళ తరువాతనే తక్కిన వన్నీను రచనల కోసం సంసారం నాశనం చేసుకోలేను. మొదట ఇల్లాలిని నేను. ఆ తరువాతనే రచయిత్రిని. ఇన్నాళ్ళూ అజ్ఞానంలో పడి ఆయన్ని బాధపెట్టాను ఆయన మనసెంత కష్టపడకుంటే ఇటువంటి నిర్ణయానికి వచ్చి వుంటారు! ....లేదు, అలా జరగడానికి వీల్లేదు.... నాకు కనువిప్పు కలిగింది.... నేను మారానని చెబుతాను. నా తప్పిదం క్షమించమని ఆయన్ని వేడుకుంటాను" అనుకుంటూ వాచ్ చూసుకుందామె.

'ఓహ్, ట్రెయిన్‌కు ఇంకా అరగంట టైముంది వాళ్ళింకా స్టేషన్ లోనే వుంటారు....' అనుకుంటూ హడావుడిగా పరుగెత్తింది అహల్య.

---

# అరుణోదయం

కోసల నాగభూషణం



"సరిగా పదేళ్ల కిందట ఆనందరావనే అతను వేసేడు ఈ బొమ్మని" వెడల్పాటి చేకుబద్దని ఆధారంగా గోడకి ఏటవాలుగా తగిలించివున్న ఓ ఆయిల్ పెయింట్ చిత్రాన్ని చూపుతూ అన్నాడు కుందన్‌లాల్.

ఎదురుగా సోఫాలో కూచుని తదేకంగా దానికేసే చూస్తూ "చాలా బావుంది. ఎవరు వేసేరు దీన్ని?" అని అడిగిన రగంస్వామి ఆ సమాధానం విని కొంత ఆశ్చర్యాన్ని వ్యక్తం చేసేడు.

"రియల్లీ ఎ ఫైన్ పిక్చర్?" అని మరోసారి దాన్ని మెచ్చుకున్నాడు.

కుందన్‌లాల్ ఆ మద్రాసు మహా

నగరంలోనే ఓ పేరెన్నికగన్న వ్యాపారి. రంగస్వామితో కలిసి తను మేనేజింగ్ పార్టనర్‌గా పెద్ద ఇండస్ట్రీని నడుపు తున్నా డతను. అదిగాక ఆ మధ్యనే తండయార్‌పేట్‌లో స్వంతంగా ఓ కలపదుకాణం, ఇటుకల ఫ్యాక్టరీ పెట్టు కున్నాడు. అక్కడా ఇక్కడా తనకు నమ్మకమైన స్నేహితుల్ని వుంచి ఆ రెండింటినీ వాళ్ళచేతే మేనేజ్ చేయి స్తున్నాడు.

కుందన్‌లాల్ ఒంటరి. అతనికి నా అన్నవాళ్ళెవరూ లేరు. ఎక్కడో మైసూర్‌లోనూ, మధ్యప్రదేశ్‌లోనూ వ్యాపారరీత్యా వెళ్ళి అక్కడే సెటిలయిన బంధువు లుంటారంటాడుగాని వాళ్ళెవరూ ఇతన్ని చూడ్డానికి రారు. ఇతనూ వాళ్ళదగ్గరకి వెళ్ళడు.

కుందన్‌లాల్ మొదట్లో ఎల్లా వుండే వాడో తెలియదుగాని జపాన్‌నుంచి ఇంపోర్ట్ అయిన టెరిలీన్ బట్టల కొను గోలులో పరిచయమయ్యేడు రంగ స్వామికి. టన్నుల లెక్కలో స్టాక్ అయిపోయిన బట్టల్ని బ్లాక్‌గా సిటీలోని ఓ పెద్ద పార్టీకి నిమిషాలమీద ఆఫర్ చేసి తనకి అత్యంతాశ్చర్యజనకంగా మార్కెట్‌లోకి దింపించేసేడు కుందన్ లాల్. ఆ సీజన్‌లో అప్పటికొచ్చిన లాభం మాత్రం ఎనభై వేలు. ఆ బిజినెస్ లోని టాక్టిక్స్‌ని మెచ్చుకుని ఆ లాభంలో తనే సగం అతనికిచ్చేడు రంగస్వామి.

అప్పట్నుంచి రంగస్వామి కుందన్ లాల్‌తో కలిసే చేయసాగేడు వ్యాపా రాన్ని. పండగపబ్బాలకి తమ ఇంటికి ఆహ్వానిస్తూ తమ సుఖసంతోషాలతో కొంతకొంతగా వెలిగించసాగేడు అతని ఒంటరి జీవితాన్ని.

వస్తువులు, కొనుగోలు, అమ్మకాలు, చెక్కులు, బిజినెస్ లెటర్లు, సంతకాలు అంతా ప్రాణంలేని వస్తువులతోనూ, కాగితాలతోనూ ఏండిపోయి కుందన్ లాల్ జీవితం నిస్సారంగా ఎండి పోయింది. చీకటి బజారు వ్యాపారం అతని పరిసరాలని డబ్బులతో నింపినట్టే చీకటితోనూ నింపిపోయింది.

ఎప్పుడయినా తీరిక దొరికిన సమ యాల్లో అతనికి జీవితాన్ని గురించి గుర్తుచేయబోతే వారించేవాడు రంగ స్వామిని. పోనీ ఈ లోకంలో డబ్బు లతో కొనుక్కోదగిన అందాలనీ, అనుభవాలనీ అయినా ఆశిస్తాడా అంటే అసలా ధ్యాసే తనకి వున్నట్టుకనబడదు. వ్యాపార వ్యవహారాల్లో మినహాయించి స్నేహితుల మధ్య ఉన్నప్పుడు చాలా సెంటిమెంటల్‌గా వుంటాడు. అన్నిటి కన్నా మనిషికి నైతిక విలువలే ముఖ్య మంటాడు. విస్కీ సీసాలు, ఆడపిల్లలు నాగరికత వేదికనెక్కి నర్తించే అటవి కతకి అఘోరించిన అలంకారాలంటాడు.

ఇక అల్లాంటి కుందన్‌లాల్‌కి ఏమని సలహా ఇవ్వగలడు రంగస్వామి?

మొన్నమొన్నటివరకూ తనకంటూ దేన్నీ సమకూర్చుకోని అతను 'చివరికి తనదంటూ కనీసం ఇదయినా మిగలనీ' అని లక్షరూపాయల కాంట్రాక్టింగ్‌తో ముచ్చటైన ఓ రెండంతస్తుల మేడని కట్టించుకున్నాడు.

ఆ ముందటిరోజే బిజినెస్ మాగ్నెట్స్ అనిపించుకున్న తన స్నేహితులందరినీ ఆహ్వానించి వారిచ్చే శుభాశంసల నందుకుంటూ గృహప్రవేశం చేసేడు. పెద్ద యెత్తున అందరికీ పార్టీ ఇచ్చేడు.

ఆ పార్టీ ముగిసేక తమ తమ బెటరాఫ్‌లతోనూ, పిల్లలతోనూ స్కూటర్ల మీదా, కార్లలోనూ వెళ్ళిపోతున్న గెస్ట్‌లకి కారిడార్‌లో నుంచుని వీడ్కోలు చెప్పేడు కుందన్‌లాల్.

వాళ్ళందరూ వెళ్ళిపోయేక తన తోటే నిలిచిన రంగస్వామితో కలిసి ఇంట్లోకి నడిచేడు. అంతవరకూ ఆప్తులతో, విందులు వినోదాలతో కళకళలాడిన ఆ మేడ ఒక్కమారుగా కళావిహీనమై తోచింది అతనికి. తిన్నగా కాళ్ళీడ్చుకుంటూ వచ్చి సోఫాలో కూలబడిన కుందన్‌లాల్ కళ్ళవెంట మొట్టమొదటిసారిగా కన్నీళ్ళని చూసేడు రంగస్వామి. చలించిపోయేడు క్షణం సేపు. తనూ అతని పక్కనే కూచుంటూ అన్నాడు లాలనగా, "కుందన్‌లాల్ ! అడిగినా చెప్పవు నీ వెనకటి స్థితిగతుల్ని. పోనీ గతాన్ని మరిచి కొత్తగా అయినా జీవితాన్ని ప్రారంభిస్తావంటేనా సనేమిరా ఒప్పుకోవు. ఏమిటి నీ ధోరణి ? ఎంత కాలం వుంటావు ఇలా ఒంటరిగా ?"

కుందన్‌లాల్ కోటు జేబులోంచి చేరుమాలు తీసి కళ్ళొత్తుకున్నాడు.

"నో.... నో నథింగ్ లైక్ దట్ మిస్టర్ స్వామి ! ఏదో గతం తాలూకు ఓ అందమైన జ్ఞాపకం. ఆ ఆనందం పట్టలేకే ఈ కన్నీళ్ళు - అందుకు ఆనవాళ్ళుగా." నవ్వడానికి ప్రయత్నించేడు కుందన్‌లాల్. చివరికి నవ్వేడు కూడా. అయినా రంగస్వామికి తెలుసు ఆ నవ్వు నవ్వు కాదని - అది వట్టి కాగితం పువ్వే అని !

మొత్తానికి కుందన్‌లాల్ జీవితంలో చాలా బాగా దెబ్బతిన్న వ్యక్తి. అతని గతంలో కొంత చీకటి వృత్తాంతం వుంది. ఐశ్వర్యంతో, హోదాతో అతనిప్పుడు సంపాయిస్తోన్న వెలుగు వెలిగించడం లేదు ఆ చీకటిని. ఆ చీకటినే కళ్ళవెనక దాచుకుని ఒకప్పుడు తనని శాసించిన జీవితాన్నే తనిప్పుడు శాసిస్తున్నాడు తనకి తెలియక ఆ శాసనాన్ని, శిక్షని తనే అనుభవిస్తున్నాడు.

"ఇదీ నా పూర్ణ వ్యక్తిత్వం" అని తన ముందు నిలబడగలడా కుందన్‌లాల్ ఎప్పటికయినా? అసలా అవకాశం తనకి కలిగిస్తాడా ?"

"ప్చ్. లాభం లేదు. మొండి మనిషి"

మనస్సు నంతటితో కట్టేసుకున్నాడు రంగస్వామి.

"సరే అయితే.... ఇప్పటికింకేం చేస్తావు? పిక్చర్ కెళదాం రా! "ఎంటర్ ది డ్రాగన్" "ఆనంద్"లో. జీవితంలో దెబ్బలాడే మనిషివి. మనుషులతో దెబ్బలాడడం ఎలాగో చూడాలి నువ్వు తప్పక." లేవదీసేడు బలవంతాన కుందన్‌లాల్‌ని.

సినిమా చూసి, దార్లో వస్తూ 'సంగమ్'లో డిన్నర్ కానిచ్చి తన కార్లోనే కుందన్‌లాల్‌ని ఇంటి దగ్గర డ్రాప్‌చేసి 'గుడ్ నైట్' అంటూ వెళ్ళేడు రంగస్వామి.

కుందన్‌లాల్ నిలుచున్నది వెలుగుల మేడలోనే అయినా అతను చీకటి ఎడారిలో ఒంటరి బాటసారిలాగానే అనిపించేడు రంగస్వామికి.

ఆ రాత్రంతా అతని తాలూకు ఆలోచనలతోనే గడిపిన రంగస్వామికి ఆ మరుసటి పుదయం పదిగంటలకల్లా ఫోన్ చేసేడు కుందన్‌లాల్ "ఇవాళ చుట్టాలొస్తున్నారు మా ఇంటికి" అని.

అందులో ప్రత్యేకంగా వినిపించిన 'మా ఇంటికి' అనే మాటని విని పాతిక సెకన్ల వరకూ ఏమాటా చెప్పలేదు రంగస్వామి.

"వాట్ స్వామీ? వింటున్నావా?" అని మళ్ళీ కుందన్‌లాల్ రెట్టించి అడిగితే_అప్పటికి తేరుకుని

"ఎస్....ఎస్. సడన్‌గా సర్‌ప్రయిజ్ అయ్యేను. వాటీజ్ ది మేటర్? చెప్పవా ఆ చుట్టాలెవరో?" కుతూహలంగా అడిగేడు రంగస్వామి.

"నో! నేన్చెప్పను. నువ్విప్పుడటికి ఆఫీస్ పనులన్నీ అసిస్టెంటుకి అప్పజెప్పి ఇక్కడికి కొచ్చేసెయ్ వెంటనే_ స్వయంగా చూద్దువుగాని చుట్టాన్ని. ముందుగా తెలిసినా నేన్నీకు చెప్పని ఆ చుట్టాన్ని గురించి ఊహించు కొంత. ఫీల్ దట్ థ్రిల్. బై" అవతల ఫోన్ డిస్‌కనెక్ట్ చేసిన చప్పుడు.

కుందన్‌లాల్ మాటలు ఫోన్‌లోనే వినిపించినా సంతోషంతో ఆ కంఠం ఎంతలా వొణికిందో, మాటల్లోకి ఆ సంతోషం ఎలా వెల్లువలా ఉరికిందో అర్థమైంది రంగస్వామికి. చకచకా తనే అర్జెంటయిన ఆర్డర్లకి సంతకాలు చేసేసి, తక్కిన ఆఫీస్ పనులకి అసిస్టెంట్‌ని పురమాయించి మరో అరగంటకల్లా కుందన్‌లాల్ ఇంటిముందు వొచ్చి వాలేడు రంగస్వామి. కార్లోంచి దిగీ దిగగానే ఇంట్లోకెళ్ళి ఎదురయిన పని మనిషిని 'అయ్యగారేరీ' అని అడిగి, అతను డ్రాయింగ్‌రూంలో వున్నాడని తెలుసుకుని మేడమెట్లెక్కి ఆ రూంలోకి అడుగుపెట్టేడు.

అక్కడ కిటికీకి పక్కగా, గోడకి చేరువగా నుంచుని తలకి కొంత ఎత్తులోనే వున్న ఓ ఆయిల్‌పెయింట్

చిత్రంకేసే చూస్తూ నిశ్చలంగా వున్న కుందనలాల్‌ని చిత్రంగా చూసేడు రంగస్వామి. అతనిలో ఆనాడే మేల్కొన్న మరో కొత్త వ్యక్తిని చూసేడు. ఇలా అతన్ని చూస్తూనే సోఫాలోంచి లేచుకుని తన ముందుని చిత్రం కేసి కదిలేడు.

ఉధృతమైన గాలికి అల్లాడిపోతూ ఎగిరే పక్షులతో నిండిన ఆకాశంకింద చుట్టూ చెట్లు విరిగి, కొండలు కూలి పడనున్న అగాధమైన లోయలో అసహాయంగా చేతులు పైకెత్తి నిలబడ్డ వ్యక్తి చిత్రం అది.

అందులో గీతలకీ, రంగులకీ అద్దిన ఏదో బాధ, విషాదం దాన్ని చూస్తోన్న కళ్ళల్లోంచి అతని హృదయంలోకి పాకింది.

ఆ తన్మయత్వంలోంచి తేరుకుని కొన్ని నిమిషాల తర్వాత అన్నాడు రంగస్వామి, "చాలా బావుంది. ఎవరు వేసేరు దీన్ని?" అని.

పరిసరాలని మరిచి ఆ భావంలోనే మునిగిన కుందన్‌లాల్ ఒక తడినవ్వుతోనే మిత్రుణ్ణి పలకరించి అన్నాడు సమాధానంగా. "సరిగా పదేళ్ళ కిందట ఆనందరావనే అతను వేసేడు ఈ బొమ్మని."

* * *

"ఎన్నాళ్ళకి విన్నాను నీ నోటంట నీ గతచరిత్రలోని నాకు తెలియని ఓ వ్యక్తి పేరు!" తనకి తనే ఆనంద పడిపోయేడు రంగస్వామి. అడిగేడు అతన్ని, "ఆనందరావెవరు? నీ ఫ్రెండా? బంధువా?"

"రెండూ కాదు. నా ప్రాణంలో ప్రాణం ఆనందరావు — నాకు మిగిలిన ఒకే ఒక్క తీపి జ్ఞాపకం."

కుందన్‌లాల్ అక్కడినుంచి కదిలి తన పడకకి చేరువగా గదిగోడలో అమర్చిన బజర్‌ని నొక్కి మళ్ళీ వొచ్చి కూచున్నాడు రంగస్వామి ఎదురుగా.

అతని వెనకే ఓ కుర్రాడు వొచ్చేడు రెండు కాఫీ కప్పులతో. చెరో కప్పూ ఇచ్చేడు. ఆ గదిలోనే టేబుల్ పైనున్న యాష్‌ట్రేని తెచ్చి సోఫాముందటి స్టూల్ మీద వుంచేడు. ఖాళీ అయిన కప్పుల్ని తీసుకుని వెళ్ళిపోయేడు కిందికి.

రంగస్వామి పైప్ వెలిగించేడు

కుందన్‌లాల్ చెప్పడం సాగించేడు.

"పదేళ్ళకి కిందటనాను ఆనందరావి బొమ్మకి వెయ్యడం. అప్పటికి కొంత ఇంచుమించుగా పాతికేళ్ళు వుండేయి అతనికి. అతని తెలివితేటలకిగుర్తింపుగా యూనివర్సిటీవాళ్ళిచ్చిన ఫస్ట్ క్లాస్ సర్టిఫికెట్టూ వొచ్చింది చేతికి. అప్పట్లో వుద్యోగాల పరిస్థితులు ఇప్పుడున్నట్టు లేవు. ఇప్పుడయితే పోస్ట్‌గ్రాడ్యుయేట్ అయినా టెక్నికల్‌గానో, మరోవిధంగానో, స్వశక్తిమీద ఆధారపడి సంపాదనాపరుడవుతున్నాడుగాని పట్టభద్రుడయిన ప్రతి

వాడూ ప్రభుత్వోద్యోగమే చెయ్యాలను కునే రోజులవి. ఆనందరావు వుద్యోగం కోసం అన్వేషించడం ఆ ఉద్దేశంతో తాకపోయినా అతనిలా అన్నివిధాలా అర్హత ఉన్న వాళ్ళని ప్రభుత్వం గుర్తించలేనంత గడ్డుపరిస్థితుల్ని సృష్టించేరు ప్రజలు ఆ రకమైన మెంటాలిటీతో. దానితో ఇంటర్వ్యూలకి కొండంత ఆశతో వెళ్ళే ఆనందరావు వెళ్ళిన ప్రతిచోటినుంచి నిరాశతోనే తిరిగొచ్చేవాడు. నిట్టూర్చేవాడు.

ఇప్పుడిలా నేను సెటిల్డ్ అయిన జీవితంలో, ఎయిర్‌కండిషన్డ్ గదుల్లో, కుషన్ పరుపుల్లో తీరిగ్గా తిని కూచుని వెనక్కి తిరిగి చూస్తోంటే ఇప్పటికీ ఆ విషాదంలోని ఒత్తిడి తగ్గి కొంత మాలిమిగా కనబడుతున్నాయి గాని నిజానికి ఆ ఆనందరావు అనుభవించిన చిత్రహింస, ఎదుర్కొన్న చేదు అనుభవాలు ఎంతో ఘోరమైనవి!

అతని జీవితం వడ్డించిన విస్తరి కాదు.

చిన్నప్పుడే నాన్నగారు పోయిన అతని కుటుంబానికి అతను తప్ప వేరే ఆధారమేమీ మిగల్లేదు. ఎదిగిన చెల్లెలు, దైన్యానికి మారురూపంగా నిలిచిన తల్లి ఇంట్లో పూట గడవదు. ఉన్న ఒకటీ రెండు నగలూ అమ్మి ఇంటర్వ్యూలకి ఖర్చులకింద వాడుకోవడం. కళ్ళని మెరిపించే కరెన్సీ నోట్లుగాని, ఒళ్ళు దగ్గరుంచి ఉద్యోగం వేయించే పై అధికారుల రికమెండేషన్ లెటర్లుగాని లేవు ఆనందరావుకి — నిద్రాహారాలు మాని తను కష్టపడి సాధించుకున్న సర్టిఫికెట్ ఒక్కటి తప్ప. బంధువుల్లేరు. అవసరాలకి ఆదుకునే ఆప్తుల్లేరు. పైగా అప్పులవాళ్ళ పోరు. చివరికి ఇల్లు కూడా తెగనమ్మి, తన రెక్కల కష్టాన్నే నమ్మి అమ్మా చెల్లెళ్ళతో వేరే వూరికి తరలిపోయేడు ఆనందరావు.

ఆ వూళ్ళోనే పి డబుల్యు డిలో క్లర్క్ పోస్ట్‌కి ఇంటర్వ్యూకి వెళ్ళి, ఆ వుద్యోగం రాక అక్కడే కాస్త కనికరం చూపగలిగిన ఓ కంట్రాక్టర్ని బతిమాలి రోజువారీ కూలీగా రాళ్ళు మోసే పనిలోకి కుదిరేడు.

ఒకనాడు ఆ వూరికి వెలుపల ట్రావెలర్స్ బంగళా నిర్మాణం జరుగుతోండగా, "ఈ వర్కింగ్ స్పాట్ తాలూకు లే-ఔట్ మరిచిపోయేను. ఇంటికెళ్ళి తీసుకురా." అని ఆ కంట్రాక్టర్ పురమితే వాళ్ళింటి కెళ్ళేడు ఆనందరావు. ఇంటిముందు కనిపించిన కంట్రాక్టర్‌గారి కొడుకుతో విషయం చెప్పి పంపేడు. వాడు వెళ్ళి ఆ చెప్పడానికేమో నోరు తిరక్క "మిమ్మల్నే రమ్మంటున్నా" రని చెప్పి వీధిలోకి పారిపోతే...

భుజంమీది తువ్వాలుతో మొహానికి పట్టిన చెమటని తుడుచుకుంటూ లోపలికి వెళ్ళి...

"ఏం తెమ్మన్నారండీ! నాన్నగారు"
అంటూ వొచ్చిన ఓ ఆకారాన్ని చూసి
అలానే స్థాణువులా నిలబడిపోయేడు
ఆనందరావు."

అగేడు కుందన్‌లాల్, అడిగేడు రంగస్వామిపు, "ఊహించగలవా అతిసి కెదురైన ఆ వ్యక్తి ఎవరో?"

అమాత్రం అలస్యాన్ని భరించలేక చెప్పమన్నట్టు కళ్ళతోనే త్వరపెట్టి పైప్‌ని పక్కన పడేసిన రంగస్వామితో చెప్పసాగేడు కుందన్‌లాల్. "అవ్యక్తి ఆనందరావుతో బీ మూడేళ్ళపాటు కలిసి చదువుకున్న అతని స్నేహితురాలు సీలిమ. అంతమాత్రమే కాదు. అతని కాలెజీ జీవితంలోనూ అతని ఆకర్షణకు లోనై, తనకి తనే చేరువై అతని జీవితంలోనూ పాలుపంచుకోవాలని ఆశించిన సీలిమ. అంతస్తులు వేరు, తిమున్న స్థితిగతులు వేరు అని ఆ చివరిరోజుల్లో అతనిచేతి లాలనతో తిరస్కరింపబడిన సీలిమ. మనసు అద్దంలో ప్రతిఫలించిన ఆనందరావు ఆకారాన్ని మరెన్నటికీ చెరిపివేసుకోలేని సీలిమ!

"పాతికేళ్ళ వయసులో జీవితాన్ని రంగులస్వప్నంలా మార్చుకోవాలన్న తపనతో అహర్నిశమూ ఆలోచించి శ్రమించే ఆ యువకుని ఆత్మవిశ్వాసం మీద అలా అనాడు ఆమెని తిరస్కరింప జేసిన ఆ దుస్థితి ఎంతగా దెబ్బతీసి వుంటుందో ఒక్కమాటు ఆలోచించు!

"అలా ఆమెని చూసి నోటమాటరాక ఆమె తనని వెనక చేరి పిలుస్తున్నా వినిపించుకోక, "ఇదీ సీలిమా! నీకూ నాకూ నడుమనున్న తేడా," అని ఆ కాగితాలని అడిగి తీసుకుని వెళ్ళి కంట్రాక్టర్‌కిచ్చి "ఒళ్ళు బాగోలేదు. ఇవాళ సెలవిప్పించండి" అని ఇంటికి తిరుగుముఖం పట్టి పాడయిన మనస్సుతో ఆ రోజల్లా ఇంట్లోనే కూలబడిన ఆనందరావుకి—

"అన్నయ్యకి సాయంగా వుంటుంది. నేనూ వెళతానమ్మా! పనిలోకి" అని అమ్మతో చెప్పి ఆ వుదయం ఆ వాడ లోని కలిగిన వాళ్ళ మేడలోకి పాచిపనికి వెళ్ళిన చెల్లెలి శవం సాయంత్రానికల్లా ఎదురయితే.

"ఎంతటి ఆ అఘాయిత్యానికీ అనపిల్లల శీలంతో ఆడుకునే ఆ మేడలోని దొరబాబే కారకుడని తెలిస్తే—

"అప్పుడిక ఎల్లా వుంటుందతని క్షోభ! ఎంత క్రోధం, ఎంత కక్ష, ఎంత ఆవేశం అగ్నిశిఖల్లా ఆవరించి వుంటాయతన్ని!

"వెంటనే ఉన్నఫళంగా ఆనందరావు వారించే అమ్మని తోసి ఆ మేడలోకి దూసుకెళ్ళి మందుమత్తులో మునిగితేలే ఆ నరరూపరాక్షసుడి కంఠాన్ని పట్టుకు నులిమి చంపి పారేసి వెన్నంటితరిమే పోలీసుల బారినుండి తప్పించుకుని



తప్పించుకుని పారిపోయేడు [illegible]వెంట నాలో ఓ జ్ఞాపకంగా మిగిలిపోయేడు.

*కాలం తీరి క[illegible]కున్న భర్తా, కాలం కలిసిరాక కన్న కూతురూ, కొడుకూ తననించి దూరమైతే ఏ ఆధారమూలేక తనవాళ్లెవరూ లేనిచోట దిక్కులేనిదై ఆ తల్లి ఏమయిందో! ఒకవేళ హంతకుడైన కొడుకు ఆచూకీ చెప్పమని గదమాయించే పోలీసుల నిర్బంధంలో వుండి దిగులుతో, బాధతో క్రుంగి, కృశించి, జబ్బునపడి చివరి క్షణాల్లో తన మొహంలోకి చూస్తూ కన్నీళ్ళు విడిచే

ఆస్తులు దగ్గరలేక ఎల్లా కాలగర్భంలో కలిసిపోయిందో !"

కుందన్‌లాల్ చిన్నపిల్లాడేఅయ్యేడు. ఉబికే కన్నీళ్ళని ఆపుకోలేకపోయేడు.

ఆనందరావు గీసిన బొమ్మ తనలో కలిగించినంతటి విషాదాన్నే అతని కథా కలిగించగా అందులోంచి మరి కాసేపటికి తేరుకుని అడిగేడు రంగస్వామి సంశయంగా "అయితే ఈ ఫోటో, అతనంతకుముందే ఇచ్చేడా నీకు ?"

కుందన్‌లాల్ తనను తానే ఊరడించుకున్నాడు. అన్నాడు "లేదు ఈ చిత్రం అతనప్పట్లో వేసింది మాత్రం కాదు."

"మరి ఆనందరావు దేశాలవెంట పారిపోయింతర్వాత కూడా నీకు కనిపించి వుండాలన్నమాట ! లేకుంటే అతని చిత్రం అసలైన నీ చేతికి రావడానికి వీల్లేదుగా."

కుందన్‌లాల్ కొంత ఆలోచించేడు.

"నిజమే. అసలు సంగతి చెప్పాలి అలా వూళ్ళవెంట పారిపోయిన ఆనందరావు మరెక్కడికో వెళ్ళలేదు. తిరిగి తిరిగి ఈ మద్రాసుకే వొచ్చేడు. ఈ పనీ ఆ పనీ అనకుండా చేతనైన ప్రతిపనీ చేసేడు కడుపుకోసం ! అఖరికో హోటల్ ప్రొప్రయిటర్ ధర్మమా అంటూ అతనికి తెలిసినవాళ్ళ సాయంతో కళాసీగా చేరేడు హార్బర్లో. అలా కొంతకాలం అక్కడే గడిపి ఓ రోజున అనుకోకుండా ఆత్మహత్య చేసుకున్నాడు ఆనందరావు."

"వాట్ ....ఆత్మహత్యా ! బ్రతుకిక్కి ఓ ఆధారం అంటూ దొరికేక అంతపనీ ఎందుకు చేసుకోవాలి అతను ?" సోఫాలోంచి లేచి చూసుని ప్రశ్నించేడు రంగస్వామి.

"అది ఆత్మహత్య ఓ రకంగా ! తనని తనే—వ్యక్తిత్వాన్నే చంపుకోవడం. మొదటిసారిగా ఫారెన్‌నుంచి వొచ్చిన ఓ ట్రాన్సిస్టర్ని హార్బర్లో దొంగిలించి బయట బజార్లో చాటుగా అమ్ముకోవడం !

ఆరాత్రే తన ఆనందానికి కారణాలు కావలసిన ఆ గీతలూ కానా, రంగులూ నేలలో ఎల్లా పసుపారిక విరిగిపడి తన జీవితాన్ని బలిగొన్నాయో చిత్రించి, దానివెనక తన వ్యక్తిత్వాన్ని సమాధి చేసిన సమాజం పరిస్థితుల్ని సంకేతంగా సూచించి ఆ చిత్రంలో తనే వస్తువయ్యేడు ఆనందరావు.

"అదే మొదలు అతని జీవితంలో స్మగ్లింగ్. వేలకి వేలు, లక్షలకి లక్షలు సంపాయించి చివరికైన ఆ స్మగ్లింగ్‌కి స్వస్తిచెప్పి ఈ సిటీలోనే ఓ పెద్ద మనిషినని చెప్పుతూ గుప్పెట్లోంచి పాములా జారిన గతాన్ని, జీవితాన్ని మననం చేసుకుంటూ ఓకరాత్రిలాంటి వర్తమానాన్ని ఎల్లాగో గడుపుతున్నాడతను."

రంగస్వామి సోఫాలోంచి కదిలి నిటారుగా కూచుని అడిగేడు ఆతృతగా "ఈ సిటీలోనేనా? ఎక్కడ?"

"ఇదిగో ఇక్కడే! నీ ముందరే— పోలీసులకి భయపడి పారిపోయిన్నాడు మార్చేసుకున్న పేరుతో."

ఆశ్చర్యపోయేడు రంగస్వామి. అమాంతంగా కౌగలించుకొన్నాడతన్ని.

ఆ సమయానికే కాలింగ్ బెల్ మోగితే రంగస్వామితో కలిసి మేడ మెట్లు దిగేడు ఆనందరావు ఉరఫ్ కుందన్‌లాల్. తొందరగా కారిడార్‌లోకి నడిచేడు.

అప్పుడే ఇంటిముందాగిన టాక్సీలోంచి దిగిన వ్యక్తిని ఆహ్వానించేడు. ఆమె చేతిని అందుకున్నాడు. ఆమెతో కలిసి రంగస్వామికి ఎదురుగా వొచ్చి నిలిచేడు.

"ఇంతకు ముందే చెప్పాను ఈమెని గురించి. ఇప్పుడు చూస్తున్నావు. ఈవిడే నీలిమ!" చెప్పేడు ఆనందరావు.

ఆదివరకే అయ్యగారు అంతా తమకి చెప్పినట్టు ఓ పళ్ళెంలో మట్టిగాజులూ, కుంకుమ భరిణా, పువ్వులూ వుంచుకుని వొచ్చింది అక్కడికి వంటమనిషి తాయారు. కొత్తగా వొచ్చిన యజమానురాలికేసి ఆరాధనగా చూసింది.

తెచ్చిన పళ్ళెన్ని పక్కనుంచి దోసిగా వున్న నీలిమ చేతులకి గాజులు తొడిగింది తాయారు.

కూర్చి కట్టిన పువ్వుల్ని సుతారంగా సిగలో తురిమి, భరిణలోంచి కుంకుమ తీసి నీలిమ నుదుటన వుంచేడు ఆనందరావు.

ఆ కుంకుమ తెల్లని బుగ్గల్లో ఇంకా మంచుతెరలు తొలగిపోని తూర్పు దిక్కులా వున్న ఆమె మొహంలో ఎర్రగా సూర్యబింబంలా వెలిగింది.

"ఇన్ని ఏళ్ళ తర్వాత ఇతని చీకటి బ్రతుకున ఈనాడే ఉషోదయమైంది!" అనుకున్నాడు రంగస్వామి.






ఎన్నో లక్షల కుటుంబాల కష్టాలకు, కన్నీళ్ళకు, కక్షలకు, కార్పణ్యాలకు కారణమవుతున్న మద్యపానాన్ని దేశవ్యాప్తంగా నిషేధించాలని ప్రభుత్వ ఆశయం.

ఆ ఆశయమే అమలుపరచబడితే—

రాత్రి తొమ్మిది గంటలైంది. మైసమ్మ గుమ్మంలో కాళ్ళు బారజాపుకుని కూర్చుంది. కాళ్ళమీద పడుకున్న పిల్ల ఏడ్చి ఏడ్చి ఓపికలేక నిద్రపోయింది బయట వెన్నెల కాస్తోంది చల్లగాలి హాయిగా వీస్తోంది. రేషనుకార్డు ఉన్నా, లేకున్నా అందరికీ పుష్కలంగా దొరికే ఆ తెల్లని వెన్నెల, చల్లనిగాలి కూడా మైసమ్మకు దొరకటంలేదు. దేవుడి దయలాగానే అవీ ఆ గుడిసె గుమ్మందాకానే వచ్చి ఆగిపోతున్నాయి. పోనీ తనే గుమ్మందాటి రావాలంటే పిల్ల కాళ్ళు పట్టేసుకుని పడుకుంది. అదీగాక, మైసమ్మ గుడిసె గుమ్మం లోపల కూర్చోవల్సిందేగాని బయట కూర్చునే యోగ్యతలేదు. అక్కడొక

పెద్ద మురుగుకాలవ గంగానదికన్న గంభీరంగా ప్రవహిస్తూ ఉంటుంది. అదొక జీవనది.

ఒంట్లో ఓపికలేదు. తింటానికి ఇంట్లోనూ ఏమీలేదు. పాచిపనిచేసే నాలుగు ఇళ్ళల్లోనూ కలిపితే నాలుగు మెతుకులూ నలుగురు పిల్లలూ వాసన చూసి అర్ధాకలితో కళ్ళుమూశారు. కానీ తెల్లారకముందే కళ్ళు నులుముకుంటూ లేచి 'ఆకలే' అంటూ కేకలేస్తారు. మైసమ్మ వాళ్ళను తిడుతుంది తర్వాత కొడుతుంది. జకరయ్య మాత్రం 'థూ! నీ యమ్మ' అని గొణుక్కుంటూ రోడ్డెక్కుతాడు. పరా మామూలే సారా మామూలే పనికొచ్చినరోజున, పని పూర్తయ్యాక తాగుతాడు పనిదొరకని రోజున తాగటమే పని పెట్టుకుంటాడు ఎదుకు ఎప్పుడూ జేబులో డబ్బులు ఉండకపోవాలనే కష్టం. 'బీదోళ్ళగదా, ఉన్నట్టుంటు టపీ లేని టయిముంటది' అంటూ కల్లు కాంపౌండ్‌లో ఖాతా పెట్టాడు ఇంక జకరయ్యకి దిగుల్లేదు. దుకాణం యజమానికి దిగుల్లేదు. బాకీ రాకుండా ఉండలేదు. వచ్చినంతకాలం, నాలుగు రోజులు అటూఇటూగా, డబ్బులేకుండా ఉండలేదు. ఏతా, వాతా జకరయ్యకు తాగుడుకు లోటులేదు.

తూలుకుంటూ వచ్చాడు. తనలో తనే వాగుకుంటూ వచ్చాడు. వచ్చి గుమ్మంలో మైసమ్మ కాళ్ళదగ్గర గొంతుకూర్చున్నాడు.

"ఎవురే నే లేవి టయములో నీ వాళ్ళో తొంగుంది?.... చెప్పూ .... చెప్పమంటుంటే" అని గద్దించాడు.

"నీ కూతురు" అంది మైసమ్మ లేచి పిల్లను, మిగిలిన పిల్లల పక్కన చాప మీద పడుకోబెడుతూ.

"నా కూతురేనని రుజువేంటి? అసలు నీ కూతురేనని రుజువేంటి? చెప్పూ....చెప్పమంటుంటే...."

మైసమ్మకి తిక్కరేగిపోయింది. కోపంతో అదీ అరిచింది "నువ్వే నా మొగడని రుజువేంటి? నేను నీ పెళ్లాన్నని రుజువేంటి..."

"నీ యమ్మ, నాకు ఎదురు తిరుగుతా వంటే. నేనంటే ఏమనుకున్నావు?"

"అందరి మొగుళ్లూ తాగే ఉండారు, తాగుబోతోడని..."

"నా ఇంట్లో నే తాగుతాను నే సంపాయించుకున్నదే తాగుతున్నాను. ఊళ్ళోవాళ్ళ డబ్బుతో తాగుతున్నానా? చెప్పు, ఊళ్ళోవాళ్ళ డబ్బుతో తాగుతున్నానా?" అని మైసమ్మ మీదమీదకు వెళ్ళి రెట్టించాడు.

"సాల్లే, తొంగో....నీ కేకలికి పిల్లలు లేస్తారు." అని ఈసడించుకుని పడుకుంది మైసమ్మ.

మూసుకుపోతున్న కళ్ళు బలంతాన తెరుస్తూ మాట్లాడుతున్నాడు జకరయ్య. కాదు, పేలుతున్నాడు జకరయ్య.

"ఏంటే, నాకు వన్నం పెట్టకుండా, నువ్వు తినేసి తొంగుంటావా? నేను, నీ మొగుణ్ణి. ఇంటికొస్తే, సొంత మొగుణ్ణి ఇంత సీకట్లో పెళ్లాంను వెతుక్కుంటూ ఇంటికొస్తే, నా సంగతేంటి, నేనేంట, ఎంతిన్నాను ఏం తినలేదు అవి ఇనాలించకుండా తొంగుంటావా, లంజ...." అని జకరయ్య కోపంతో, ఆకలితో, మైకంతో ఊగిపోతూ కాలితో పెళ్లాంపొట్టలో తన్నాడు.

మైసమ్మ గిలగిలలాడిపోయింది. వలవలమని ఏడ్చింది. దాని ఏడుపుకి, తండ్రి తాపులకి నలుగురు పిల్లలు లేచి ఏడుపు లంకించుకున్నారు. జకరయ్య గొణుక్కుంటూ నాపమీద ఒకమూలకి ఒరిగి పడుకున్నాడు. ఒళ్ళూ, ఒళ్ళూ తెలివోయింది. పెళ్లాం పిల్లల ఏడుపులే జోలపాటగా వింటూ నిద్రపోయినాడు.

తెల్లవారింది. కోడికూత వినగానే లేచి ఇల్లూ [illegible] పొద్దుటే పనికి [illegible] మైసమ్మ [illegible] ఎండెక్కినా పడుకున్న చోటినుంచి లేవలేదు. రాత్రి మొగుడు పొట్టలో తన్నిన తాకిడికి, కడుపులోని పేగులన్నీ కదిలిపోయినయో [illegible] బాధగా [illegible] ఓపికలేక కన్నీళ్ళు [illegible] పిల్లలవంక చూస్తూ పడుకుంది. పిల్లలు లేచి లోపలికీ బయటికీ తిరుగుతున్నారు. కడుపు లోపలికి పొయ్యేవి, ఏమన్నా దొరుకుతాయేమోనని ఆశగా మూలనున్న ఖాళీ కుండల్లో చేతులుపెట్టి వెతుకుతున్నారు.

జకరయ్య లేచాడు. బావిదగ్గరకు పోయి మొహంకడుక్కుని, ఒకకుండతో నీళ్ళుపట్టుకొచ్చి పెట్టాడు. జేబులో ఉన్న అర్ధరూపాయి బిళ్ళ పిల్లలచేతుల్లో పెట్టి బయటకు పంపాడు.

పెళ్లాం పక్కన కూర్చుని కన్నీళ్ళు పెట్టుకున్నాడు. "ఇంకెప్పుడూ తన్ననే" అన్నాడు జకరయ్య.

"ఇంకెప్పుడూ తాగనని సెప్పు" అన్నది మైసమ్మ పడుకునే, మొగుడి చేతిని తనచేతితో రాస్తూ.

"ఇయ్యాలనుంచి అంతాబంద్. కల్లు కాంపౌండు మూసేస్తున్నారు. ఇంక మందు మాకు దొరకనే దొరకదుగదా.... లేవే, నిన్ను ఆస్పటాలికి తీసుకపోతాను...." అని భార్యను లేవదీశాడు జకరయ్య.

* * *

హెవెన్ బార్ అండ్ రెస్టారెంటులో ఆరోనెంబరు కాబిన్‌లో అయిదుగురు ఉన్నారు. వాళ్ళ ముందున్న చిన్న టేబిల్ మీద అయిదు గ్లాసులున్నాయి. ఒక ఓ.టి. విస్కీ ఉంది. అయిదు ఖాళీ సోడాబుడ్లు ఉన్నాయి. రెండు చిప్స్, రెండు గ్రీన్ పీసూ ఉన్నాయి. అందరి నోళ్ళలోనూ సిగరెట్లు వెలుగుతున్నాయి. అందరి ఆలోచనల్లోనూ భైరవేశ్వరరావు మెదులుతున్నాడు. వాళ్ళ తలా ఒక

విమర్శ చేస్తున్న, ఆ ఆఫీసరు అక్కడకు వచ్చే ప్రమాదం లేదుకాబట్టి స్వేచ్ఛగా, యథేచ్ఛగా, ఉడతాభక్తి ఆఫీసరిని తిట్టిపోస్తున్నారు.

"వీడికి ట్రాన్స్‌ఫరొచ్చేదాకా మన కీ తిప్పలు తప్పవు గురూ" అన్నాడు అంజనేయులు.

"వెళ్ళినా మళ్ళీరాక ఎక్కడికిపోతాడు గురూ. ఒక డిపార్టుమెంటులో ఉన్నాక వాడి పాలిటి నుంచి ఎన్నాళ్ళు తప్పించుకుంటాం?" అన్నాడు పాండురంగం.

"పాండు చెప్పింది నిజమే గురూ. ఈ భైరవేశ్వరరావుగాడికో లెసన్ చెప్పాలి గురూ" అన్నాడు అహమ్మద్.

"మీకో రహస్యం చెబుతున్నాను వినండి గురువుల్లా. ఆ భైరవేశ్వరరావుగాడి బామ్మర్ది, మినిస్టరుగారి తమ్ముడూ క్లోజ్ ఫ్రెండ్స్. రాక్షసుడి ప్రాణం మర్రిచెట్టు తొర్రలో ఉన్నట్లు, వీడి పొగరుకు కారణం మినిస్టరుగారి బ్రదర్‌లో ఉంది" అన్నాడు కాంతారావు గ్లాసు ఖాళీచేసి టేబులుమీద పెడుతూ.

"మరి వీడున్నంతకాలం మనకి లోన్లు ఎలా దొరుకుతాయి, శలవు లెలా గ్రాంట వుతాయి, ప్రమోషన్లు ఎలా వస్తాయి?" అని అడిగాడు క్రిస్టోఫర్.

"అందుకు మార్గం ప్రస్తుతానికి స్టెనో కమలే గతి. ఇవాళ నాకు రెండు వేలు మారేజ్‌లోను గ్రాంటు ఎవరు చేశారు? భైరవేశ్వరరావా? కాదు. కమల భైరవేశ్వరరావుచేత చేయించింది." అన్నాడు కాంతారావు.

"మరి కమలను పట్టటం ఎలాగురూ?" అని అడిగాడు అంజనేయులు.

"కమలతో డీలింగ్ మనకొక్కళ్ళకే తెల్సు. కాబట్టి బ్రదర్స్, సెక్షన్ లెవెల్‌లో మీరు మా పనులు చేసిపెట్టాలి. పై లెవెల్‌లో కమల సంగతి నే చూసుకుంటాను." అన్నాడు కాంతారావు.

"మరి నీ సంగతి చూడాలంటే?" అహమ్మద్ అడిగాడు.

"సెవెన్‌లో కల్సుకోవటమే" అని నవ్వేశాడు కాంతారావు.

"ఓకే గురూ" అన్నాడు క్రిస్టోఫర్.

"నాకో సందేహం. మనలో ఎవరికి ఎవరు గురువు?" అని అడిగాడు అంజనేయులు.

"ఇంత చిన్నప్రశ్న వేస్తావని నే ననుకోలేదు గురూ. అసలు మనం ఇప్పుడు ఎవళ్ళం? ఎన్.జీ.వో.లమా?" అని జనాంతికంగా ప్రశ్నించాడు కాంతారావు.

"కాదు" కోరస్‌లో అన్నారు.

"భైరవేశ్వరరావులాంటి ఆఫీసర్లమా?"

"పక్కన కమల లేందే భైరవేశ్వరరావులం ఎలా అవుతాం. [illegible] కాము."

"మరి మామూలు మనుషులమా?"

"కాము"

"మరి మనం ఎవరం?"

"సురలం"

"మనం ఎక్కడున్నామన్నమాట?"

"హెవెన్‌లో"

"ఈ హెవెన్‌లో లేనివాళ్ళంతా ఎవరన్నమాట"

"అసురులన్నమాట"

"వాళ్ళంతా ఎక్కడున్నారన్న మాట"

"నరకంలో నన్నమాట"

"కానీ బ్రదర్స్. మన కిప్పుడు పెద్ద విపత్తు వచ్చి పడబోతోంది. రేపటినుంచి ఈ హెవెన్ మూత పడబోతోంది. అంచేత మనం కావాలనుకున్నప్పుడల్లా సురలం కాగలమన్నది లేదని చెప్పటానికి విచారిస్తున్నాను"

"అవును. నిజమే దీన్ని మనం ప్రతిఘటించాలి మన సౌన నిషేధం...."

"గో టు హెల్"

ఆంజనేయులు లేచి నిలబడ్డాడు. సోఫా ఎక్కి నిలబడ్డాడు ఉపన్యాసం ఇవ్వదల్చుకున్నాడు వాళ్ళందరిలోనూ కిక్ కాస్త తక్కువగా ఉన్న క్రిస్టోఫర్, ఆంజనేయులు టేబుల్‌మీద గ్లాసులు, సీసాలు తన్నెయ్యకుండా పక్కకు జరిపాడు ఆంజనేయులు మొదలెట్టాడు.

"లేడీస్ అండర్ జెంటిల్‌మన్" అని సంబోధించాడు.

"అండర్ అంటాడేంటి గురూ"

"హెవెన్‌లో భాష మారిపోతుంది. నువ్వేం కంగారుపడకు" కాంతారావు సర్ది చెప్పాడు.

ఆంజనేయులు ఉపన్యాసం కొనసాగించాడు. 'మంచితనంచేత మనిషిచేత ఏ పని అయినా చేయించవచ్చు. బలవంతాన ఏమీ చేయించలేం: అందుకే అంటారు స్నేహంతో విషమైనా త్రాగించవచ్చు గాని, ద్వేషంతో పాలయినా త్రాగించలేమని."

"హియర్, హియర్"

"స్నేహంతో గుడంబా నయినా త్రాగించవచ్చుగాని, ద్వేషంతో స్కాచ్ విస్కీ అయినా త్రాగించలేం."

"సెబాష్"

ఆంజనేయులు మళ్ళీ మొదలుపెట్టాడు "మైడియర్ కంట్రీమన్, చిన్న కుటుంబం చింతలులేని కుటుంబమని ఆ మాట చెప్పేవాడికే కాదు, వినేవాడికీ తెల్సు తమంతట తామేవెళ్ళి ఆపరేషన్లు చేయించుకునేవాళ్ళు చేయించుకున్నారు. బలవంతానబస్టాపుల్లోజనాన్నిలాక్కెళ్ళి ఆపరేషన్లుచేయించినందుకు ఏమయిందో మీ కందరికీ తెల్సు కాబట్టి...."

క్రిస్టోఫర్ లేచి ఆంజనేయులుకు అడ్డుపడ్డాడు "మీరు ఆవేశం తగ్గించుకుని, సోఫాలో కూర్చోవల్సిందిగా ప్రజలు కోరుతున్నారు."

"నా మాట ప్రజలు వినాలి గాని, ప్రజల మాట నేను వినటం మానేసి చాలా సేపయింది, శిష్యా" అన్నాడు ఆంజనేయులు, మళ్ళీ ఉపన్యాసానికి ఉపక్రమిస్తూ.

"మీ రిప్పుడు మా మాట వినితీరా లండి. లేకపోతే పైన ఫాను మీ చేతు లకి తగిలే ప్రమాదం ఉంది. క్రింద ఓ సీసా పగిలే ప్రమాదముంది."

"ప్రమాదం వచ్చినప్పుడల్లా నేను ప్రజల మాటే వింటున్నాను" అంటూ కూర్చున్నాడు ఆంజనేయులు.

ఆ తర్వాత బిర్యానీలు తెప్పిం చారు. తింటూ, తాగుతూ, వాగుతూ, వాగుతూ, తాగుతూ, తింటూ, పార్టీ అయిందనిపించారు. బిల్లు చెల్లించి, బయటకు వచ్చారు.

చుట్టూ ఉన్న కాబిన్స్‌లో జనం ఇంకా తింటున్నారు. పెద్దగా కబుర్లు చెప్పుకుంటున్నారు. గోలగా మాట్లాడు కుంటున్నారు. బేరర్ అని అరుస్తున్నారు.

క్రిష్టోఫర్ అడిగాడు. "గురూగారూ, వీళ్ళందరూ చుట్టూ ఇలా వాగుతూ ఉండగా, మధ్యలో నుంచున్న మామూలు వాడికి ఈ గోల ఎలా వుంటుందో వర్ణించండి, చూద్దాం."

"రాసుకో మరి... ఎక్కడైనా ఒక కాకి చచ్చిపోయినప్పుడు, చుట్టూ అనేక కాకులు మూగి కావు కావు కావుమని చేసే గోలకీ, ఈ బార్‌లో మనం చేసే గోలకీ ఏమంత తేడా లేదు. ఎవడి కైనా నాలుగురూపాయలు వచ్చాయని తెలిస్తే, మనం ఇక్కడ మూగి ఇలా కాసేపు కాకిగోల చేసి వెళ్ళిపోతుంటాం" అన్నాడు ఆంజనేయులు బార్ గుమ్మం దాటి బయటికొస్తూ.

ఆ మాటలు కాంతారావు విన్నాడు "మూడ్‌లో ఉన్నా ఎంత ఖచ్చితమైన మాట చెప్పాడు!' అని ఆశ్చర్యపోయి నాడు కాంతారావు.

మర్నాడు ఉదయం కాంతారావు భార్యచేతికి డబ్బు ఇచ్చాడు. పంద రూపాయలు తక్కువ ఉన్నాయి. ఏమయినాయి అని అడిగింది. రాత్రి జరిగినదంతా గుర్తొచ్చింది.

"కొన్ని పనులు కావాలంటే, మరి కొన్ని పనులు చేయాల్సివస్తోంది, రాజీ" అన్నాడు కాంతారావు.

రాజేశ్వరి నిట్టూర్చింది. "మీ కింత డబ్బు రోజూ ఎక్కడినుంచి వస్తోందో నాకు తెలియదుగాని, ఈ మధ్య మీరు ఎక్కువగా తాగుతున్నారు. మీరు తెచ్చు కున్న డబ్బు అప్పు. దాన్ని వడ్డీతో సహా తీర్చాలి. ప్రాణంమీది కొచ్చినప్పుడు అప్పుతీసుకోవటం తప్పుకాదు. కానీ ఇలా వేలకివేలు వ్యసనాలకు తగలేస్తే మన సంసారం ఎలా బాగుపడుతుంది? మీ తెలివితేటలమీద, సంపాదనమీద మేమంతా ఆధారపడి ఉన్నాం. ఆ బార్ లోపలికి వెళ్ళేటప్పుడు నేనుగాని, పాప గాని మీకు గుర్తుకురాలేదా? పదిపైసలు పెట్టి పూలదండగాని, పావలా పెట్టి రెండు పళ్ళుగాని పిల్లకు తేవాలని మీకు తోచదు. పందరూపాయలు పెట్టి, మీ స్నేహితులతో తాగి తందనాలాడుతూ ...." రాజేశ్వరి కన్నీటి వరద ఆగలేదు.

కాంతారావు భార్యను కౌగిట్లోకి తీసుకుని ఓదార్చాడు. "నన్ను క్షమించు రాజీ"

"మీరే నన్ను క్షమించండి. ఇన్నాళ్లూ ఎలాగో ఓపికపట్టినదాన్ని ఇవాళ బయటపడ్డాను రేపటినుంచి ఎలాగూ మీ మందుల షాపులు మూసేస్తున్నారు."

"నేనూ మానేస్తున్నాను" అన్నాడు కాంతారావు.

"దొరకనప్పుడు మానెయ్యటం గొప్ప ఏమీ కాదండీ. దొరికినప్పుడూ దాని జోలికిపోకుండా ఉండేనే గొప్ప."

"నిజమేరా. ఒప్పుకుంటున్నాను," అన్నాడు కాంతారావు భార్య నుదుటిమీద చిన్నగా ముద్దు పెట్టుకుని.

* * *

కారొచ్చి పోర్టికోలో ఆగింది. అందులోనుంచి రాఘవేంద్రరావుగారు, మిసెస్ రాఘవేంద్రరావుగారూ దిగారు. కరుణాకరరావుగారు, మిసెస్ కరుణాకరరావుగారు పోర్టికో మెట్లు దిగారు.

మగవాళ్ళిద్దరూ నమస్కారాలు చేసుకున్నారు ఆడవాళ్ళిద్దరూ నమస్కారాలు చేసుకున్నారు. తర్వాత ఈయన భార్య ఆయనకు నమస్కారం చేసింది. ఆయన భార్య ఈయనకు నమస్కారం చేసింది. అతిథులిద్దర్నీ దంపతులిద్దరూ లోపలికి ఆహ్వానించారు. హాల్లోకి వెళ్ళారు. సోఫాలో కూర్చున్నారు. లేచారు. ఇటు పక్క గదిలోకి వెళ్ళారు. అటు పక్క గదలోకి వెళ్ళారు. రియర్ వరండాలో నిలబడి మాట్లాడుకున్నారు. రెడ్‌కార్పెట్ పరిచిన మెట్లెక్కి మేడమీదకు వెళ్ళారు. బాల్కనీలోనుంచి చూస్తే 'వ్యూ' బావుందన్నారు. బెడ్‌రూంలోకి వచ్చి టి.వి. ఆన్‌చేసి చూశారు. మిసెస్ రాఘవేంద్రరావు, మిసెస్ కరుణాకరరావు ఫ్రిజ్ గురించి ముచ్చటించుకున్నారు. కరుణాకరరావు, రాఘవేంద్రరావుగారిని కారు మార్చేసి కొత్తది తీసుకోమని సలహా ఇచ్చాడు. సరేనంటే, రేపే తా నా విషయం కనుక్కుంటానన్నాడు. సరేనన్నాడు రాఘవేంద్రరావుగారు.

రాఘవేంద్రరావుగారు ఇంజనీరు. కరుణాకరరావుగారు కాంట్రాక్టరు వారితో వీరికి పని ఉంటుంది. వీరితో వారికి పనిబడుతూ ఉంటుంది. ఈ 'గివ్ అండ్ టేక్' పాలసీకి అందమైన పేరు ఫ్రెండ్‌షిప్. ఈ ఫ్రెండ్‌షిప్ కొన్నాళ్ళు కొనసాగి ఫామిలీ ఫ్రెండ్‌షిప్‌లోకి దించింది. దీనివల్ల రెండు కుటుంబాలకి కొన్ని లాభాలున్నాయని నలుగురికీ తెలుసు. అందుకే ఇంత ఆదరణ. పేరులో తప్ప మరెక్కడా కనిపించని కరుణాకరరావు, అన్ననీ, తమ్ముణ్ణీ అల్లంత దూరంలో ఉంచే కరుణాకరరావు రాఘవేంద్రరావుగారిమీద వల్లమాలిన గౌరవం, ప్రేమ కనబరుస్తాడు. ఇంజనీరుగారి భార్య కాలు క్రిందపెడితే 'అరరె కందిపోతుందండీ' అనేంతగా అడుగులకు మడుగులొత్తుతాడు.

పిచ్చాపాటీ మాట్లాడుతూ లాన్‌లోకి వచ్చారు. పేము కుర్చీల్లో సెటిల్ అయినారు ఎంత ఎ. సి. రూములున్నా, ఈ చల్లగాలి దొరకటం కష్టమని ఇంజనీరుగారంటే అవునవునని వెంటనే కరుణాకరరావుగారి భార్య చప్పున ఒప్పేసుకుంది. గార్డెన్ చాలా బాగా పెంచారని ఇంజనీరుగారి భార్య ముచ్చట పడితే, ఈ గార్డెన్‌లో కూర్చునే తన కష్టాలన్నీ మర్చిపోతానని కంట్రాక్టరుగారు అన్నాడు.

వెన్నెల పుచ్చపువ్వులా విరగబడి కాస్తోంది. నౌకరు ట్రేలో గ్లాసులు, సీసాలు తెచ్చి వాళ్ళముందు పెట్టాడు. వాడే సీసాలు తీసి నాలుగు గ్లాసుల్లోనూ పోశాడు. మిసెస్ రాఘవేంద్రరావు తనకు అక్కర్లేదని అభ్యంతరం తెలిపింది. వెంటనే మిసెస్ కరుణాకరరావు తానూ తాగనని వంతపాడింది.

"అట్లా అయితే నేనూ ముట్టుకోను. రేయ్ గోవిందూ పట్టుకెళ్ళిపో" అని బెట్టు సరి చేశాడు కరుణాకరరావు. గోవిందు ముందుకు వంగి సీసాలు ట్రేలో పెట్టుకుంటూ ఉంటే రాఘవేంద్రరావుగారి ప్రాణం ఉసూరుమంది.

"ఇల్లాంటి విషయాల్లో మా ఆవిడ చాలా కన్సర్వేటివ్" అని నవ్వాడు.

"అఫ్‌కోర్సు. మా ఆవిడా అంతే. కాకపోతే, నేను తాగితే తను అభ్యంతర పెట్టదు" అన్నాడు కరుణాకరరావుగారు"

"నా విషయమూ అంతే. ఆ మాట కొస్తే చాలా ఫామిలీస్‌లో మగవాళ్ళు తాగటం మామూలైంది" అని వ్యాఖ్యానించాడు రాఘవేంద్రరావుగారు.

"ఆడవాళ్ళు గ్లాసులు అందించటం అంతే సహజం అయింది. అడపాదడపా వాళ్ళూ క పెనీకోసం తీసుకోవటంలో తప్పేమీ లేదని. నా అభిప్రాయం. ఇప్పుడు ఎలైట్ సొసైటీలో కాఫీలు మానేశారు. గెస్టులు రాగానే డ్రింక్స్ ఇస్తున్నారు. ఇందులో అభ్యంతర పెట్టాల్సినంత తప్పేమిటో నాకు తెలియటంలేదు అఫ్‌కోర్స్, ఐ మేబీ రాంగ్...."

మిసెస్ రాఘవేంద్రరావు గిల్టీగా ఫీలయింది. "నాకు వద్దన్నాను గానీ, మిమ్మల్ని తీసుకోవద్దనలేదు. పైగా మా ఇంట్లో ఆయనెప్పుడూ స్టాక్ పెట్టుకుంటూనే ఉంటారు. నాకు వాసన పడదు" అన్నది.

"చెప్పరేం, సరి. మీరు టాలరేట్ చెయ్యరేమోనని భయపడ్డాను." అని నౌకరుకు సంజ్ఞచేశాడు. వాడు మగవాళ్ళిద్దరికీ ఇచ్చాడు.

"మీరు జిన్ తీసుకోండి. అది లేడీస్ డ్రింకే గదా" అన్నాడు కరుణాకరరావు రెండో రౌండులోకి వెళ్తున్నప్పుడు.

"అయామ్ సారీ, చెప్పాను గదా, నా కా వాసన గిట్టదు.వాంతులొచ్చేస్తయి. కావాలంటే మరో సీసా ఫెంటా తాగు

తాను" అన్నదామె, బెత్తెడు జరీ అంచు పైటకొంగును భుజాలమీద నుంచి గుండెల మీదకు కప్పుకుంటూ.

"మై మిసెస్ ఈజ్ సింప్లీ ఫెంటాస్టిక్ ...." అని జోక్ చేశాడు రాఘవేంద్ర రావుగారు.

"ఇవాళ్టొక్క రోజే మీకీ పర్మిషన్. రేపట్నించీ అంతా ఫెంటాస్టిక్‌లే." అని గుర్తుచేసిందామె.

కరుణాకరరావు అందుకున్నాడు "సరే, రాఘవేంద్రరావుగారు, నాకు తెలియక అడుగుతా... ఈ ప్రొహిబిషన్ నిజంగా అవసరమే నంటారా?"

"అవసరమే" అన్నాడు రాఘవేంద్ర రావుగారు, సిగరెట్టు వెలిగించుకుని, పొగ వదులుతూ.

"తాగుబోతులైన మీరు ప్రొహిబిషన్ అవసరమంటా రేమిటి?" అని ఆశ్చర్యంగా అడిగింది ఇంజనీరుగారి భార్య.

"నేను రోజూ తాగొచ్చు. అంత మాత్రాన నన్ను తాగుబోతు క్రింద బ్రాండ్ చేస్తే పశ్చాత్తాపపడరుగానీ... నేను. ఐ నెవర్ బిహేవ్ ఇండీసెంట్లీ. ఆ తేడా తెలియనివాళ్ళని మనం క్షమించి వది లెయ్యాలి."

"ఇంతకీ నా సందేహం తీర్చలేదు మీరు." అని అడిగాడు కరుణాకరరావు.

"చెప్పానుగదా. ప్రొహిబిషన్ అవసరమే, అంతమాత్రాన తాగేవాళ్ళంతా మానేస్తారా అని మీ ప్రశ్న. చాలామంది మానెయ్యవచ్చు. కొంతమంది దొంగ తనంగా తాగొచ్చు. తాగుడుకు అలవాటు పడ్డవాళ్ళను బాగుచెయ్యటానికి చేసిన ప్రయత్నం ఎంతవరకు సఫలమవుతుందీ అన్న పాయింటు అలా పక్కన బెడితే దీనివల్ల జరగబోయే మేలు ఏమిటంటే, ఇంతవరకూ అలవాటులేనివాళ్ళు ఇక ముందు దీనికి బానిసలయ్యే ప్రమాదాన్ని తగ్గించటానికి ప్రొహిబిషన్ చాలావరకు తోడ్పడుతుంది. ముఖ్యంగా నాలుగు రూపాయలు జేబులో ఉన్న యువతరం వాళ్ళు నిర్భయంగా తాగే అవకాశం ఉండదు. ఇంత సునాయాసంగా సీసాలు కొనుక్కువెళ్ళి తాగే పరిస్థితి ఉండదు అంతవరకూ అది విజయవంతమైనట్లే కదా ... ఉదాహరణకి, నేను తాగు తున్నాను. మా ఆవిడ తాగదు. కానీ ఇది ఇలాగే కొనసాగితే, నా ప్రభావం ఆమె మీద పడి తనూ తాగే పరిస్థితి రావచ్చు. మరి నాకే దొరకనప్పుడు, ఆవిడకి అలాంటి ప్రమాదం లేదు. నా బాధ అర్థమైందా?" అని అడిగాడు రాఘవేంద్రరావు మళ్ళీ గ్లాసు పైకి తీసుకుంటూ.

"అర్థమైంది" అన్నాడు కరుణాకర రావు.

భోజనం తయారుగా ఉంది రమ్మని మిసెస్ కరుణాకరరావు పిలవటంతో ముగ్గురూ లేచారు.

* * *

## 3

కల్లు దుకాణాలు మూసేస్తే, తన మొగుడు తాగుడు మానేస్తాడనీ, తాగుడు మానేస్తే, తెచ్చే అయిదూ పదీ చేతికి వస్తాయనీ, వాటితో తనింత తిని, మొగుడికి పిల్లలకి తిండిపెట్టే అవకాశం ఉందని మైసమ్మ ఎన్నాళ్ళనుంచో అనుకుంటూ వచ్చింది పెళ్లయిన మర్నాడే మొగుడు తాగి వస్తే, మొగుడ్ని తిట్టలేదు. సారాదుకాణం వాళ్ళనే తిట్టింది. కానీ చివరకు ప్రభుత్వమే సారా దుకాణాలు తెరిచి శుభ్రంగా బీదాబిక్కీని చెడగొడుతుంటే, ఎవర్ని ఏమని నిందించాలో తెలియలేదామెకు.

దేశమంతటా మళ్ళీ మద్యపాన నిషేధం అమలుపరుస్తున్నారని తెల్సాక సంతోషించిన మొట్టమొదటి వ్యక్తి మైసమ్మే. తన కుటుంబమే కాదు, తన లాంటి మైసమ్మలు ఎందరున్నారో వాళ్ళందరి కుటుంబాలూ బాగుపడతాయని నమ్మింది మైసమ్మ.

అనుకున్నట్లుగానే కల్లుదుకాణాలు మూతపడినయి. జకరయ్య కాలుగాలిన పిల్లిలా రోడ్లన్నీ తిరిగివస్తున్నాడు. ఏపని చెయ్యబుద్ధికావటంలేదు. దేని మీదా మనసు కుదరటంలేదు. రోజూ సాయంత్రం రెండుసీసాలు పట్టిస్తే ఒంటికి ఏనుగంతబలం వస్తుంది. నరాల్లో నెత్తురు వరదొచ్చిన గోదావరిలా పొంగుతుంది. తల గిర్రున తిరుగుతుంది. కళ్ళు మత్తుగా దూసుకుపోతుంటాయి. బుర్రలోని నట్లు అన్నీ వదులైపోతయి. హాయిగా మనసులో ఉన్నది ఉన్నట్లు వాగెయ్యగలడు. ఆ కాసేపూ ఏమైనా చేసెయ్యగలడు పెళ్లాన్ని తిట్టి, కొడితే గాని తను మగవాడైనందుకు, మొగుడైనందుకు ఫలితం ఉండదు అనుకుంటాడు. ఇప్పుడా అనుభవం కరువైతే, జీవితంలో అన్నీ పోగొట్టుకున్నట్లే అనిపిస్తోంది తింటున్నా, తిరుగుతున్నా నరాల్లోని నిస్సత్తువ, తీపు తగ్గటంలేదు. పగలు కష్టపడితే రాత్రికి తాగేవాడు. పనిచేసినందుకు, డబ్బు చేతికొచ్చినందుకు ఫలితం, రాత్రికి దొరికే నిషాలోఉండేది. ఇప్పుడేమీలేదు

కల్లుదుకాణం యజమాని చంద్రయ్యకు జకరయ్య మూడొందలు బాకీ ఉన్నమాట నిజమే. కానీ ఇప్పుడు తీర్చాలంటే ఎంతో కష్టంగా ఉంది. ఇది వరకు ఎన్నోవందలు తీరుస్తూ ఉండేవాడు. మళ్ళీ అప్పుచేస్తూ ఉండేవాడు. కొత్త అప్పు పుట్టటంకోసం పాత అప్పు తీరుస్తుండేవాడు. ఇప్పుడా ఆశ లేదు కాబట్టి పాత అప్పు తీర్చదల్చుకోలేదు. చంద్రయ్య మూణ్నెల్లపాటు మనుషుల్ని పంపిస్తూనే వచ్చాడు. అయినా జకరయ్య పైసా ఇవ్వలేదు

ఒకరోజు జకరయ్య రోడ్డున నీరసంగా నడిచివస్తున్నాడు. చంద్రయ్య సైకిలుమీద వస్తూ, జకరయ్య పక్కన

అగాడు. పాతబాకీ గురించి అడిగాడు. తన దగ్గర లేదన్నాడు జకరయ్య. ఐనా చంద్రయ్య పోట్లాటకు దిగ లేదు. చొక్కా పట్టుకుని నిలెయ్యలేదు.

"నీకాడ డబ్బు లెక్కడికి పోతయి గాని, అసలెట్టా వుంటున్నావు, ఏంటి?" అని కుశల మడిగాడు.

"ఏంటి దొరా. నువ్వు దుకాణం బందుచేశావు. నా బ్రతుకులో సుఖమే మాయమైంది. ఏం చెయ్యాలో తోచటం లేదు" అని నెత్తి గోక్కున్నాడు.

"రోడ్డుమీద దుకాణం మూసేశాం గాని, మనలాంటోళ్ళకి రగస్యంగా ఒక చోట దొరుకుద్ది. ఎప్పుడేనా కావా లంటే...."

జకరయ్యకు పోయిన ప్రాణం తిరిగి వచ్చినట్లు అయింది. "మీ కాళ్ళమొక్కుతా దొరా. ఎక్కడ దొరుకుతాదో సూపి య్యండి."

"అరె నీయమ్మ, సిన్నంగ మాట్లా డరా, పోలీసులకు తెలిసెనా అంటే, నిన్ను - నన్ను అందర్నీ బొక్కలో తోస్తారు.

"లేదులే, దొర ఒకపాలి సూపియ్యి దొర" అని జకరయ్య చంద్రయ్య వెంట పడ్డాడు.

జకరయ్యకు చెప్పవల్సినవన్నీ చెప్పి, ఊరిబయట తాటిలోపుల్లోకి తీసుకెళ్లాడు. అక్కడొక గుడిసెలో జకరయ్య అష్ట మిత్రులు మరికొందరు కల్సారు. చాలా రోజుల తర్వాత మళ్ళీ కళ్ళు తిరిగి పడి పోయేంతవరకు తాగేశాడు. అర్ధరాత్రికి కొంపజేరాడు. తూలుకుంటూ, సంతోషంగా పాడుకుంటూ వస్తున్న జకరయ్యను చూసి మైసమ్మ కొయ్యబొమ్మ అయిపోయింది.

"తాగితే మరిసిపోగలను. మరిసిపోతే తాగగలను - మనసు గతి ఇంతే. ఈ మణిసి బ్రతుకింతే...."

"నీ బతుకింతే" అని గొణుక్కుంది మైసమ్మ.

"ఏంటే, ఏంటి తిడతన్నావు. నే నెవ రనుకుంటున్నావు నువ్వు? నీ మొగుణ్ని అన్న ఇసయం తెల్వా, చెప్పూ...." అంటూ పెళ్లాం జుట్టుపట్టుకుని గుంజాడు

మైసమ్మ తోసింది. జకరయ్య కింద పడ్డాడు. లేచాడు.

"ఏంటే, నన్ను తోసేస్తావా? నే నెవ రనుకుంటున్నావు చెప్పూ" అంటూ తన్నాడు. మైసమ్మ మొగుడు తన్నులు భరించలేక పక్క గుడిసెలోకి పరు గెత్తింది. చాపమీద పడుకున్న పిల్లలం దర్నీ కూడా తన్ని, బయటిగ్గెంటి, వెల్లి కిలా పడుకుని, కాలుమీద కాలేసుకుని కళ్ళు మూసుకున్నాడు.

మర్నాటినుంచీ మామూలే. మును పటికీ, ఇప్పటికీ వచ్చిన మార్పేమిటంటే జకరయ్య, చంద్రయ్యకు మరీ దాసుడై పొయ్యాడు. జకరయ్య ఇదివరలో మేస్త్రీ దగ్గర కూలికి పోతుండేవాడు.

ఇప్పుడా పనిమానేసి హాయిగా చంద్రయ్య దగ్గరే ఉండిపొయ్యాడు. ఊరి బయట తాటితోపులో జరిగే వ్యాపారంలో మునిగి పొయ్యాడు జకరయ్య. తాగుడులో రాత్రీ పగలూ తేడా లేకుండా అక్కడే పడి ఉండటం మొదలుపెట్టాడు.

రోజూ తాగే అమృతంలో విషమెట్లా కల్సిందో మరి ఒకనాడు తాగినవాళ్ళంతా కక్కుకుని స్పృహలేకుండా పడిపోయి నారు. కొందర్ని హాస్పటల్‌కు తీసు కెళ్లారు. మరి కొందరికి అవసరం లేక పోయింది.

జకరయ్య శవాన్ని తెచ్చి గుమ్మం ముందు పడుకోబెట్టారు. మైసమ్మ మీద పడి ఏడవలేదు. కట్టెబొమ్మలా చూస్తూ నిలబడింది. ఆమెకు ఇంకా ఆ పాట విని పిస్తూనే ఉంది. మొగుడు తూలుకుంటూ రావటమే కనిపిస్తోంది.

'మనసుగతి ఇంతే.... ఈ మణిసి బతుకింతే....'

* * *

అహమ్మద్ ఇంటి లోనుకు దరఖాస్తు పెట్టుకున్నాడు. సెక్షను వాళ్ళ కాళ్ళూ గడ్డాలు పట్టుకుని, వాళ్ళకు చేయవల్సిన వాగ్దానాలు అన్నీ చేసి ఫైలు పైకి పంపించుకున్నాడు. కానీ భైరవేశ్వర రావు ఏదో ఒక పుల్ల వెయ్యకుండా దాన్ని శాంక్షను చెయ్యడు. పని కావాలంటే స్టెనో కమలతో చెప్పించాలి. కమల ఎవ్వరితోనూ మాట్లాడదు. వీళ్ళందర్ని పురుగుల్ని చూసినట్టు చూస్తుంది. కాస్త కాంతారావు మాటకే విలువ ఇస్తుంది. అందుకే అహమ్మద్ కాంతారావును పట్టాడు.

కాంతారావు వచ్చి కమలపక్కన కూర్చున్నాడు. "ఏంటి చాలా బిజీగా ఉన్నారు ?" అని అడిగాడు.

నిజానికి అప్పుడు ఆమె చాక్‌లెట్ చప్పరిస్తూ వీక్లీలో సీరియల్ చదువు కుంటోంది. అందుకని నవ్వింది.

"మీకీ సీరియల్స్ అంటే ఇష్టమా ?" అని అడిగాడు మళ్ళీ.

"ఎక్కడో ఒకటీ, అరా బాగుం టాయి. మిగిలినవన్నీ ఏదో టైంపాస్... వాళ్ళు వేస్తుంటారుగాబట్టి మేం చదువు తుంటాం....అంతే"

"మీరు చదువుతుంటారు గాబట్టి వాళ్లు వేస్తుంటారు గాబట్టి రాసేవాళ్లు రాస్తుంటారు. పోనీ మీరూ రాయ గూడదూ...." అని అడిగాడి.

"నే రాస్తే చదివేవాళ్ళు ఎవరూ ?" అని అడిగింది. కమల నవ్వుతూ.

"నేనున్నాను" అన్నాడు వెంటనే. "మీరు చేసే ప్రతిపనీ నా కిష్టమే."

"అయితే కష్టమే. ఉపోద్ఘాతం చాలు గాని, పాయింటుకు రండి."

"అంటే నేను పని ఉంటేగాని మీ దగ్గరికి రానంటారు. అలా అనుకునే టట్లయితే, నే వెళ్ళిపోతాను."

"పోతేపొండి. మీకే నష్టం." అని సీరియల్ చదవటంలో మునిగిపోయింది

"అయితే వెళ్ళిపోతున్నాను" అని బెదిరించాడు.

"ఏమిటో చెబుదురూ, నసుగుడు మానేసి...."

"అహమ్మద్ అని నా క్లోజ్ ఫ్రెండ్. ఇల్లు కట్టుకుంటాడుట. లోన్‌కు పెట్టుకున్నాడు. దొరగారి మూడ్ చూసి చిన్న పొట్టిసంతకం పడేయించాలి."

"ఆ మాట ముందు చెప్పొచ్చుగా. దానికి నాచేత సీరియల్స్ రాయించటం ఎందుకు?" అని నవ్వింది.

"నువ్వింత తెలివిగలదానివి కాబట్టే నాకెంతో ఇష్టం...."

"మీరు సీరియల్‌గా పొగుడుతున్నారు" కమల నవ్వింది.

"లేదు. సీరియస్‌గా పొడుగుతున్నాను. మర్చిపోకు." అని వెళ్ళిపోయాడు కాంతారావు.

అహమ్మద్‌కు లోను శాంక్షను అయింది పార్టీ ఇస్తేగాని, ఆర్డరు చేతికివ్వరు. అదీ పద్ధతి. పార్టీలు ఇవ్వటం ఇదివరకటినుంచీ వస్తున్న ఆనవాయితీ. ఇరుసున కందెనలేక ఈశ్వరుడి బండైనా కదలదని అనుభవజ్ఞులు, విజ్ఞులు అంటారు.

ఇప్పుడు పార్టీలు ఇవ్వాలంటే పెద్ద ఇబ్బంది వచ్చిపడింది. దానికి బోలెడంత తతంగం ఉంది ముందు ఆంజనేయులు గారితో చెప్పి, డబ్బు రెట్టింపు ఇచ్చి మందుకు ఏర్పాటు చేసుకోవాలి. దాని తర్వాత తగినచోటు వెతుక్కోవాలి. కాంతారావు, ఆంజనేయులు కలిసి ఈ రెండుపనులూ రెండుగంటల్లో పూర్తి చేశారు. క్రిస్టోఫర్ క్వార్టర్ ఖాళీగా ఉంది. అతని ఫామిలీ ఊళ్ళోలేదు. కాంతారావు నాలుగుగంటలకే డబ్బు తీసుకుని, హేండ్‌బ్యాగ్ తీసుకుని వెళ్ళిపొయ్యాడు.

ఎనిమిదిగంటలకు ఆటోలో కాంతారావు దిగేటప్పటికి, మిగిలిన వాళ్ళంతా ఎదురుచూస్తున్నారు అప్పటికే నవ్వులూ, కేరింతలూ, ఆటలూ, పాటలూ మొదలైనయి. క్రింది క్వార్టర్‌లోనున్న వాళ్ళు ఈ గోల భరించలేకపోతున్నారు.

తొమ్మిదిగంటలు దాటేటప్పటికి అంతా సభ్యతను మర్చిపోయి మాట్లాడుకునే స్థితికి వచ్చారు.

"అసలు కాంతారావుమాట కమల ఎందుకింటుంది, కమల మాట భైరవేశ్వరుడు ఎందుకింటున్నాడు? దీని రహస్యమేంటి? ఎవరైనా దీనికి సమాధానం తెల్సి చెప్పకపోయినారో, వాళ్ళ తల వెయ్యి వక్కలైపోతుంది...." అని లేవదీశాడు పాండురంగం.

"దానికేముంది. స్నేహం." అని తేల్చేశాడు అహమ్మద్‌ఖాన్.

"ఇప్పుడు మనంగూడా స్నేహితులమే. మనమేం చైనావాళ్ళంకాదు. కానీ మనకో లోను రావాలంటే, క్రింది లెవెల్‌లో ఒక పద్ధతి ఉంది. అంతవరకూ మనకు

అర్థమవుతోంది. పై లెవెల్‌లోని పద్ధతి తెలుసుగాని, దాని అంతర్యం తెలియ ట్లేదు గురూ...." అని అడిగాడు క్రిస్టోఫర్.

"కమల ఈజ్ మై సిస్టర్.."అన్నాడు కాంతారావు.

"నో, భైరవుడు ఈజ్ యువర్ బ్రదర్ ఇన్‌లా" అన్నాడు క్రిస్టోఫర్.

"డోంటాక్ రబ్బిష్" అని అరిచాడు కాంతారావు.

"షటప్ అండ్ గెటవుట్" అని లేచాడు క్రిస్టోఫర్.

నిముషంలో వాళ్ళిద్దరూ శత్రువు లైపోయినారు. పౌరుషాలు పెరిగినయి. క్రిస్టోఫర్ కాంతారావును మెట్లమీద నుంచి తోసేశాడు.

రెయిలింగ్ తలకు తగిలిన కాంతారావు నుదురు చిట్లి గాయమైంది. నలుగురూ గుమిగూడారు. పోలీసు కంప్లయింట్ ఇచ్చారు. కేసుబుక్ అయింది.

కమల కాంతారావు ముహం చూడటం మానేసింది. ఇప్పుడతని ముహాన మచ్చ వికృతంగా ఉంది. 'నానాటికీ తీసికట్టు నాగంబొట్లూ అన్నట్లు నీ కుటుంబం ఇలా అయిపోతుందేం తల్లీ' అని ఏడ్చి రాజేశ్వరిని ఆమె తండ్రి పుట్టింటికి తీసుకువెళ్లాడు.

కాంతారావు గడ్డం పెంచుకుని, తనలో తనే పిచ్చిగా గొణుక్కుంటూ రోడ్లమీద తిరుగుతూ కనిపించినప్పుడు, ఆంజనేయులు, అహమ్మద్ కూడా అతన్ని ఎరగనట్లు తప్పుకుపోతుంటే, కాంతారావు తుపుక్కున ఉమ్మేస్తాడు.

* * *

కరుణాకరరావు, రాఘవేంద్రరావు గారి కోసం వచ్చాడు. ఆయన వచ్చిన సమయంలో ఇంజనీరుగారు లేడు. ఇప్పుడు రెండు కుటుంబాల మధ్య సాన్నిహిత్యం పెరిగింది కాబట్టి మిసెస్ రాఘవేంద్రరావు, కరుణాకరరావుతో చనువుగానే మాట్లాడుతుంది.

"ఆయన లేరు. కాంపుకు వెళ్లారు," అని చెప్పింది.

"ఈ మధ్య కాంపులు ఎక్కువ య్యాయే" అని అడిగాడు కరుణాకర రావు.

"నిజమే. ఇదివరకు ఆయనకు కావాల్సిందేదో తాగి, ఇంటిపట్టునే పడి ఉండేవారు. ఇప్పుడు దానికోసం కాంపులు వేసుకుంటున్నారు. నేను ఒంటరిగా బోర్ భరించలేక చస్తున్నాను."

"ఇంటికి చాటుగా తెప్పించుకో వచ్చుగా."

"దానికెన్ని గొడవలు. పోలీసుల కన్నుపడితే కష్టంగదా. మన డబ్బుతో మనం తాగాలన్నా వాళ్ళకు భయపడి చావాల్సి వస్తోంది."

"మనం అంటున్నారు. మీకూ వాసన గిట్టినట్లుందే."

"అబ్బే అదేం లేదు. మన డబ్బు అంటే ఆయన డబ్బు అని అర్థం."

"మేమంతా ఉండగా ఆయన ఇన్ని ఇబ్బందులు ఎందుకు పడాలో తెలియటం లేదు. ఎక్కడా దొరకనిది, ఫారిన్ సరుకు సాయంత్రం పట్టుకొస్తాను. ఆయనకు ఇవ్వండి. ఇచ్చాక, పుచ్చుకున్నాక నా పేరు చెప్పటం మర్చిపోవద్దు" అన్నాడు కరుణాకరరావు.

సాయంత్రం బ్రీఫ్ కేసుతో వచ్చాడు. మిసెస్ రాఘవేంద్రరావు కరుణాకరరావును పడకగదిలోకి తీసుకురమ్మంది. వెళ్ళి ఫ్రిజ్‌లో భద్రంగా దాచిపెట్టాలని చెప్పాడు నవ్వుతూ.

"వాసన గిట్టదంటారుగానీ, ఇది వాసనా వుండదూ, మైకమూ ఉండదు. హాయిగా గాలిలో తేలిపోతున్నట్లు ఉంటుంది. ఫారిన్‌ది కదా" అన్నాడు.

మిసెస్ రాఘవేంద్రరావు మాట్లాడలేదు. సీసా తీశాడు. గ్లాసులో పోశాడు. వాసన చూడమన్నాడు. ఆమె కేమీ వాసన వెయ్యలేదు.

"డోకొచ్చేంత వాసన ఉంటే, ఇంతమంది ఎగబడి ఎందుకు తాగుతారు? తాగినవాళ్ళ దగ్గర నుంచి వాసన రావచ్చుగానీ, తాగినవాళ్ళకి వాసన తెలియదు. అందమైన అనుభూతి తప్ప, తప్పొప్పుల సంగతేమీ తెలియదు. ఒక్కసారి చూడండి. ఇష్టంలేకపోతే అప్పుడే మానెయ్యవచ్చు." అని బలవంతం చేశాడు కరుణాకరరావు.

ఎప్పటినుంచో దానిమీదనున్న అసహ్యం, ఆమె కా క్షణంలో కొద్దిగా తగ్గింది. అతని ప్రోద్బలం నిద్రాణంగానున్న ఒక కోర్కెను తట్టి లేపింది. ఆమె సందేహంగా అతనివంక చూసింది. అతను గ్లాసును ఆమె పెదవులకు అందించాడు. మొహం చిట్లించుకుంటూ గుటకవేసింది. చేదుగా ఉంది. తిమ్మిరిగా ఉంది. కొంచెం మంటగా ఉంది. గొంతు దిగాక హాయిగానే ఉంది. దాని గొప్పదనం గురించి కరుణాకరరావు చెబుతూనే ఉన్నాడు. రెండు గ్లాసులు పట్టించాక మిసెస్ రాఘవేంద్రరావు ఒళ్ళు తెలియని స్థితిలో సోఫాలోకి వొరిగిపోయింది. కరుణాకరరావుకు ఎన్నాళ్ళుగానో ఎదురుచూసిన అవకాశం అలా అనుకోకుండా వచ్చింది. ఆమె మీదకు వంగి ముద్దుపెట్టుకున్నాడు.

కిటికీలోనుంచి ఆ సన్నివేశం చూసిన రాఘవేంద్రరావు గుండె భగ్గున మండిపోయింది. టాక్సీలో వెడుతూ ఆలోచించాడు. వీణ్ణి ఏంచెయ్యాలి. పిస్టల్‌తో కాల్చెయ్యాలా? కత్తితో పొడిచెయ్యాలా? ఎలకలమందుతో చంపెయ్యాలా? ఏం చెయ్యాలి? ఏం చేసినా వాడు చస్తాడు. అదో పెద్ద పాయింట్ కాదు. వాడు చచ్చిపోతే అందులో వింతేమీ లేదు. వాడు ఛస్తూ బతకాలి. వాణ్ణి వికార్ని చెయ్యాలి.

రాఘవేంద్రరావు టాక్సీ దిగి, మిసెస్ కరుణాకరరావుతో కరుణాకరరావు

గెస్ట్‌హౌస్‌లో ఉన్నాడనీ, తన భార్య కూడా అక్కడే ఉందనీ, ఈమెను తీసుకువెళ్ళటానికి తాను వచ్చాననీ చెప్పాడు. పావుగంటలో ఆమె అందంగా తయారై వచ్చింది. రెండు సీసాలు, గ్లాసులు కూడా తీసుకురమ్మన్నాడని అందమైన అబద్ధానికి చక్కని రంగు పూశాడు. ఆమె సీసాతోపాటు తినుబండారాలు కూడా బుట్టలోకి సర్దింది.

గెస్ట్‌హౌస్‌లో కరుణాకరరావుగాని, ఇంజనీరుగారి భార్యగాని లేరు అందుకు రాఘవేంద్రరావు అంతులేని ఆశ్చర్యాన్ని అభినయించాడు. వాళ్ళిద్దరూ ఎక్కడికో వెళ్ళి ఉంటారని, వెంటనే వస్తారని, ఈలోగా అన్నీ సిద్ధంచెయ్యమనీ చెప్పాడు.

మండే గుండెల్లోకి, మధువును పోశాడు. మంట మరీ ఎక్కువైంది రాస్కెల్, చూసుకోమన్నాడు.

మిసెస్ కరుణాకరరావును తన దారికి తెచ్చుకోవటానికి, రాఘవేంద్రరావుకి ఎక్కువ శ్రమపడాల్సిన పని లేక పోయింది. ఇంజనీరుగారికి ఎదురు తిరిగితే, తమ బ్రతుకులు సుడిగాలికి కొట్టుకుపోతాయని ఆమెకు తెలుసు.

ఆ రాత్రి రాఘవేంద్రరావు తన కక్ష తీర్చుకున్నాడు. అమె తెల్లారి చూసుకుంటే, ఒంటిమీద అమెరికన్ జార్జెట్ చీర లేదు పక్కన తడుముకుంది. అక్కడా లేదు గదంతా వెతికింది. ఎక్కడా లేదు. తన మానాన్ని కాపాడు కోవటానికి మరే గుడ్డ పేలికన్నా దొరుకుతుందేమోనని కళ్ళింత చేసుకుని చూసింది. లాభం లేదు. చివరికి బెడ్‌షీటుగాని, డోర్ కర్టెన్‌గాని ఏమీ కనపడలేదు. చేతులు అడ్డంపెట్టుకుని గుమ్మం బయటకి తొంగిచూసింది.

దూరంగా చౌకీదారు కనిపించాడు. చెయ్యి ఊపి రమ్మంటే, వచ్చి సాయం చేశాడు.

జరిగిన మోసం తెలిసి కరుణాకర రావు, రామవేంద్రరావు ముహం చూడ లేకపోయినాడు. కరుణాకరరావుకు కంట్రాక్టు ఇచ్చిన పనులేవీ సరియైన పద్ధతిలో చేయలేదని, అతని బిల్లులేవీ ప్యాసుచేయకపోగా, కట్టినవన్నీ దగ్గర ఉండి కూలగొట్టించాడు రాఘవేంద్రరావు. కరుణాకరరావు పేర్చుకుంటూ వచ్చిన గోడలన్నీ, నదిలోని నీటిలో మునిగి పోయినయి.

(నీతి ; ఒక ఆదర్శంకోసం శాసనాలు చేయకూడదని కాదు సుమా. అంత మాత్రాన చాలదని).

---




(గత సంచిక తరువాయి)

స్వప్న కటువుగా అంది: "ఆపేవాళ్ళు లేనంత మాత్రాన ఆడది అంతగా చెడి పోతుందని మీ ఉద్దేశ్యమా? ఇందాకా 'నేనంత చవటననుకొన్నావా' అన్నారే- ఆమాట ఇప్పుడు కరక్టే ననిపిస్తోంది!"

"నోటికి ఎంతొస్తే అంతా కూస్తే..." మాధవ్ చెయ్యెత్తబోయి విరమించు కొన్నాడు.

"లేకపోతే ఏమిటండీ? భార్యని ప్రియుడి దగ్గరికి పంపించడం సహృదయత అనిపించుకోదు, మగవాడి చవటతనం నిరూపిస్తుంది."

"పతివ్రతలా మాట్లాడకు," కస్సుమన్నాడు.

"పతివ్రతకీ పతితకీ పూర్తి నిర్వచనం మీకు తెలుసా?"

"ఓటి కుండకు చప్పుడెక్కువన్న సంగతి నీకు తెలుసా?"

ఈ మాటతో స్వప్నకి తగిలిన అఘాతం అంతా ఇంతాకాదు, మసిపూసినట్టుగా ఆమె ముఖం నల్లగా మాడి పోయింది. దుఃఖం గొంతుదాకా ఎగదన్నుకురాగా అతడి ముందు ఏడవడం ఇష్టంలేక సూట్‌కేస్ తెరిచి బట్టలు

తీసుకొని స్నానంచేసే నెపంతో బాత్ రూం వెదుకుతూ బయల్దేరింది. బాత్ రూం కనిపించగానే అందులో దూరి తలుపు మూసుకొని మనసార ఏడ్చేసింది.

ఆడది ప్రేమలో పడితే ఎంత వికృష్టంగా చూడబడుతుంది? శారీరకంగా చెడక్కరలేదు. మానసికంగా ఒక పురుషుడి ఆకర్షణకు లోనైతేచాలు. నీతిమాలినదాని కింద, నికృష్టురాలి క్రింద లెఖ్ఖ కట్టేస్తారు, మనసు చలించినంత మాత్రాన నీతిమాలిన దయ్యేట్టయితే ఈ ప్రపంచంలో కాగడా వేసి వెదికినా ఒక్క ప్రతివ్రతను కూడా పట్టుకోలేరు ఈ మగవాళ్ళు! ఆడదాని హృదయంలోకి చూడగల దివ్యదృష్టే వీళ్ళకుంటే భార్య, చెల్లెళ్ళు, తల్లులూ, వదినలూ–అందరూ పతితల క్రిందికి వస్తారు!

అప్పుడు ఆడవాళ్ళందరిని త్యజించి ముక్కు మూసుకొని అడవుల్లోకి వెళ్ళిపోతారా ఈ మగధీరులు!

మాధవ్ తనని ఎంత అవమానించినా సరే, ఎంత చులకనచేసి మాట్లాడినా సరే అతడి అంతు తేల్చుకోనిదే వెళ్ళదు! ఒక నిశ్చయానికి వచ్చిన స్వప్న నిబ్బరం తెచ్చుకోగలిగింది.

ఆ బాధలో, దుఃఖంలో, కసిలో, చల్లటినీళ్ళు తలనిండా గుమ్మరించుకొని శాంతపడింది స్వప్న. బాత్ రూం తలుపు తెరుచుకొని ఇవతలికి వచ్చేసరికి ఆమె ముఖం తేటపడి మామూలుగా అయింది.

వైర్ బాగ్ లోంచి టాయిలెట్ సామాను ఇవతలకితీసి పదినిముషాల్లో అలంకరణ, ముగించింది స్వప్న.

ఉన్నది ఒకటే రూం గనుక గత్యంతరం లేనట్టుగా కుర్చీలో కూలబడి న్యూస్ పేపర్ అడ్డం పెట్టుకొన్నాడు మాధవ్.

బల్లమీద ఫ్లాస్కు, కప్పుసాసర్లు రెడీగా ఉన్నాయి.

వేడి వేడిగా ఒక కప్పు టీ తీసుకొని అలసటనీ, తలనొప్పినీ పోగొట్టుకోవాలని ఉన్నా అభిమానంతో ముట్టుకోదలచలేదు స్వప్న. తనూ ఓ కుర్చీలో కూర్చొని టేబిల్ మీదున్న మాగజైన్ చేతిలోకి తీసుకొంది.

మాధవ్ కాస్త తగ్గినట్టుగా లేచాడు. రెండు కప్పుల్లో టీ పోసి ఒకటి స్వప్న దగ్గరుంచాడు.

"తీసుకో. చల్లారిపోతుంది."

"అక్కర్లేదు."

"అంత అభిమానస్తురాలివి నా దగ్గరికి ఎందుకు వచ్చావ్?"

"వచ్చాను. పోతాను కూడా. కాని, నా ఒక్క ప్రశ్నకు మీరు జవాబు చెప్పాలి!"

"..............."

"మీ వయసు ముప్పైకి రెండు తక్కువ! యువకులై ఏ పది పన్నెండు సంవత్సరాలో అయిఉంటుంది! ఈ పది పన్నెండు సంవత్సరాలలో ఏ స్త్రీ

మిమ్మల్ని ఆకర్షించలేదా? ఏ స్త్రీతోనూ మీరు దగ్గరి సంబంధం పెట్టుకోవాలని తహతహలాడలేదా?''

''నేనేం అంత చపలుణ్ణి కాదు!''

"అదేం అంత గర్వించాల్సిన సంగతి కాదు లెండి! మీరు మగవారు కారన్న అనుమానం మీకు రాకపోవడం ఆశ్చర్యం! ఏ డాక్టరుకైనా చూపించుకోవాల్సిన మాట!''

''షటప్!''

''ఆడదాన్నై ఉండీ తాళికట్టిన భర్తతో వేరొక పురుషుణ్ణి ప్రేమించానని చెప్పగలిగాను. నిజం చెప్పడానికి మీకెందుకు భయం?''

మాధవ్ వెటకారంగా అన్నాడు. "నువ్వు నన్ను వదిలేస్తావన్న భయం చేత!"

"తప్పుచేసింది అనే స్త్రీ మీద ఒక రాయి విసరాలన్న కుతూహలాన్ని మించి మరేదీ కలుగదనుకొంటాను మనిషికి. ఆ రాయి విసిరే మనస్తత్వమే చూస్తున్నాను ఈ మాధవ్, బి.ఇ.లో.

"నిజాయితీ వ్యక్తంచేసే గుండె నిబ్బరమే మీకుంటే నాకు నిజం చెప్పండి. ఇన్నేళ్ళ యవ్వనంలో మిమ్మల్ని చలింపజేసిన బలహీనక్షణాలు లేనే లేవా? మీ దగ్గరికి వచ్చిన స్త్రీ లేనే లేదా?"

"నేను బ్రహ్మచారిని కాదు!" ఈ మాట సగర్వంగా చెప్పాలనుకొన్నాడు గాని సూటిగా పదునెక్కిన కళ్ళతో చూస్తున్న స్వప్నముందు కించిత్ సంకోచానికి లోనుకాక తప్పలేదు!

"కాని, నేను కన్యను! మీ ముందు నేను సిగ్గుపడాల్సింది, జంకాల్సింది లేదనుకొంటాను! స్త్రీ ప్రేమ వ్యభిచారంగా, పురుషుడి ప్రేమ శృంగారంగా వర్ణింపబడడం—నిజంగా న్యాయమైందనే అంటారా?"

"న్యాయం సంగతేమోగాని ఇద్దరిని ఆనందపరిచే క్షణాలే పురుషుణ్ణి తప్పించుకొనేలా, ఆడదాన్ని తల్లిగా చేస్తాయి! ప్రకృతిలోనే ఉందికదా పక్షపాతం?"

ప్రకృతి పక్షపాతం చూపించినంత మాత్రాన ఆమెను పతితను చేయాలా ఈ మనుషులు? పురుషుణ్ణి రసికమహారాజులా కీర్తించాలా? ఇదెక్కడి న్యాయం?

"నాకథ అంతదూరం వెళ్ళకపోయినా నన్ను ఇంత హీనంగా, అగౌరవంగా మీరెందుకు చూస్తున్నారు? ప్రేమించడం అంత పాపమా? పెళ్ళికాకముందే బ్రహ్మచర్యం కోల్పోయిన మీకంటే పాపినా?"

"..........."

"నేను స్వరూప్‌ని ప్రేమించాను. పెళ్ళికూడా చేసుకోవాలనుకున్నాను.కాని, కుటుంబం, సంప్రదాయం, మాన మర్యాదలు సంకెళ్ళువేసి వెనక్కిలాగాయి. విడాకులిస్తానంటూ మీ దగ్గరినుండి ఉత్తరం వచ్చేదాకా నేను అదే విషా

దంలో కుమిలినమాట నిజం। పెద్దగీతను చిన్నగీతను చేయాలంటే దానిపక్కన దానికంటే పెద్దగీతను గీయాలన్నట్టు మీ ఉత్తరం చూశాక నా మనసులో స్వరూప్ బాధ మాయమై నా సంసారం ఎలా నిలబెట్టుకోవాలా, నా బ్రతుకు నవ్వులపాలు కాకుండా ఎలా కాపాడుకోవాలా అన్న తాపత్రయం మొదలైంది। అవివాహితగా నా జీవితం ఒక్క కుటుంబంతోనే ముడిపడిఉంటే ఇప్పుడు రెండు కుటుంబాలతో ముడిపడింది।"

"ఇంత ఆలోచన ప్రేమకు ముందు రాలేదా?"

"వస్తే ఇవాళ మీతో ఇన్ని మాటలు పడాల్సిన అవసరం వచ్చేదికాదు। సుమ పరిమళంలా గుండెలోకి చొచ్చుకువచ్చే ప్రేమను వారించడం ఎరితరం? ఈ ప్రేమ నన్ను పిచ్చిదాన్నిచేసి నా కుటుంబం పరువుప్రతిష్ఠలు రచ్చకీడ్చక ముందే నేను నిగ్రహించుకోగలిగాను। నా పెద్దల ఆజ్ఞకు లోబడి మీ ముందు తలొంచి తాళిగట్టించుకోగలిగాను।"

"గొప్పపనిచేశావ్। దీన్ని త్యాగ మనరు। మనసు ఒకరికిచ్చి శరీరాన్ని యంత్రంగా మార్చి మరొకరితో కాపురంచేయడం మోసం। వంచన। మనసులేని ఒక బొమ్మతో కాపురం చేయాల్సినంత దిక్కుమాలినవాడిని కాదు!"

"నన్ను గాయపరిచేలా మాటలని మాటమీద మాట అనేలా చేశారుగాని, లేకపోతే నా నోటినుండి ఇన్నిమాటలు వొచ్చేవికాదు. నేను వచ్చింది మిమ్మల్ని ప్రార్థించడానికి।మీరు నానుండి విడిపోవడానికై నిశ్చయించుకొంటే ఒక సంవత్సరందాకా ఆగమని నా ప్రార్థన। నేను బొమ్మనో మనిషినో మీకు తెలిసిపోతుంది. ఈ సంవత్సరంలో। ఆ తరువాతకూడా మీరు విడిపోవడానికే నిశ్చయించుకొంటే ఏ కోర్టులూ అక్కరలేదు। నేనే దూరమైపోతాను। నా ప్రేమకథ,నా భర్త ప్రేమకథ, నా భర్త నన్ను త్యజించడం ప్రజలు అసహ్యంగా చెప్పుకోకముందే ఈ ప్రపంచంనుండే వెళ్ళిపోతాను?"

"బెదిరింపా?" భుజాలు ఎగరవేశాడు మాధవ్.

"బెదిరింపులకు లొంగి ఏమగాడూ ఆడదాన్ని చేరదీయడన్న సంగతి నాకు తెలుసు. నా ప్రేమకోసం నా కుటుంబం మానమర్యాదలు మంటగలిపే ఇష్టంలేక నేను స్వరూప్‌ని దూరంచేసుకొన్నాను. దూరంచేసుకొవికూడా నేను అనుకొన్నది సాధించలేకపోతే నేను బ్రతకడ మెందుకు?"

"మనిషిని దూరంచేసుకొన్నావేమో గాని మనసులోకూడా దూరంచేసుకోగలవా?"

"ఏడాది కాలంలో మీరా సత్యం గుర్తించలేరా?"

"అయితే ఏడాదిపాటు మనం కలిసి ఉండాలంటావు! ఆపైన మనం భార్యాభర్తలంగా జీవించడమో, విడిపోవడమో జరగాలంటావు!"

"అవును, ఇది ఒక అగ్రిమెంటు అనుకొందాం.

"ఆల్‌రైట్! నేనెందుకు కాదనాలి?"

స్వరూప్ తన భగ్నప్రణయం గురించి చెప్పిననాటినుండి గుండెలో భగభగలాడుతున్నదేదో కొద్దిగా చల్లారి నట్లనిపించింది మాధవ్‌కు. ఎవరికో మనసిచ్చి అతడితో ప్రేమవ్యవహారం నడిపిన అమ్మాయి మెడలో తాళికట్టిన తన దౌర్భాగ్యానికి ఎంత విచారించాడో, తన భార్య ప్రేమకథ నలుగుర్లో పడితే తన బ్రతుకు, తన కుటుంబం ఎంత నవ్వులపాలు అవుతుందో ఊహించుకొంటూంటే ఒంటికి కారం రాచుకొన్నట్టుగా అనిపించేది! నిజంగా ఆనాటి నుండి ఒకవిధమైన నరకం అనుభవించాడు తను!

స్వప్న చెప్పిన పద్ధతి బాగానేఉంది!

భౌతికంగానే కాదు, మానసికంగా కూడా గతాన్ని ఆమె సమాధిచేయగలిగితే ఆమెతో కాపురం చేయడానికి తనకేమీ అభ్యంతరంలేదు!

స్వప్న డ్యూటీలో జాయిన్ అయింది.

ఇద్దరూ కలిసి మూడురోజులు తిరిగారు ఇంటికోసం. ఒకమాదిరి ఇల్లు దొరికింది.

స్వప్న ఊరికివెళ్ళి పెళ్ళిలో తనకి బహుమతులకింద వచ్చిన సామాను, పుట్టింటివాళ్ళిచ్చిన సామాను తెచ్చుకొంది. అయిదువందలు ఖర్చుచేసి సంసారానికి అవసరమైన మరికొంత సామానుకూడా కొంది. ఒక సెలవు రోజున ఇల్లంతా నీట్‌గా సర్దుకొంది. ఆఫీసునుండి వచ్చిన మాధవ్‌కి గృహిణి నేర్పరితనం కొట్టవచ్చినట్టు కనిపిస్తున్న ఇంట్లో సేదదీరినట్టయింది. గోడలకి చక్కని చిత్రపటాలు, కిటికీలకీ గుమ్మాలకీ మంచి డిజైన్లలో ఉన్న తెరలు, చక్కగాఅమర్చిన ఫర్నిచర్—ఇంటి రూపమే మారిపోయినట్టుగా ఉంది.

స్వప్న టీచరేకాదు. మంచి గృహిణి కూడా నన్నమాట!

మనసులో తృప్తిలాంటిదేదో నిండిపోగా ఈజీచెయిర్‌లో శరీరం వాల్చాడు.

"ముఖం కడుక్కువస్తే టీ ఇస్తాను!" స్వప్న గుమ్మందగ్గరికి వచ్చి అంది.

"పిక్చర్‌కి వెడదామా, స్వప్నా?"

"ఉహుం. చాలా అలసిపోయాను. వచ్చే ఆదివారం వెడదాం."పని అలసట ఆమె ముఖంలో స్పష్టంగా కనిపిస్తోంది.

వాడిపోయిన ఆ ముఖం చూస్తూంటే జాలేసింది మాధవ్‌కి. బట్టలు మార్చుకొని లోపలికి వచ్చి "చాలా అలిసిపోయినట్టున్నావు! నేనేమైనా సాయంచేయగలనా?" అని అడిగాడు.

డికాక్షన్ ఫిల్టర్ చేస్తున్న స్వప్న

చిన్నగా నవ్వింది. "మీ కేం చేతవుతుంది ?"

"మరీ మగాణ్ణని అలా తీసివేయకు ! తలచుకుకొంటే మాకు చేతగాని విద్యేముంటుంది ? ఈ నైట్ కు నేను వంటచేయనా ?"

"మీకు వంట వచ్చా?"స్వప్న కళ్ళలో తెచ్చిపెట్టుకొన్న ఆశ్చర్యం.

"రాదు. నీ శ్రమ పంచుకోడానికి నేనూ వంట నేర్చుకొంటాను. ఇద్దరం బయట కష్టపడి వచ్చేవాళ్ళం. ఇంట్లో నువ్వొక్కదానివే కష్టపడడం న్యాయం కాదు."

ఒక సెలవురోజు మాధవ్ పిక్చర్ ప్రోగ్రాం పెడితే స్వప్న జూపార్క్ కు వెడదామంది.

సరే నన్నాడు మాధవ్.

తినడానికి కొంచెం ఫలహారం, ఫ్లాస్కులో టీ తీసుకొంది స్వప్న. టీ తాగడానికి గ్లాసులతో సహ వైర్ బాగ్ లో సర్దేసి బయల్దేరింది.

పార్కులో అడుగుపెట్టాక ఈ లోకాన్నే మరిచిపోయినట్టుగా అయింది స్వప్న. రంగు రంగుల్లో సుమబాలల సౌందర్యం విరబోస్తూంటె రకరకాల వన్యమృగాలు కళ్ళను తిప్పనీయడం లేదు ! ప్రతీదీ చిన్నపిల్లలా చూస్తూ మనసారా ఆనందిస్తున్న స్వప్నను చూస్తూంటే ఆమెపట్ల ఆకర్షణ పెరిగిపోతోంది మాధవ్ కి. ఏ బాధా తెలియని దానిలా సరదాగా క్షణాలు దొర్లిస్తున్న స్వప్న భగ్నప్రేమిక అంటే ఎవరూ నమ్మరు !

ఈ స్వప్నకి, ఈ సౌందర్యరాసికి తను విడాకులివ్వా లనుకొన్నాడా ? ఎన్నో మంచి గుణాలున్న ఈ స్వప్నని తూలనాడింది తనేనా ?.... స్వప్నకి విడాకు లివ్వాలనుకొన్న తన ఒకనాటి ఆలోచనకు తనను తాను నిందించుకో సాగాడు మాధవ్. స్వప్న తెలివైంది కాబట్టి తనలా తొందరపడకుండా తనకొక అవకాశం ఇచ్చింది ! ఈ అవకాశంతో తన జీవితాన్ని స్వర్గతుల్యం చేసుకోవాలి !

ఒకనాటి ప్రేమ కథను స్వప్న ఎలా మరిచిపోవాలనుకొందో, అది తనూ మరిచిపోవాలి! ఆమె మనసులో స్వరూప్ స్థానాన్ని తను గెలుచుకోవాలి !

"అలసటగా లేస్తోంది ! ఇక్కడ కూర్చొని తెచ్చినవి ఖాళీచేసేద్దామా ?"

"...... ...... ......"

"కన్ను తిప్పుకోకుండా ఏం చూస్తున్నారు ? ఏం అద్భుతం కనిపిస్తోంది నా ముఖంలో ?" విస్మయంతో అడిగింది స్వప్న.

"ఒక సౌందర్య భరిణె ! ఒక సుగుణాల రాసి!" చూపు తిప్పుకోకుండానే అన్నాడు.

స్వప్న ఫక్కున నవ్వింది. "ఆ నిర్ణయానికి రావడానికి, ఆ బిరుదు లివ్వ

డానికి ఏడాదిలో వారమే దొర్లిపోయిందని మరచిపోకండి!"

ఒక చెట్టుక్రింద బెంచీ దగ్గరకి నడిచింది. వైర్‌బాగ్ లోంచి ఫ్లాస్కు, మిగతా సామాను తీసింది.

డబ్బామూతలో బూందీ పోసి మాధవ్‌కి ఇచ్చింది. మాధవ్ తింటూ అన్నాడు. "నిన్ను తెలుసుకోవడానికి ఏడాది అక్కరలేదు, స్వప్నా! నువ్విచ్చిన అవకాశం నిన్ను పోగొట్టుకొనే దురదృష్టం నుండి తప్పించిందనుకొంటున్నాను!"

"అవకాశం నేను మీ కివ్వలేదు! ఈ అవకాశాన్ని నేనే అర్థించి మీ నుండి పొందాను!"

"నువ్వు పొందిన అవకాశం నా పాలిటి అదృష్టంగా భావిస్తున్నాను!"

"తొందరగా చేసుకొనే నిర్ణయాలెప్పుడూ తొందరగానే పోతాయి!"

ఆ మాటలోని యదార్థం మాధవ్‌ని మరి మాట్లాడనివ్వలేదు!

## 8

టేబిల్ మీద గడియారంలో రేడియం డయల్ ముళ్ళు రాత్రి పదకొండు గంటల సమయాన్ని సూచిస్తున్నాయి. రాత్రి ఒంటరి తనం ఉక్కిరి బిక్కిరి చేస్తుంటే మాధవ్ అసహనంగా బెడ్‌మీద దొర్లుతున్నాడు. ఆ వయసుకి సహజమైన అకలి, దాహం అతడిని ఉడికించి వేస్తోంటే 'భార్య ఉండీ నాకీ ఒంటరితనం ఏమిటి?' అనుకోసాగాడు. కాని, స్వప్నని పిలువడానికి సాహసం చాలడం లేదు. తను ఏ కాస్త చిలిపితనం ప్రదర్శించినా కళ్ళలో తీక్షణత, ముఖంలో సీరియస్‌నెస్ చోటు చేసుకొనే స్వప్న తన కోరిక మన్నిస్తుందా!

కరిగిపోతున్న కాలం మాధవ్‌లో కోరికను రగిలిస్తూంటే స్వప్న తన కోరిక మన్నిస్తుందా అన్న మీమాంస తొలగి' నా కోరిక తీర్చకపోతే తనెందుకీ ఇంట్లో? ఆమెను బలాత్కారంగానైనా ఆక్రమించుకొనే హక్కు తనకుండగా తన శరీరాన్ని ఇంత చిత్రహింస పెట్టుకోవడం ఎందుకన్న ధీమా పెరిగింది.

బెడ్ మీద నుంచి లేచి తూలుతూ వెళ్ళి పక్కగది తలుపు తట్టాడు.

"స్వప్నా! తలుపు తెరూ?"

"...............”

"ఏయ్, స్వప్నా!"

"ఏమిటండి? ఏం కావాలి?" నిద్రమత్తుగా వినిపించింది స్వప్న గొంతు.

"దాహం వేస్తుంది. మంచి నీళ్ళు కావాలి!"

"టేబిల్ మీద పెట్టానుగా?"

"సరిగా మూత పెట్టలేదు. లైట్ పురుగు పడింది నీళ్ళలో!" అతడి గొంతు మామూలుగా లేదు! ఒక విధమైన వణుకుతో వస్తోంది మాట.

"అబ్బ! నిద్ర వస్తోంది. కిచెన్‌లోకి వెళ్ళి తెచ్చుకోండి."

"ముందు నువ్వు తలుపు తెరు." అతడి కంఠంలో కఠినత్వంతో పాటు అధికారంకూడా చోటుచేసుకొంది.

"ఎందుకు?"

మాధవ్ పాదం ఎత్తి తలుపు మీద గట్టిగా తన్నాడు. "ముందు తలుపు తీస్తావా లేదా?"

స్వప్నకి పరిస్థితి అర్థమైపోయింది. మగవాడిలో సహజంగా మేల్కొనే మృగం మేల్కొందని! ఇప్పుడు తను తలుపు తీస్తే ఆ మృగానికి తను ఆహారమైపోతుంది. ఆహారం కావడానికి తను సిద్ధమే. మాధవ్‌కి తనపట్ల కలుగుతున్న ఆకర్షణ ఇక్కడితో ఆగిపోతుంది. మామూలు భర్తగా మారిపోతాడు. ఈ ఆకర్షణ పెరగాలి బాగా పెరగాలి. తనంటే పడిచచ్చేంత పెరగాలి. భవిష్యత్తులో అతడు తనను శంకించలేనంతగా అనురాగ బద్ధుణ్ని చేసుకోవాలి. అప్పుడూ అతనికి తను లొంగడమనేది!

స్వప్న తలుపు దగ్గరగా వచ్చి అంది. "మనం పెట్టుకొన్న గడువు దాటేదాకా రాత్రి పూట ఈ తలుపు తెరుచుకోదండీ!"

"నీ తలకాయ! గడువు తీసి గట్టున పెట్టు! తలుపు తెరువు! తెరవకపోతే రేపే పంపేస్తాను నిన్ను!" రౌద్రంగా అరిచాడు.

"ఈ గడువు నేను తమాషాకి పెట్టలేదు. మీరు నన్ను అర్థం చేసుకోవాలని, మీలో ఏ అనుమానం మిగలకుండా నన్ను విశ్వసించాలని! మనం భార్యాభర్తలంగా జీవించడం మొదలుపెట్టాక మన మధ్య ఏ విధమైన కలతలూ రాకూడదండీ!"

మాధవ్ స్వరం మృదువుగా మారిపోయింది. "నిన్ను అర్థంచేసుకోవడానికి ఏడాది కాలం అక్కరలేదు, స్వప్నా! నువ్వు నాకు అర్థమైపోయావు! నువ్వు చాలా మంచి అమ్మాయివి

# గమనిక

దీపావళి యువ ప్రత్యేక సంచిక వెలువడే సందర్భంగా "క్విజ్" "భావపరిచయ పోటీ" శీర్షికలను ప్రస్తుతానికి ఆపుచేస్తున్నామని తెలియపరుస్తున్నాం.

ఎడిటర్, యువ

నిన్ను భార్యగా పొందడం నా అదృష్టంగా భావిస్తున్నాను!"

"ఉహూఁ. ఈ ఏడాది గడువు కేవలం మీ కోసమే పెట్టలేదు. నన్ను నేను అదుపులోకి తెచ్చుకోడానికి, స్వరూప్ తలంపు తుడిచివేసుకోడానికి నాకు కొంత కాలం కావాలి! నేను మీ కౌగిలిలో ఉన్నప్పుడు నాలో స్వరూప్ మెదలకుండా ఉండడం కోసం ఈ గడువు నాకు కావాలి! ప్లీజ్! నన్ను అర్థం చేసుకోండి!"

ఈ సమయంలో స్వప్న నోటినుండి స్వరూప్ పేరు వినేసరికి మాధవ్ మైకం వదిలిపోయింది. పళ్ళు పటపట కొరుకుతూ వచ్చి బెడ్‌మీద పడ్డాడు. 'దెయ్యం రేపే పంపేస్తాను! ఆ స్వరూప్ తోనే ఊరేగు!" అని గొణుక్కుంటూ.

తెల్లవారింది.

మామూలుగా ఆరు గంటలకల్లా లేచి స్నానం చేసి వంట ముగించింది స్వప్న.

ఎనిమిది అయినా మాధవ్ మాత్రం లేవలేదు!

మెలుకువ అయినా బద్ధకంగా అలాగే పడుకొన్నాడు.

"ఏమండీ!" స్వప్న గదిలోకి వచ్చి పిలిచింది. "లేవండి! ఆఫీసుకు వేళవు తూంది!"

మాధవ్ కళ్ళుతెరవకుండానేఅన్నాడు "ఆఫీసు! ఉద్యోగం! ఎవడికి కావాలి? పోతేపోనీ! జీవితమే నాశనమైపోగా..."

"ఒక ఆడది మోసగించినంత మాత్రాన మగవాడి జీవితం నాశన మౌతుందా? ఈ స్వప్న కాకపోతే మరో స్వర్ణ దొరుకుతుంది మీకు!"

"నా అవస్థ ఏదో నేను పడతాను. ముందు నువ్వు నా ఇంట్లోంచి వెళ్ళిపో!"

"అలాగే పోతాను. ముందు మీరు లేచి ఆఫీసుకు తయారుకండి!"

"ఉహూఁ. నేనీరోజు ఎక్కడికీ వెళ్ళను!"

"నాలాంటి భార్య దొరకడం మీ అదృష్టమన్నారు!"

"ఇప్పుడనుకొంటున్నాను చాలా దురదృష్టమని!" విసురుగా అన్నాడు.

"ఆ నిర్ణయానికి రావడానికి ఏడాదిలో రెండువారాలే గడిచిపోయాయి!" స్వప్న నవ్వుతూ మాధవ్ మీదినుండి బ్లాంకెట్ లాగేసింది. "లేవండి! ఏకాంతంలో వ్యథ అధికమౌతుంది! అలా నలుగుర్లోకి వెళ్ళపడితే మిమ్మల్ని మీరు మరిచిపో గలుగుతారు!"

మాధవ్ లేచి గబగబా తనపనులు పూర్తిచేసుకొని భోజనం చేయకుండానే వెళ్ళిపోయాడు. నిన్నటిదాకా నడిచిన దినచర్యకు భిన్నంగా. ఇద్దరూ ఒకేసారి భోజనంచేసి ఇంటికి తాళంపెట్టి ఇద్దరూ ఒకేసారి బయల్దేరేవారు!

స్వప్న నుండి ఒక నిట్టూర్పు గుండెల్ని చీల్చుకువచ్చింది. మాధవ్‌కి ఎదురుతిరగడంవల్ల అతడిలో ఆకర్షణ పెరుగుతోందా? తరుగుతోందా?

దీని తెలుపుచేసే శక్తిని మీకు మీరే ఋజువు చేసుకోండి:

# సూపర్ రిన్‌తో తళతళలాడే తెలుపు మరే ఇతర డిటర్జంట్ బిళ్ల లేదా బార్ కంటే తెలుపు







ప్రతిసారీ క్రమం తప్పకుండా సూపర్ రిన్ వాడి మీ బట్టలు మరింత తెల్లగా ఎలా అవుతాయో చూడండి. మరే ఇతర డిటర్జంట్ బిళ్ల లేదా బార్ కంటే ఎంతో తెల్లగా ఉతుకుతుంది సూపర్ రిన్. ఎందుకంటే, సూపర్ రిన్‌లో ఉంది ఉత్తమమైన తెలుపుచేసే శక్తి. దీని తెలుపు చేసే శక్తిని మీకు మీరే ఋజువు చేసుకోండి.




**మరే ఇతర డిటర్జంట్ బిళ్ళ లేదా బార్ కంటే మరింత తెలుపు చేసే శక్తి**

హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పాదన.

లింటాస్–RIN. 34-1710 TL (RR)

స్వప్నతో మాటలు మానేసేవాడు మాధవ్. ఇంట్లో తినడం మానేశాడు, స్వప్న కలుగజేసుకోబేతే విదిలించి వేస్తున్నాడు.

## 9

సాయంత్రం బడివదిలాక బస్‌స్టాప్‌లో నిలబడింది స్వప్న, బస్సుకోసంచూస్తూ ట్రాఫిక్ చాలా రద్దీగాఉంది రిక్షాలు, ఆటోలు, స్కూటర్లు అన్నీ లైన్‌లో వెళ్ళిపోతున్నాయి!

అంత రద్దీలోనూ....

స్కూటర్‌మీద వెడుతున్న అతడిని చూసి గుండె జల్లుమంది స్వప్నకు అతడుకూడా ఇటుచూశాడు కాని, ఆగలేదు స్కూటర్.

అతడు స్వరూప్ కదూ? అవును. స్వరూపే! లక్షమందిలోనైనా అతడిని తను గుర్తించగలదు! స్వరూప్ తనని చూశాడు. అయినా ఆగలేదు. తనని గుర్తించలేదా? గుర్తించకపోవడమే తన అదృష్టం! తిరిగి అతడు తనకు దగ్గరైతే .... ఊహించుకోవవుటానికే ఇష్టపడలేదు స్వప్న.

కాని, అయిదారు నిమిషాలు గడవక ముందే అతడు తిరిగివచ్చి స్వప్న ముందు నిలబడ్డాడు. నేలమీద కాలానించి "నువ్వు... ఇక్కడ జాబ్‌చేస్తున్నావా, స్వప్నా? వచ్చి ఎన్నిరోజులైంది ?" అతడి ముఖంలో కొండంత సంభ్రమం.

జవాబు గొంతీగినట్టుగా వచ్చింది స్వప్ననుండి.

ఆమె ముఖం వెలవెలబోతూఉంటే, జీవితంలో ఇంకెప్పుడూ చూడనేమో అనుకొంటున్న తన స్వప్నను మళ్ళీ ఇంతతొందరగా, ఆకస్మికంగా చూడడం వల్ల కలిగిన ఆనందం అతడి ముఖాన్ని చేటంత చేసింది. "ఎక్కడ పని చేస్తున్నావు? నువ్వుండడం ఎక్కడ? నీతో ఎవరొచ్చారు?"

హడావిడిగా ప్రశ్నలవర్షం కురిపిస్తున్నాడు స్వరూప్.

స్వప్న గుండెలమీద పాలిస్టర్ చీర వెనకాల ధగధగలాడుతున్న కొత్త మాయని మాంగల్యాలు లక్ష వోల్టుల కరెంట్ షాక్‌లా తగిలాయి అతడిని.

నెత్తురుచుక్క లేకుండా పాలిపోవడం ఇప్పుడు స్వరూప్ వంతు అయింది. "నువ్వు....నువ్వు ఇంత తొందరగా పెళ్ళిచేసుకోగలిగావా, స్వప్నా?" దెబ్బ తిన్నవాడిలా ఆక్రోశిస్తున్నట్టుగా అడిగాడు. గుండెలో బాకు దిగినబాధ అతడి కళ్ళలో స్పష్టంగా కనిపిస్తోంటే స్వప్న అపరాధిలా తల వాల్చుకొంది.

"ఏ ఊరిచ్చారు నిన్ను? మీ ఆయన కూడా ఇక్కడే పనిచేస్తున్నాడా?"

"నా బస్సు వచ్చేసింది" స్వప్న పరుగెత్తింది అప్పుడే ఆగిన బస్సు దగ్గరికి. బస్సు ఎక్కుతూనే కదిలింది.

ప్రాణంలేని బొమ్మలా చాలాసేపు నిలబడిపోయాడు స్వరూప్

ప్రకృతి రహస్యం కనుగొనబడింది!




# ఇది సహజంగా, మృదువుగా మీ వంటి చాయను పెంపొందిస్తుంది

ఫెయిర్ అండ్ లవ్‌లీలోగల ఒక అపూర్వమైన పదార్థం, మీ చర్మాన్ని నల్లబరిచే ప్రక్రియను ఆపుచేసి, వెనక్కు నెడుతుంది, అదీ సహజంగా, మృదువుగా, సురక్షితంగా. ఇక రోజూగనక వాడితే, 6 వారాలలో మీ శరీర చాయ యితరులు మెచ్చేలాగ ఎర్రబరుస్తుంది,




**ఫెయిర్ అండ్ లవ్‌లీ - నల్లని చర్మాన్ని ఎర్ర బరచడం కోసం సున్నితమైన తీరు**

లింటాస్-FALOV. 9-172 TL

## 10

"మనుషులింత చిత్రంగా ఎలా మారిపోతారో అర్థంకాదురా! నీ భార్యను తీసుకువచ్చాక నా ఇంట్లో కాపురం పెడతానన్నావు! నాకు హోటల్ తిండి తప్పిస్తానన్నావు! ఆరోజు వెళ్ళి మళ్ళీ ముఖమైనా చూపించావా?" కోటీలో షాపింగ్ చేస్తున్న మాధవ్‌ని పట్టుకొన్నాడు స్వరూప్.

"సారీ రా! మాకు మంచి ఇల్లు దొరికింది."

"మంచిఇల్లు దొరకదని నాఇంట్లో ఉండమన్నానా? వేరే ఇల్లు తీసుకొనేప్పుడైనా నీకు మన స్నేహం గుర్తు రాలేదా!"

స్వరూప్ చనువుగా నిష్ఠూరం చేస్తూంటే ఇబ్బందిగా ముఖం తిప్పుకొన్నాడు మాధవ్. ఇంకా ఆ స్నేహం అలాగే ఉందనుకొంటున్నాడు పిచ్చివాడు! తన భగ్నప్రణయం వినిపించినవాడే పాలు విరిగిపోయినట్టుగా విరిగిపోయింది ఆ స్నేహం! తన భార్య అతడి ఊహల్లో కాపురంచేసే ప్రేయసి అనిపించినప్పుడల్లా ఒంటికి కారం రాచుకొన్నట్టుగా ఉంటుంది!

"లైట్‌గా ఏదైనా తీసుకొందాం" అంటూ మాధవ్‌ని తాజ్‌లోనికి లాక్కుపోయాడు స్వరూప్.

"పెళ్ళి పార్టీ ఇవ్వనేలేదు! ఈరోజు బిల్లు నీదే!"

"నీకిష్టమైనది ఆర్డరివ్వు!"

నాలుగురకాలకి ఆర్డరిచ్చాడు స్వరూప్. ప్లేట్లు నెమ్మదిగా కాళీచేస్తూ "ఊఁ ఇక చెప్పరా! మీ ఆవిడకు వంట బాగా చేతవుతుందా?" అని అడిగాడు.

"హోటల్ తిండి అంత మొహం కొట్టిందా ఏమిటిరా? పెళ్ళిచేసుకొంటే ఆ బాధ తప్పుతుందికదా!"

"ఈ జన్మకి పెళ్ళిలేదు. ఇల్లాలి చేతి భోజనం తినే అదృష్టం అసల్లేదు! నీలాంటి గృహస్థులు ఒకపూట భోజనానికి పిలిస్తే పరమానందపడిపోతాను!"

"..........."

"వచ్చే ఆదివారం నీఇంటికి వస్తాను. నువ్వు పిలవాల్సిన అవసరంలేదు. వచ్చి మీ ఆవిడతో స్నేహం చేసుకొంటాను. ప్రతి ఆదివారం మాయింటికి భోజనానికిరా, అన్నయ్యా!' అని ఆవిడ నోటినుండి అనిపించుకువస్తాను!"

"అలాగే రారా!" బలవంతంగా నవ్వు తెచ్చిపెట్టుకొంటూ అన్నాడు మాధవ్. తన భార్య స్వరూప్ ప్రేయసి కాకపోతే, స్వరూప్ తనంతట తను భోజనానికి వస్తాననే పరిస్థితి రానిచ్చేవాడా? వీణ్ణి తమలో ఒకడిగా చేసుకొనేవాడు!

"మొన్న సాయంత్రం స్వప్న కనిపించిందిరా! పెళ్ళిచేసుకొంది. మాట్లాడిస్తే సరిగా మాట్లాడలేదు. బస్సెక్కి-





# నోటి దుర్వాసనను ఆపండి...
# కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో
# దంతక్షయాన్ని ఎదుర్కోండి

ప్రతిసారి భోజనం చేసిన తర్వాత, కోల్గేట్‌తో మీ పళ్ళను తోముకోండి. కోల్గేట్, ప్రపంచమంతటా దంత వైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది.

మీ పళ్ళలో మిగిలిపోయే ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది. అవి ముందు నోటి దుర్వాసన, అటుపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి.

అందుకే మరి ఎప్పుడూ భోజనంకాగానే కోల్గేట్‌తో తోముకోవడం సరైన మార్గం. అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు, పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు, దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది.

కోల్గేట్ యొక్క నమ్మకమైన సూత్రీకరణ ఎలా పనిచేస్తుందంటే :



మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది.



కోల్గేట్ యొక్క సాటిలేని చర్యగల నురుగు బాగా లోతుకుచేరి హానికరమైన ఆహారపు అణువులను బాక్టీరియాను తొలగిస్తుంది



ఫలితం: ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు, శ్వాస తాజాగా ఉందన్న నమ్మకం, దంతక్షయంనుండి రక్షణ

హాయినిగొల్పే, తాజా శ్వాసకోసం, పళ్ళను తెల్లగా రూపొందించేందుకు ప్రపంచంలో ఎక్కువ మంది, మరే ఇతర టూత్‌పేస్ట్ కన్న ఎక్కువగా కోల్గేట్‌నే కొంటూ ఉంటారు !




సంపూర్ణ దంత రక్షణకోసం కోల్గేట్ ట్విగార్డ్ టూత్‌బ్రష్‌లను వాడండి. అవి పళ్ళ ఎనామెల్‌ను కాపాడి పళ్ళపైవచ్చే ప్లేక్ బారినుండి రక్షించడంతోబాటు చిగుళ్ళకు రక్షణ సమకూరుస్తాయి మీ కుటుంబంలోని ప్రతివారికీ అనువుగా 8 రకాలలో దొరుకుతాయి

**ఒక్క దంతవైద్యులు మాత్రమే దీనికన్న మేలైన దంతరక్షణ సమకూర్చగలరు.**

DCG 64 TL

తుర్రుమంది. స్వప్న ఇంత తొందరగా నన్ను మరిచిపోగలిగిందంటే, పెళ్ళికూడా చేసుకోగలిగిందంటే నాకెంత ఆశ్చర్య మనిపించిందో? తాను నన్ను ఎంతో ప్రేమించినట్లే నటించింది. నటనే కాక పోతే ఇంతతొందరగా మరో మగవాడిని జీవితంలోకి ఆహ్వానించగలదా?"

"మొన్నంటే?" తనలో కలిగిన కంపరం పైకి వ్యక్తంచేయకుండా అడిగాడు.

"మంగళవారం సాయంత్రం."

"మంగళవారం సాయంత్రం!"

స్వప్న ఆరోజు ఇంటికి వచ్చి తలకు గుడ్డచుట్టుకు పడుకోవడం గుర్తు వచ్చింది మాధవ్‌కి. ఆమె కళ్ళు జ్యోతుల్లా ఎర్రబడడంకూడా గుర్తుంది. అయితే ఆరోజు స్వరూప్ కలిశాడన్న మాట స్వప్నకి. ప్రియుడు కనిపించగానే పక్కఎక్కిన స్వప్నను ఏమనుకోవాలి? ఇక్కడ వీడు ప్రేయసికి దూరమై పిచ్చెక్కిపోతుంటే అక్కడావిడ వీడి ఊహలతో విరహబాధ పడుతూ న్నట్టుంది.

వీళ్ళు ఒకసారి కలిసిన వాళ్ళు మళ్ళీ కలువకుండానే ఉంటారా? కథ మళ్ళీ మొదటికి రాకుండానే ఉంటుందా? స్వరూప్ తన మనసునుండి అదృశ్యం కావాలంటే ఏడాది గడువు కావాలంది స్వప్న. ఈ లెఖన జీవితకాలం సరిపోదు.

పిలువకపోయినా వస్తానన్న స్వరూప్ ఆ ఆదివారం రానేలేదు.

పెద్ద రిలీఫ్ ననుభవించింది మాధవ్ మనసు.

మళ్ళీ ఆదివారం రానే వచ్చాడు స్వరూప్.

అతడిని గుమ్మంలో చూడగానే గతుక్కుమన్నాడు మాధవ్. పెదవులకు నవ్వు అతికించుకొని లోపలికి ఆహ్వానించాడు.

గది నలుమూలలా కలియజూస్తూ "అద్దె ఎంత?" అన్నాడు స్వరూప్.

"రెండు వందలు! మూడు గదులు, కిచెన్ ఉన్నాయి. అంతా సేపరేట్."

"నీ ఆఫీసుకు దూరం కదా?"

"మా ఆవిడ పనిచేసే స్కూల్‌కి దగ్గర!"

"ఓ! ఆవిడ ఉపాధ్యాయిని అన్నావు కదూ?" ఉపాధ్యాయిని పేరు వినగానే తనకి స్వప్న గుర్తుకు వచ్చినట్టుగా అతడి ముఖం విషాదంగా మారింది.

ఆఫీసు విషయాలపై సంభాషణ దొర్లింది మాధవ్ పనిచేస్తున్న ఆఫీసుకీ తనకి ట్రాన్స్‌ఫర్ అయ్యే సూచన లున్నాయని చెప్పాడు స్వరూప్.

(సశేషం)

---

Printed and Published by A. Chandraseker Rao at 5-9-88, Public Garden Road Hyderabad-500001, for YUVA Publications and Printed at Dolton Press, Public Garden Road, Hyderabad-500 001 Editor: A. SUDHAKARA RAO

# బ్రిటానియా పాల బిస్కట్



## పెరిగే పాపాయిలకు రుచివంతమైన తోడు!

రుచికరమైన,
పుష్టికరమైన
బ్రిటానియా
మిల్క్ బికీస్




లింటాస్—BBC-MB-3-172 TL

